అట్టలోపలివైపున అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

*VETURI PRABHAKARA SASTRI* - Monograph in Telugu on modern Telugu writer by P.Seshagiri Rao. Sahitya Akademi, 1999, Rs. 25.



First Publised 1999

ISBN - 81 - 260 - 0728 - 1

**సాహిత్య అకాదెమీ**

రవీంద్ర భవన్, 35, ఫెరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - **110001**

విక్రయ విభాగము :

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ-**110001**

జీవన్‌తార భవనము, 4వ అంతస్తు, 23A/44X

డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా-**700053**

**172,** ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,

దాదర్, ముంబాయి - **400014**

గుణా బిల్డింగ్, **304-305,** అణ్ణా సాలై,

తేనాంపేట, చెన్నై-**600018**

సెంట్రల్ కాలేజ్ క్యాంపస్,

డా. బి.ఆర్. అంబేద్కర్ వీధి, బెంగళూరు-**560 001**

రూ. **25-00**

Laser Typeset at : MAP Systems, Bangalore.
Printed at : Ananya Publications, Bangalore.

# విషయ సూచిక

# 1.నేపథ్యము

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (1988-1950) ప్రజ్ఞామేరువు కవిచూడామణి విమర్శకాగ్రేసరులు, పరిశోధకపరమేశ్వరులు. ప్రాచీనగ్రంథ పరిష్కర్తగా, లిపిప్రవీణులుగా-వ్యావహారిక భాషావాద సమర్థకులుగా-శివ కవితామర్మజ్ఞులుగా, జానపదవాఙ్మయోద్ధారకుడుగా, శాసనపరిష్కర్తగా, చరిత్ర నిర్మాతలలో ప్రముఖులుగా ప్రాచీనాంధ్రసంకలన ప్రచురణకర్తగా, సంస్కృత రూపకానువాద కర్తగా - తాటియాకులలో చివికి, స్మృతిపథమే నివాస స్థానముగా నున్న చాటుపద్యము లెన్నింటినో శ్రమకోర్చి, ఏర్చి, కూర్చి సంధానించి ప్రకటించుటలో ఆద్యుడుగా, గాలికబుర్లు -కవితలు- కైఫీయతులు, మధురకవితలు తెలుగులోకము దృష్టినుండి మరుగున పడిపోకుండా నిలువబెట్టిన వాఙ్మయోద్ధారకుడుగా తెలుగులిపి సంస్కారమునకు కొత్త బాటలు వెలియుంచుటలో ఒక్కడుగా, గ్రంథపరిష్కరణనొకకళగా దిద్దితీర్చిన భాషాశిల్పిగా- స్వయముసంకలన కర్తగా- ప్రాచీన కావ్యవ్యాఖ్యాతగా భాషాసారస్వతములను మథించిన మహానుభావులు. శబ్దార్థవిచారణలో ఆయన జగజెట్టి. భాషాపరిశోధన కాధార గ్రంథముల ఆవశ్యకమును గుర్తించి, అందుకై శ్రమించిన తొలి కృషీవలులో ఒకరు. ఎటు చూచినా ఏడునిలువుల యెత్తు ఎదిగిన ప్రభాకరుల చారిత్రక నేపథ్యం ఏమిటో పరిశీలించటం అవసరం

భారతీయ జనజీవితంలో - కళాసాహిత్యరంగాలలో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థంలో పునరుజ్జీవనం ఆరంభమైంది తొలివెలుగులు ప్రసరించి కాలక్రమేణా కాంతి దీప్తిమంతల కాసాగింది. దీనితో క్రొత్తచైతన్యం జాతిలో తొణికిసలాడింది సాంఘికసంస్కరణలలోనూ పునరుజ్జీవనం మొదలయింది. బ్రహ్మసమాజం మేధావుల ఆలోచనాసరళిలో మార్పు తెచ్చింది. గతానుగతికంగా పోయే ధోరణిలో మార్పు ఏర్పడింది. రాజారామ్మోహన్ రాయ్ వంటివారు క్రొత్త త్రోవలు తీసినారు

దక్షిణదేశపు ధ్రువతారగా సామాజిక స్పందన కల్గించిన వారిలో కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919)గారు ప్రముఖులు ఈయన ఒకచేత్తో సామాజిక చేతనను స్పందింపచేస్తూనే, వేరొక చేత సర్వసాహిత్య ప్రక్రియలకు వరవడిపెట్టినారు. ఆయన చరిత్ర, నాటకములు - ప్రహసనములు - కవుల చరిత్ర శోధన, కవితలు, వ్యాకరణము, విమర్శ, తుదకు తరగతి వాచకములు ఇట్లెన్నో రంగాలలో ప్రవర్తిల్లినారు. వావిలాల వాసుదేవశాస్త్రివంటివారు ఆంగ్ల నాటకా లనువదింపసాగారు.

1850-1900 నడుమ ప్రకాండు లెందరో సాహిత్యరంగం మీదకు వచ్చి మేలికృషి చేశారు. అట్టివారిలో పరవస్తు చిన్నయసూరి, బహుజనపల్లి సీతారామాచార్యులు, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం పంతులు, చదలువాడ సీతారామశాస్త్రి, వేదము వేంకటరాయశాస్త్రి (1853-1951) ప్రభృతు లున్నారు.

మదరాసు యూనివర్శిటీ స్థాపన, కళాశాలలు, ఉన్నతపాఠశాలలు ఏర్పడటంతో ఆంగ్లభాషాధ్యయనం మేధావివర్గాన్ని ప్రభావితం చేసింది. ఆంగ్లభాషా సంసర్గంవల్ల తెలుగువారిలోకూడా కొత్త ఆలోచనలు ఊపిరిపోసుకొన్నాయి పాఠశాలలలో/కళాశాలలలో పండితులు ప్రవేశించారు వాటికై పాఠ్యపుస్తకాల అవసరం ఏర్పడింది. విద్యాస్థాయి కనుగుణంగా రచనలు కావలసి వచ్చినాయి కవిత్వంలో - విమర్శలో - రచనా ఫక్కీలో ప్రాతధోరణు లుపోయి క్రొత్తవి వచ్చినాయి. సి.పి బ్రౌను ఆంధ్రభాషోద్ధరణానికి ఏతామెత్తడంతో గురుమూర్తి శాస్త్రివంటి పండితుల నాయన చేరదీసి ప్రాచీనగ్రంథాలకు వ్యాఖ్యలు వ్రాయించటం, నిఘంటు నిర్మాణం చేయించటం మాత్రమేకాక, ప్రాచీన తాళపత్ర గ్రంథాలు, కవిలెలు, కైఫీయతులు సేకరింపసాగినాడు ఈ కృషి అముద్రిత గ్రంథ ప్రచురణకు కొత్త ఊపు నిచ్చింది. పూండ్ల రామకృష్ణయ్యగారు (1860-1904) అముద్రిత గ్రంథప్రచురణార్థం 'అముద్రిత గ్రంథచింతామణి' అనే పత్రికనే స్థాపించినాడు ' వ్యాకరణ, ఛందో విమర్శకూడా ఒకభాగం దానిలో.

గురజాడ అప్పారావు ఆంగ్ల, గ్రీకు, రోమన్ సాహిత్యాలను లోతుగా చదివి ఆకళించుకొన్నారు సాహిత్యజీవికి సానుభూతి అవసరమని నమ్మినవాడు భాషలో-భావనలో - ఛందోగతిలో మార్పులు గొనివచ్చినాడు. ఇది ఇట్లుండగా, వ్యావహారికభాష రచనారంగప్రవేశం చేసి క్రొత్తహొయలు చూపి జనరంజనం చేయసాగింది

అచ్చుయంత్రా లప్పుడప్పుడే ప్రధాననగరాలకు చేరుకొన్నాయి దానితో ఊహ కందని మార్పు సాహిత్యంలో చోటు చేసుకొంది. జనంలో గ్రంథపరనా జాగరణ ఏర్పడింది పూర్వపు తాటియాకుల్లో నిద్రిస్తున్న తెలుగు కావ్యాలు వెలుగు చూడటం మొదలయింది. ప్రచురణలో నూతనశకం వచ్చింది సాహిత్యపత్రికలు పుంఖానుపుంఖాలుగా పుట్టుకొచ్చాయి. చిన్నయసూరి 'బాలవ్యాకరణం' ఈదశలోనే వచ్చింది. అయినా వ్యవహార భాషలో వ్యాఖ్యానాలు వస్తూనే ఉన్నాయి. క్రొత్త కవులకూ, రచయితలకూ పత్రికలు ప్రోత్సాహాన్ని ఇచ్చాయి. కందుకూరి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రివంటివారు స్వయము పత్రికలే నడిపారు

అంతకుముందు సాహిత్య గోష్ఠులేకాని, ప్రచురణావకాశాలు లేవు. కథలు, గాథలుగా మిగిలిపోయేవి. పందొమ్మిదవశతాబ్దంలో సంస్థానాలు సన్నగిల్లి, జమిందారీలు ఏర్పడ్డాయి. అవి సంప్రదాయ పరిరక్షణకే దోహదం చేశాయి కాని, క్రొత్త వెలుగులు, ప్రయోగాలు చేయటానికి సహాయకారులు కాలేదు. అయితే ప్రాచీన కావ్యా లెన్నో అచ్చుపడ్డమాట మాత్రం నిజం

ఈ కాలంలోనే మాడభూషి వేంకటాచార్యులు (1835 - 1895) మరుగున పడిన అవధానప్రక్రియకు క్రొత్త ఊపిరి పోసినారు. అవధానాన కళకు ప్రజల ప్రోత్సాహం చేకూరింది. తరువాత తిరుపతివేంకటకవులు, శేషాద్రి రమణకవులు, రామకృష్ణకవులు, కొప్పరపు సోదర కవులు ఇట్లెందరో ఆత్రోవలో జంటజంటలుగా పయనించి తమ కీర్తిబావుటాల నెగురవేశారు

రాజకీయ చైతన్యం చాపక్రింద నీరులా చల్లచల్లగా కదల సాగింది ప్రజలలో నాజాతి, నాభాష అన్న గాఢ కాంక్ష రేకెత్తింది.

ఇరువదియవ శతాబ్ది తొలి చరణంలో కట్టమంచివారి కవిత్వతత్త్వవిచారము (1914) అచ్చయింది తెలుగులో నూతన దృక్పథం తొంగిచూచింది. కేవల శబ్దార్థ చర్చలే ప్రాముఖ్యం వహించిన దశను దాటి, తెలుగు విమర్శకులు ఒక్కొక్క కావ్యాన్ని అఖండంగా భావించి, ఆ దృష్టితో అనుశీలించి కావ్యైక్యము, పాత్రపోషణ, శైలి, సన్నివేశౌచిత్యమూ, రసము మున్నగువానిపై చూపు సారించి విశేష కృషి చేయసాగినారు

పాత గాడినుండి సాహిత్యము విడివడి క్రొత్త పంథాలో విస్తరింప సాగింది. కొమఱ్ఱాజు లక్ష్మణరావు (1877-1923) ప్రభృతులు పరిశోధనలో నూతనావిష్కారాలు కనుగొన్నారు. మానవల్లి రామకృష్ణకవి (1866-1957) మున్నగువారు విస్మృత గ్రంథావళిని ప్రచురింప నారంభించినారు.

భాషలో - సాహిత్య ప్రక్రియల్లో - విమర్శలో - గ్రంధపరిష్కరణకళలో క్రొత్తదనం పొడచూపింది అంధపరంపరా న్యాయంగా ఉన్న సాహిత్యక్షేత్రం ఇరవయ్యో శతాబ్దం వచ్చేసరికి క్రొత్తపోకడలకోసం ఎదురు తెన్నులు చూచింది విమర్శ, విశ్లేషణ, సృజన రంగాలలో క్రొత్తచైతన్యం ఊపందుకొంది ఆంగ్ల భాషాధ్యయనం చేసిన కొత్తతరం, కేవల సంప్రదాయ రీతిలో ఆలోచించటం మాని, క్రొత్తకోణాలు వెదుక్కోటం ఆరంభించాయి తెలుగులో నాటక రచన - ప్రధానంగా అనువాద నాటక రచన పుంజుకొనటం మొదలయింది స్వతంత్ర నాటకాలూ వచ్చాయి

కందుకూరి, గురజాడ మున్నగువారు మార్గదీపికలైనారు. భాష, సంస్థానాధీశుల కొలువు కూటం నుండి బయటపడి, ప్రజాసదస్సులను అలంకరించింది. అవధానకళవల్ల జరిగిన మే లేమంటే, భాషాపోషణలో ప్రజలు భాగస్వాము లయినారు తెలుగుబాస రుచులు, చమత్కారాలు చవి చూచి జనం ఆనందతన్మయు లయ్యారు ముద్రిత గ్రంథాల అందుబాటుతో చెప్పుకోతగ్గట్టు జనానీకంలో సాహిత్య పిపాస పెరిగింది. నలువైపులా భాషాలత కొనలు సాగి, మొగ్గలు తొడిగి, పరిమళించి పరిమళాలు చిమ్మింది

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలో పునరుజ్జీవనం ఆరంభమై, తర్వాతి శతాబ్దానికి వాకిళ్ళు తెరిచింది

జీవితంలోనూ సాహిత్యంలోనూ ఉత్తమ విలువలను దర్శించి, రెంటిలోనూ పరమార్థం తరచి చూపగల మహావ్యక్తి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆవిర్భవించటానికి ముందు, భాషా - సాహిత్య - సాంఘిక రంగాలలో పురరుజ్జీవనం ఆరంభమైన దన్న ఎరుకతో శాస్త్రిగారి సాహితీ ప్రభలను తిలకించవలసి ఉంది ఈ దృశ్య నేపథ్యంలో వాఙ్మయాకాశంలో 'ప్రభాకరో'దయ మైనది.

# 2. బాల్యము - చదువుసంధ్యలు

తెలుగుగడ్డలో నడిబొడ్డున ప్రవహించే కృష్ణానది ఒడ్డున దివిసీమలోని పెదకళ్ళేపల్లి ప్రభాకర శాస్త్రిగారి జన్మస్థానం. తండ్రి వేటూరి సుందరశాస్త్రి, తల్లి శేషమ్మ సుందరశాస్త్రిగారు స్మార్త - వైదిక - జ్యౌతిష - శిల్ప - సంస్కృత - ఆయుర్వేదాల్లో నిష్ణాతులు. దివిసీమలో పేరుమోసిన వైద్యులు ప్రభాకర శాస్త్రిగారు సర్వజిత్ మాఘబహుళ ఏకాదశీ మంగళవారం ఉదయాది 10 ఘడియలకు జ్యేష్ఠా నక్షత్ర చతుర్థపాదంలో, అనగా క్రీ శ 1888 ఫిబ్రవరి 7వ తేదీన జన్మించారు. శ్రీవత్స గోత్రికులు. వెలనాటి బ్రాహ్మణులు. సుందరశాస్త్రిగారికి కుమాళ్ళు నల్వురు. (1) వెంకట శివశాస్త్రి, (2) ప్రభాకర శాస్త్రి, (3) చంద్రశేఖర శాస్త్రి, (4) శంకర శాస్త్రి. ఇందు రెండవవారే మనకు ప్రసక్తులైన ప్రభాకర శాస్త్రిగారు

ఈ పెదకళ్ళేపల్లి చల్లపల్లి సంస్థానం లోనిది. ఆ ఊరుగురించి శాస్త్రిగారు 'చిన్ననాటి చేష్టలు' కావ్యంలో ఇట్లా వ్రాసుకొన్నారు.

పూర్వకాలమునను పేర్వెలసినది మా
వీడు వేదశాస్త్ర విద్యలకును,
దాని మారుపేరు దక్షిణ కాశిక
కృష్ణ యచట యుత్తరించి సాగె

తండ్రి సుందరశాస్త్రిగారికి పురోహితత జీవిక అయినా, ఆయుర్వేదమే జీవితాన్ని నడిపింది. 'మా ప్రభాకరం వంశోద్ధారకు డవుతాడని' ఆయన అంటూండేవా రట ! అది బ్రహ్మవాక్కు అయింది

బాలప్రభాకరులు పెదకళ్ళేపల్లిలో కొట్టరువు సుందరరామయ్యగారి వీధిబడిలో తొలిపాఠాలు నేర్చుకొన్నారు అవే ఆనాటి ప్రాథమిక పాఠశాలలు.

'మా యూరు పూర్వము (అనగా ఒక శతాబ్ది క్రిందట) వేదశాస్త్రాది విద్యావిదులగు విప్రులతో సర్వవర్ణముల వారితో విలసిల్లినది. నా పసితనమునగూడ

(1888-98) వేదవిద్యా విశారదు లనేకులు మాగ్రామమం దుండిరి[1]. సుందరశాస్త్రిగారి యిల్లు సంస్కృతాంధ్ర నిఘంటువులకూ ధర్మశాస్త్రాది గ్రంథాలకూ కాణాచి. అందువల్ల ఎందరో విద్వాంసు లాపుస్తకాలకోసం వీరింటికి వచ్చేవారు తత్ఫలితంగా బాలప్రభాకరులు చిన్నతనంలోనే పండిత గోష్ఠులు వినటానికి అవకాశం కుదిరింది. బాల్యంనుండి ప్రభాకరులకు గ్రంథపఠనం వ్యసన మయ్యింది. ''తెలుగు రచన లనగా చిన్ననాటనుండియు బులుపాటము తెలుగు పద్యములు వినుటకై చెవికోసుకొనువాడను. గుజ్జనగూళ్ళతోపాటు తెలుగు రచన తీయదనముకూడ మా నాయనగారు నన్నాస్వాదింపించినారు'' ఎడనెడ తెనుగు మఱుగులు కొన్ని ప్రాస్తావికంగా కుమారునకు చెబుతూండేవారు సుందర శాస్త్రిగారు ఆంధ్రమున మంచిసాహిత్యమూ కవితాపరిజ్ఞానమూ కలవారు. (ఆయా) ''భాషల ముచ్చటలబడి నేను ఇంగ్లీషు నిరాకరించితిని''[2]. అది యటుండ ఇంగ్లీషు చదువులు వ్యయప్రయాసలతో కూడి ఉండటం, మరీ దూరప్రాంతాల్లో ఒంటరిజీవితం, తలిదండ్రుల వీడవలసి రావటం - ఈకారణాలవల్ల ఆంగ్ల విద్యంటే ప్రభాకరు లిష్టపడలే దనిపిస్తుంది. తెలుగుపై మోజువల్ల సంస్కృతాంధ్రాలు నేర్వటంలోనే బాలప్రభాకరులకు మనసు పడింది.

వీధిబడి చదువులైన తర్వాత, ఆఊళ్ళోనే మద్దూరి రామావధానుల వారి కడ సంస్కృతం, ఇంట తెలుగులు నేర్చుకొన్నారు తండ్రిగారూ, వీరూ సహాధ్యాయు లవటం మరింత దోహదం చేసింది.

పల్లెల్లో ఆనాటివారి నైష్ఠిక జీవనసరళి తెలుసుకోతగింది. రామావధానులుగారు బ్రాహ్మముహూర్తంలోనే నిద్రలేచి, వేళకు సంధ్యావందనాగ్నిహోత్రాలు ముగించుకొని ఒక గంటసేపు ఉంఛవృత్తి నెరపేవారు మధ్యాహ్నసమయంలోనే విద్యార్థులకు పాఠాలు. ప్రభాకరులు వీరికడ శబ్దపరిచయమూ కాళిదాసత్రయమూ పూర్తిచేశారు.

పెదకళ్ళేపల్లికి నాలుగుమైళ్ళు 'చల్లపల్లి'. అది జమీందారీలోనిది. దానికి ప్రభువులు శ్రీరాజా యార్లగడ్డవారు. తెలుగునాటి నాలుగు చెరగులనుండి కవి, పండితు లెందరో వచ్చి జమీందారులనుండి పారితోషికాలు తీసుకోవటం పరిపాటి. అద్దేపల్లి సోమనాథశాస్త్రిగా రక్కడే ఉండేవారు. వారు విజయనగరంలో ఉన్న, విఖ్యాత తర్కవిద్వాంసులు సూరి భీమాచార్యులవారి దగ్గర సంగమేశ్వరశాస్త్రిగారితో కలసి పెక్కేండ్లు తర్కశాస్త్రాన్ని అధ్యయనం చేశారు. సోమనాథశాస్త్రిగారు 'అనంత శయనం' మహారాజులచే స్వర్ణకంకణ బహూకృతిని పొందారు. అట్టి విద్యాప్రపూర్ణులకడ ప్రభాకరులు విద్యకై ప్రవేశించారు. అక్కడే అవ్వారి

1. ప్రజ్ఞాప్రభాకరము - పుట 3
2. ప్రజ్ఞాప్రభాకరము - పుటలు 29, 30

సుబ్రహ్మణ్యశాస్త్రి, సిసిపాటి వేంకట్రామ శాస్త్రి సహాధ్యాయులైనారు ప్రభాకరులు అక్కడ లఘు కౌముది, తర్కశాస్త్రంలో ఒకటి రెండు ప్రకరణాలు, సభాష్యముగా పతంజలి యోగసూత్రాలు, కావ్యనాటక - అలంకారాది సాహిత్య గ్రంధాలు శ్రద్ధతో చదువుకొన్నారు పతంజలి యోగ సూత్రాధ్యయనం ప్రభాకరులలో చొచ్చుకొనిపోయి వింతయోచనలు గొల్పసాగింది. కాలాంతరంలో వారి యోగానుష్ఠానాని కిది దోహదమ్మైంది పదహారేళ్ళ వయస్సు వచ్చేవరకూ వారి ఒజ్జరికంలోనే ఉన్నారు

ఆ రోజుల్లో పెదకళ్ళేపల్లిలో తంగిరాల వేంకటావధానులు, శిష్ట్లా చయనులు, యడవల్లి అప్పావధానులు, బుద్ధు భూషయ్యశాస్త్రి మున్నగు ఉద్దండ పండితు లెందరో ఉండేవారు. ఆ ఊరి ఆలయ మండపాల్లోనూ, అరుగులమీదా వీరంతా సాయంకాలాల్లో చేరి శాస్త్ర, సాహిత్యగోష్ఠులు నెరపుకొంటూ ఆనందంలో ఓలలాడే వారు పాడి పంటలకు లోటులేని ఊళ్ళు; ఆ ప్రసంగాలు పాండిత్య ప్రగల్భత, సండిత సత్కారాలు, సాహిత్య చమత్కారాలతో మారు మ్రోగుతూండేవి. ఎన్నో శాస్త్రవిషయాలు బాలప్రభాకరులు వినటం జరిగింది అది ఎంతో సంస్కారాన్ని పెంచింది ఇంటా బయటా సాహిత్య వాతావరణం ముఖరితం కావటంవల్లా, సహజంగా తెలుగుపై వెఱ్ఱిమో జుండటం వల్లా ప్రభాకరశాస్త్రిగారు సంస్కృతాంధ్రాలు నేర్చుకోవటానికి మొగ్గటమే కాదు, జీవితమంతా దానికే ధారవోసినారు. నిసర్గ ప్రవృత్తికి ఈ వాతావరణం మరింత ఊత మిచ్చింది

ఇది ఇలా ఉండగా 1904 నాటికే బందరు ప్రాంతాల్లో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి (1870-1950)గారి పేరు మారుమ్రోగుతూండేది ఎన్నో కథలు, గాథలు, చమత్కారాలు ప్రజలు వారిగురించి చెప్పుకుంటూండేవారు తెనుగునాట అన్ని సంస్థానాలు ఆయన దర్శించి సన్మానాలు పొందారు. ఆరోజుల్లో చెళ్ళపిళ్ళవారు పాల్గొని సభ అంటూ లేదు ప్రభాకరుల కాయన దగ్గరకు వెళ్ళాలని సంకల్పం కలిగింది. అంతకు ముందే చల్లపల్లిలోని తమ సహాధ్యాయులు బందరు చేరి వెంకటశాస్త్రిగారికడ సాహిత్య విద్య నేర్వనారంభించారు ఇది ప్రభాకరులకు మరింత ప్రోత్సాహ మ్నిచ్చింది అదను చూచుకొని వెంకటశాస్త్రిగారి దగ్గరకు చేరినారు (1904). అప్పుడు ఓలేటి వేంకట్రామశాస్త్రిగారున్నూ అక్కడకు చేరినారు. ఆయనే ఆ తర్వాత రామకృష్ణ కవులలో ఒక్కరుగా ప్రసిద్ధులైనారు.

[1]''తెలుగున నా కేమేని యెఱుక యేర్పడె నన్నచో అది శ్రీ వెంకటశాస్త్రిగారి గురుతానుగ్రహప్రాప్తమే. వారి దగ్గర పుస్తకము పట్టి చదివిన దాని కంటె వారి ముఖతః వినోదగోష్ఠిలో విని నేర్చినది చాలా. వెంకటశాస్త్రిగారి సన్నిధిని అవధానధారణలు, పద్యరచనలు, ఉపన్యాసవినోదములు, కవితా కల్పనములు, వాద ప్రతివాదములు

---

1. ప్ర.ప్రభా - పుట 32 ప్ర. ముద్రణ

హోరెత్తిపోవుచుండెడివి '' వెంకటశాస్త్రిగారి ప్రసంగాలు వినటమే ఒక సాహిత్య విద్య అంటారు, ఎరిగిన పెద్దలు.

అవధానవిద్యకు పెట్టిందిపేరు తిరుపతి వెంకట కవులు చెళ్ళపిళ్ళవారి ఒజ్జరికంలో ఎదిగిన వాళ్ళులోనే అష్టావధాన, శతావధాన కళలు నేర్చినారు పెదకళ్ళేపల్లికి గురువులను తీసుకొనివెళ్ళి ప్రభాకరు లష్టావధాన మొనర్చినారు అంటే విద్యార్థిదశలోనే అష్టావధాన విద్య వీరి కబ్బింది 1911లో జార్జి పట్టాభిషేక ప్రత్యేక సంచికను ప్రచురించింది కాకినాడనుండి వెలువడే, 'సరస్వతి' మాస పత్రిక అందులో కొన్ని పద్యాలు వీరు ప్రకటించారు వాటి దిగువ 'శతావధాని వేటూరి ప్రభాకరశాస్త్రి' అని ఉన్నది అవధాన విద్య రాజ్య మేలుతున్న రోజులవి అందుచేత ఆ విద్యకు ప్రభాకరు లాకర్షితు లవడం వింతకాదు అయితే శాస్త్రిగారు ఆ తరువాత అవధానవిద్యకు స్వస్తిచెప్పి, కవితా, పరిశోధన రంగాలను ప్రధానీకరించుకొన్నారు ఉన్నతశిఖరా లందుకొన్నారు

'బందరులో చదువుకొనుచుండు కాలమున నేను కొండ వెంకటప్పయ్య పంతులుగారి యింటను, . శ్రీవల్లూరి సూర్యనారాయణరావుగారి యింటను నివసించువాడను. వారి కప్పుడు నాపై వాత్సల్యము ఇరువురూ ప్రసిద్ధ న్యాయవాదులు. ఉత్తమసంస్కారవాసితులు. శ్రీసూర్యనారాయణరావుగారి ప్రేరణముననే నేను మద్రాసు చేరితిని ''[1]

ఉభయభాషల్లో, శతావధాని చెళ్ళపిళ్ళవారి శుశ్రూషలో సంపాదిత పాండిత్యాన్ని గడించుకొని ప్రభాకర శాస్త్రిగారు జీవికకై మద్రాసు పయనమైనారు.

శ్రీశాస్త్రిగారిది బాల్యంనుండి గతానుగతికంగా పోయే ప్రవృత్తి కాదు. మూఢవిశ్వాసా లంటే ఏవగింపు. జాతరలన్నా జంతుబలులన్నా విలవిలలాడి-పోయేవారు. ఎక్కడ ఆర్తి కనబడ్డా అంతరంగం చుమ్మలు చుట్టుకుపోయేది. చిన్నతనంనుండి స్వతంత్ర ప్రవృత్తి

ప్రభాకరులు తమ గురువుల కిట్లు కైమోడ్చినారు.

వేంకట శాస్త్రి 'పండిత కవిప్రభు పాదము లాశ్రయించి ని
శ్శంకముగా గడించితిమి శక్త్యను సారము సంస్కృతాంధ్ర కూ
లంకష పాండితిన్ కవనలాఘవమున్ పటు శబ్దశాస్త్రమున్
జంకము మేము, మత్కవిత సర్వము తత్కరుణాత్తమే చుమీ !

1. ప్ర. ప్రభా పుట 33

# 3. పల్లెనుంచి పట్నానికి

రెండేళ్ళపాటు చెళ్ళపిళ్ళ శతావధానుల కడ సాహిత్యవిద్య, కవనలాఘవమూ గడించుకొని 1906లో జీవికకై మద్రాసు చేరుకొన్నారు ప్రభాకరులు వకీలు వల్లూరి సూర్యనారాయణరావు (1866-1937)గారి ప్రోత్సాహంతో పాటు, రెంటాల వెంకట సుబ్బారావు (1860-1918)గారి కొక పరిచయ లేఖను కూడా శాస్త్రిగారి కిచ్చారు. అప్పటికే శాస్త్రిగారి బావగారు కాజ శేషయ్యగారు వేపా రామేశం పంతులుగారి దగ్గర పనిచేస్తుండేవారు. అందుచేత శాస్త్రిగారికి మదరాసు పయనము క్రొత్తనిపించలేదు. అప్పటికి శాస్త్రిగారి వయస్సు పదునెనిమిదిదేండ్లు. తృణమణి వివేచనము, సద్గురువరణము చదువుకొనే రోజుల్లోనే వీరి కబ్బిన గుణాలు.

ఆనాడు మదరాసు, సాహితీ సంస్కృతులకు కేంద్రస్థానం కందుకూరి, వేదము, కొక్కొండ వంటి పెద్దపెద్దపండితుల కది నిలయము. [1]'మదరాసు చేరగానే వెస్లీ మిషను హైస్కూలులో తెలుగు పండితుడనుగా కుదుర్కొంటిని' మదరాసులోని ప్రభుత్వ ఓరియంటల్ లైబ్రరీకి వెళ్ళి విశ్రాంతి సమయాలలో అపూర్వగ్రంథాలను చదువుతూ వైదుష్యమును పెంచుకొమ్మని వల్లూరి వారిచ్చిన సలహాను తు.చ. తప్పక పాటించినారు. సెలవు దొరికితే చాలు ఆ లైబ్రరీకి పోవటమే! శాస్త్రిగారికి, తిమింగలానికి సముద్రప్రవేశం దొరకినట్లయింది. చిన్నతనంలో వీరేశలింగంగారి రచనలు చదవటంవల్ల, వారిలా భాషాసాహిత్యాల్లో అలుపులేని శ్రమ చేయాలనే ఒక దృఢనిశ్చయానికి శాస్త్రిగారు వచ్చారు. అట్లా నాలుగేళ్ళు పండితపదవిలోఉన్న తరువాత మదరాసు ఓరియంటల్ లైబ్రరీలో కాపీయిస్టుగా 22-8-1910న రు 20-1-25ల వేతనంపై ప్రవేశించారు. ఆ యేడే ప్రభాకరశాస్త్రిగారు, ఘంటశాల వాస్తవ్యులు పిసిపాటి జగన్నాథంగారి కుమార్తె 'మహాలక్ష్మి'ని వివాహమాడినారు.

---

1 ప్ర. ప్రభా- పుట 36

'తన్నితే బూరుల గంపలో పడ్డట్లు' శాస్త్రిగారికి ఉద్యోగం ఓరియంటల్ లైబ్రరీలో దొరకటంతో, అసలే విద్యావ్యసని అయిన కారణాన నిర్విరామంగా గ్రంథపఠనం చేయసాగినారు. నాలుగేళ్ళుగా అక్కడే ఉండటంవల్ల ముద్రితాముద్రిత గ్రంథాలు, లోకల్‌రికార్డులు గాలిస్తూ, అపూర్వాంశాలను గుర్తిస్తూ - అందు కొన్నిటిని మిత్రుల కుత్తరాలద్వారా తెలియబరుస్తూండే వారు. అప్పుడే లైబ్రరీవారు 'క్యాటలాగు'ల నిర్మాణంచేపట్టారు శాస్త్రిగారికి పండితులుగా పదోన్నతి కల్పించి, ప్రభుత్వంవారు, ఆపనిలో నియమించారు 1939వ సంవత్సరాంతం వరకూ శాస్త్రిగారు లైబ్రరీ పండితులుగా వర్తించారు.

**పెద్దలతో పరిచయాలు :** శాస్త్రిగారికి తొలుత ప్రసిద్ధన్యాయవాది వేపా రామేశం పంతులుగారితో పరిచయమైంది. ఆయన విద్యారాశి న్యాయశాస్త్రంలోనే కాక, గణిత - ఖగోళ - చరిత్రాది శాస్త్రాలలో అందేవేసిన చేయి. వారితో శాస్త్రిగారికి గంటల తరబడి గోష్ఠి. ఎన్నో గ్రంథాలు చదవటానికి ప్రత్యక్షప్రేరణ వారే. తరువాత విఖ్యాత వైద్యులు పండిత డి. గోపాలాచార్యులవారు (1872 - 1920). ఆయన మంచి సాహితీ రసజ్ఞులు కూడా. వారిద్వారా పనప్పాకం అనంతాచార్యులు (1843 - 1908) గారితో మైత్రి. ఆయన అఖిలభారత జాతీయ కాంగ్రెసు (1891) అధ్యక్షులైనవారు. వారికి 'ప్రింటింగు ప్రెస్సు' ఒక టుండేది. అందులో తెలుగు గ్రంథా లచ్చుపడు తూండేవి దానకర్ణులు జయంతి కామేశం (1846-1886) వీరికి ప్రియమిత్రులు అనంతాచార్యులవారి భవనం ఎప్పుడూ కవి, పండితులతో కలకలలాడు తూండేది. నగరంలోని పండితమండలి అక్కడకు చేరి సాహిత్య గోష్ఠులు నెరపుతూండటం అలవాటు. మానవల్లి రామకృష్ణయ్య (1866-1957) గారికి 'కవి' బిరుదు ప్రసాదించింది అనంతాచార్యులవారే. ప్రభాకరులకు 'కవిచూడామణి' బిరు దిచ్చిందికూడా వారే. అభినవమల్లినాథులు వేదము వేంకటరాయశాస్త్రి (1851-1929) తమవ్యాఖ్యానాల్లో శాస్త్రిగారి నెక్కడ పేర్కొన్నా 'కవిచూడామణి' బిరుద పూర్వకంగానే. ఆ బిరుదాన్ని వేటూరి వారెప్పుడూ పెట్టుకోలేదు. సహజంగా వారు వీటికి విముఖులు.

అటు పిమ్మట చెన్నపట్టణంలో ప్రముఖులైన రెంటాల వేంకటసుబ్బారావు, డాక్టర్ ఆచంట లక్ష్మీపతి (1880-1966), కాశీనాథుని నాగేశ్వరరావు (1867-1938), టంగుటూరి ప్రకాశంపంతులు (1872-1957), అయ్యదేవర కాళేశ్వరరావు (1881-1962) గార్లతో పరిచయమేర్పడి క్రమంగా సాన్నిహిత్యం పెరుగుతూ వచ్చింది. అట్లే తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్య (1871-1921)గారితో మైత్రి.

సహజంగా చొరవచేత, ఈ పెద్దల పరిచయాలవల్ల మదరాసులో ఏసభజరిగినా ప్రభాకరులు పాల్గొనటం, సందర్భోచితంగా కొన్ని పద్యాలు చదవటం ఆనవాయితీ అయింది. శొంఠి వెంకట రామమూర్తిగారు ఐ సి.ఎస్. పరీక్షకు లండన్ వెళ్ళినపు డాశీర్వదిస్తూ, కొన్ని పద్యాలు చదివారు తర్వాత ఆయన మద్రాసు రాష్ట్రప్రభుత్వముఖ్యకార్యదర్శిగా, బొంబాయిరాష్ట్ర తాత్కాలిక గవర్నరుగా పదవు లలంకరించిన వ్యక్తి.

ఉద్యోగరీత్యా కన్నడిగ, తమిళ విద్వాంసులతో పనిచేయటంతో ఆయా భాషలలోనూ మంచి పాండిత్యం సంపాదించుకొన్నారు శాస్త్రిగారు. సజాతిభాషాపరిచయం, పదముల అర్థవివేచనలో వారి కెంతో ఉపకరించింది నిష్కృష్టంగా అర్థనిర్ణయం చేసేవారు. సహజంగా శాస్త్రిగారిది పరిశోధన దృష్టి.

క్రమంగా వేదం వారితో సాన్నిహిత్యం వృద్ధయింది. తరచు ఇరువురూ ఎక్కడో ఒకచోట కలసి గోష్ఠి చేసుకొనేవారు. వేదం వారంటే శాస్త్రిగారి కాజీవితమూ ఎనలేని గౌరవమూ, భక్తి ఉండటం మే మెరుగుదుము

అట్లే గురజాడ అప్పారావుగారితో, వారి ద్వారా గిడుగు రామమూర్తి (1863-1940) గారితో ప్రసిద్ధ పరిశోధకులు కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ (1891-1963) ప్రభృతులతో స్నేహ మేర్పడింది వేలూరి శివరామశాస్త్రి (1891-1967) తాతా సుబ్బారాయశాస్త్రి మున్నగువారితో మిక్కిలి చనువు. వీరు మద్రాసు వస్తే శాస్త్రిగారింటనే బస, ఆతిథ్యమూ ఇట్లా దేశంలో ప్రసిద్ధులైన పండితులతో, మేధావులతో, పెద్దలతో గాఢానుబంధంవల్ల శాస్త్రిగారి ఆలోచనా పరిధి, అవగాహన విస్తరించి పరిణతికి దోహదమయింది.

శాస్త్రిగారు తాత్కాలిక ప్రాతిపదికపై మదరాసు రాజధానీ కళాశాలలో 1931-39 నడుమ పండితులుగా పలుమార్లు పనిచేశారు అక్కిరాజు ఉమాకాన్తవిద్యాశేఖరులు (1889-1942) సెలవుమీద వెళ్ళినప్పు డల్లా ప్రభుత్వం ప్రభాకరశాస్త్రిగారిని నియమించేది. ఆ పదవికి ఖాళీ యేర్పడినప్పుడు వీరిని నియమించకపోవటము చిత్రంగా కనిపిస్తుంది.

ప్రభాకరశాస్త్రిగారు ముప్పదేండ్లపాటు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ ప్రధానపండితులుగా వర్తించారు. భాషా సాహిత్యరంగాల్లో వారి బహుముఖ కృషికి కేంద్రస్థానము మదరాసే. ఈ కాలంలో శాస్త్రిగారి సాహిత్యయాత్ర ఎట్లా సాగిందో పరికిద్దాం.

# 4. ప్రాచీన తాళపత్రగ్రంథాన్వేషణ

మదరాసు ప్రభుత్వ ఓరియంటల్ లైబ్రరీలో పండిత పదవిలో కుదురుకొన్న కొన్నాళ్ళకే, ప్రభుత్వం ప్రాచీన తాళపత్ర గ్రంథసేకరణకై శాస్త్రిగారిని, మానవల్లి రామకృష్ణకవిగారిని ఎన్నిక చేసింది. ఇర్వురు జంటగా కొన్నిప్రాంతాలు సంచరించారు కోస్తాజిల్లాలన్నీ శాస్త్రిగా రొక్కరే పర్యటించారు. అంతకు ముందు కల్నర్ కాలిన్ మెకంజీ, సి పి. బ్రౌను, ప్రభుత్వాధికారులు, కొన్ని తాళపత్రప్రతులు, కవిలెలు,, కైఫీయతులు సేకరించారు ఆతర్వాత గ్రంథసేకరణకు - వాటి పరిశోధనకు శ్రీకారం చుట్టి ఆహ్వానం పలికినవారు రామకృష్ణకవి, ప్రభాకరులే పై ఇర్వురి గురించి 4 3.1911నాటి కృష్ణాపత్రికకు లేఖతో ఆరంభమైంది శాస్త్రిగారి పరిశోధన

ప్రభాకరశాస్త్రిగారు చాలా స్వల్పవేతనంతో ఏ అధికారసౌకర్యాలూ లేకుండ, ఎన్నో కష్టనష్టాల కోర్చి, పడరాని యాతనలు పడి గ్రాన్మైకరాత్రంగా, కేవల వాఙ్మయానురక్తితో దేశాటనం చేసి ప్రాచీనగ్రంథాలెన్నో సేకరించారు. ఆనా డాపని అంతటి దీక్షతో జరగకపోతే, విలువైన వాఙ్మయరాశి ఈపాటికి ఖిలమైపోయేది. సాహిత్యనిర్మాతగా శాస్త్రిగారు చేసిన కృషిలో ఇది మెట్టు వాటా. దేశాటనంవల్లా, పండితగోష్ఠుల వల్లా - సహజంగా ప్రజ్ఞాచక్షువు కావటంవల్లా గ్రామీణ జన జీవితంలోనికి చొచ్చుకొని వెళ్ళినపుడు, ప్రాచీన గ్రంథాల పలుకుబడి, ప్రజలపై ఎలా చెల్లుబడి అవుతున్నదో ప్రత్యక్షంగా పరిశీలించే అవకాశ మేర్పడింది ''(సుమారు) ఇరువది యేండ్లక్రిందట ప్రాచీన గ్రంథ సంపాదనకై, తెలుగు దేశము ఊరూర 'టూరు' చేయుచు చాలకాలము విద్వద్గోష్ఠి జరపినవాడను గనుక ప్రాచీన గ్రంథార్థముల పలుకుబడి పల్లెటూళ్ళలో ఎంత చెల్లుబడి అగుచున్నదో నేను ఎఱుగ గల్గినాను''[1] పల్లెల్లో అటకలపై బూజుపట్టి పురుగులకు భుక్తిపెట్టుచున్న తాళపత్రప్రతుల నెన్నింటినో సేకరించి భద్రపరచినారు శాస్త్రిగారు.

---

1 తెలుగు మెఱుగులు - పుట 31

1915లో గోదావరీ మండలయాత్ర. 1916లో కృష్ణాజిల్లాలో దీపి నరసింహాచార్యులుగారిని సహాయకులుగా గైకొని సంచారం. ఆ సంవత్సరమే ప్రభుత్వాదేశం మేరకు తంజావూరు శరభోజీ సరస్వతీమహల్ లైబ్రరీలో గ్రంథాల విలువలు, వివరాలు తేల్చటానికై పదినెలలపాటు తంజావూరులో పనిచేశారు అయితే అంతకు ముందే (1914) పరిశోధన పిపాసతో తామై తంజావూరు చేరి అక్కడి విశేషాలు గుర్తించుకొని 'తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర'ను వెల్వరించారు. దక్షిణాంధ్ర వాఙ్మయ సౌధానికి తలుపులు తెరిచింది మొదట వేటూరి వారే పిమ్మట 1917లో నెల్లూరు జిల్లాలో సంచారం సహాయకులు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 1918లో కళింగదేశంలో గ్రంథసేకరణ కృష్ణాపత్రిక (10 1 1917)లో 'అముద్రిత గ్రంథరత్నము'లనే వ్యాసంలో వారే 'ఈ అనుపలబ్ధప్రాచీనగ్రంథములను గూర్చి పుస్తకముగా ప్రకటించ దగినంత విషయము కలదు ఆలించు వారే అంతగా కానరారు. త్వరపడి తాటియాకు కట్టలను, ఇప్పటికి నిలిచియున్నంతవరకైన, బరిశీంప బూనుదురేని కొన్నియైన గ్రంథరత్నములు వెలువడక పోవు' అన్నారు. తర్వాత ఒక ఉదంతాన్ని నమోదు చేశారు ''[1] 1919లో గ్రంథ పరిశీలనకు మోదుకూరు (గుంటూరు జిల్లా)న కరిగితిని. సంపన్నులగు భట్రాజుగారి యింట గ్రంథము లన్నియు జెడిపోగా బాఱవైచిరట ! ఆ పాఱవైచిన వానిలో గానవచ్చిన వానిలో నీక్రింది పద్యరత్నములు .... తునిగిపోయిన యీ పద్యముల యాకులను జూచి నేను మిక్కిలి దుఃఖించితిని'' ఇదీ శాస్త్రిగారి ఆవేదన !! ఆజిల్లాలో వారు సంచారం చేస్తున్నప్పుడు పడిన అవస్థను చెప్పే చాటువును చిత్తగించండి.

> దూరమునుండి యెండబడి దూపిలి, యింటికి నేగుదెంచు చొ
> ప్పారసి కూర్మిపేర్మి వినయంబు భయంబు దొలంకు చూడ్కి, నిం
> డారిన మోము తోడ నెదు రయ్యెడి తొయ్యలి డించి, దేశసం
> చారము సేంత రోంత, పరిచారకులూ ! ధనమా ! వృథా ! వృథా !

ప్రభాకరులు ప్రాచీన గ్రంథసముద్ధరణకై తెలుగు జాతిని హెచ్చరించటంతో తృప్తిపడక, సాహిత్యపు విలువలు తెలిసిన వారు, జాతి కేది మేలో ఎరిగినవారూ కావటంవల్ల, కొన్ని అమూల్యగ్రంథాలు ప్రకటిస్తూ వచ్చారు. (1) చాటుపద్య మణిమంజరి (1913) (2) ప్రబంధరత్నావళి (1918) (3) చా॥ప॥ మణిమంజరి ద్వి. భాగము (1922) (4) బసవోదాహరణము (1928) (5) నీతిద్విషష్టికా (సంస్కృతం 1928) (6) సుగ్రీవవిజయము (1939) (7) శ్రీవేంకటేశ్వర

1. 1927 సెప్టెంబరు 'సుభాషి' మాసపత్రిక పుట 108

వచనములు (1945) (8) తాళ్ళపాక వారి సంకీర్తనలు (4, 5 భాగాలు 1949) (9) ఆంధ్రకామందకము (1950) మొదలగునవెన్నో ప్రకటించటమేకాదు, ముక్త్యాల రాజా వారిచే తెనాలి రామలింగని ఉద్భటారాధ్య చరిత్రము (1936) దగ్గుబల్లి దుగ్గన 'నాసికేతూపాఖ్యానము' ప్రచురింపింప జేయించారు 'శివతత్త్వసారము'ను ప్రచురింప వలసిందని ఆంధ్రసాహిత్యపరిషత్తును ప్రేరేపించినారు వారు ప్రాచీన గ్రంథప్రకటనకు పడ్డ తపన యిట్టిది. స్వీయ రచనల ప్రకటనకంటె ఎక్కువశ్రద్ధ, అనురక్తి ప్రాచీన గ్రంథప్రకటనకై పడ్డారు అందు వల్లనేఏమో 'తాళపత్రగ్రంథము' లన్న వ్యాసంలో ''[1]మాపుట్టుకకు ప్రాచీన గ్రంథసముద్ధరణము ఒక పరమార్థమా యని మాకు తోచుచున్నది.' అని వ్రాసికొన్నారు

ఇట్లు తెనుగునాట ఊరూరా వాడవాడా కొన్నేళ్ళు తిరిగి, మదరాసు చేరుకొన్నారు. ప్రాచ్యలిఖిత పుస్తకశాల తరపున తాము సంపాదించి తెచ్చిన తాళపత్ర గ్రంథాలకు ముప్పదేండ్లు శ్రమించి పందొమ్మిది సంపుటాలుగా గ్రంథవివరణికలు **(Descriptive catalogues)** కూర్చినారు. సమగ్రప్రణాళిక రూపొందించుకొన్నారు. అందులో ప్రతి వివరాలు, దొరికిన తీరు, సేకరణ కాలము, కృతిపై లఘువిమర్శ, మూలప్రతా లేక దానికి పుత్రికా, లేఖకుని పేరు మున్నగు వివరాలు పొందుపరచారు. ఎడనెడ కవితాశైలి, ఎన్ని అధ్యాయాలు, వంశవృక్షాలు ఇట్లా నడిచింది రచన. ఈ 'క్యాటలాగు'లవల్ల ఆంధ్రకవిచరిత్ర ద్వారానికి వాకిళ్ళు తెరచినట్లయింది కొందరు వీటిని చూచి గ్రంథప్రచురణకు పూనుకొన్నారు. సాహిత్య విమర్శకూడ జతపడుటచే గ్రంథ వివరణికకు గౌరవం పెరిగింది. కవిచరిత్ర నిర్మాణానికి, వాఙ్మయ చరిత్రకు భిన్నసాహిత్య ప్రక్రియల అవగాహనకు అవకాశమేర్పడింది, పరిశోధకులకు 'గని' దొరకిన ట్లయింది. శాస్త్రిగారి సారస్వత భానూదయంలో తొలికిరణం గ్రంథవివరణికల నిర్మాణం

శాస్త్రిగారిని తమ అరవైయవ యేటకూడ గ్రంథగవేషణ వీడలేదు. 1946-48 మధ్య కాళహస్తి ప్రభువులనుండి తాళప్రతు లెన్నో సేకరించి తిరుపతి ప్రాచ్యపరిశోధన సంస్థకు చేర్చినారు. 1946 మేలో వస్తుగౌరవము, కవితాగౌరవము కారణంగా సత్వర గ్రంథప్రచురణ చేపట్టవలసిందని హెచ్చరిస్తూ వ్యాసం వ్రాశారు[2]

ఇంతెందుకు ? తమకడ చదువు పూర్తిచేసిన వారికి వీడ్కోలు చెపుతూ ''మీ మీ ప్రాంతాల్లో తాళపత్రగ్రంథా లున్నాయేమో వెదకి నాకు పంపించండి'' అనేవారు.

---

1. 1950 సెప్టెంబరు 'భారతి'.
2. 1946 మే 'భారతి'

ఇదీ వారి ఆరాటం ! ఈ సందర్భంలో ఇంకోమాట చెప్పవలసి ఉంది స్థానిక చరిత్రలు (Local Records) అనేపేర కల్నల్ కాలిన్ మెకంజీ సంపాదించి ఉంచిన వానినెల్ల కన్నుపొడుచుకొని చదవటమే కాదు, కొన్ని గమనార్హములైన వానిని గుర్తించి ప్రకటించి దేశంలో జాగృతిని కల్పించిన మహనీయులు ఆయన చెరగని మాయని కృషి ప్రాచీన గ్రంధసముద్ధరణ ఆపునాదిపైనే వాఙ్మయవికాసమంతా ఈతీరైన సేవలో ఇరవయ్యో శతాబ్దంలో ప్రభాకరులే ప్రధమగణ్యులు

పాత తాటాకు వ్రాతప్రతుల కోసం కళింగదేశయాత్రలో ఆమహనీయుడు పడ్డ దురవస్థను తెలిపే సంఘటన వారి మాటల్లో ''బొబ్బిలికి దగ్గరలో కుసుమూరను గ్రామము కలదు అక్కడ గ్రంథము లున్నవేమో యని కనుగొనఁబోయితిమి దొరకలేదు మధ్యాహ్నము 1గంటకు అటనుండి తిరిగి 'నందబలగ'కు వచ్చుచుండగా ఆకస్మికముగా కారుక్రమ్మి, జడివాన, కుంభవృష్టి, నిమ్మపండ్లంతటి వడగండ్లతో కొట్టి కొట్టి కురిసెను మేము ప్రాణసంశయ స్థితికి వచ్చితిమి వడగండ్ల దెబ్బకు నిబ్బరించుకోజాలమైతిమి గొడుగులు చెడెను తలగుడ్డలు, కోట్లు నాడు మమ్ము రక్షించెను. ఒక్క గంటలో వాన వెలిసెను బ్రతికి బయట పడితిమి సాలూరులో కొన్ని గొప్పగ్రంధములు కలవు. అవి మాకు దొరకలేదు'' (ప్రభాకరస్మారిక (1) - పుట 295) వాఙ్మయసేవ ఆయనకు వృత్తికాదు, ప్రవృత్తి

# 5. యోగప్రవేశం

ప్రభాకరుల జీవితదృక్పథాన్ని సాహిత్యతత్త్వమును తెలుసుకోవాలంటే వాటి పునాదులు గుర్తించాలి ఆయన జీవితవాహిని రెండు పాయలుగా ప్రహించింది. ఒకటి సారస్వతము రెండవది యోగసాధన. రెండింటిలోను ఎత్తుల కెదిగారు. ఈరెండూ విడదీయరా నంతగా పెనవేసుకపోయాయి. అయితే ముప్పదేండ్లపైబడి వారు చేసిన యోగసాధన సంగతి, సారస్వతలోకానికిగాని, జనసామాన్యానికిగాని తెలియ వలసినంతగా తెలియలేదు వారు గతించిన తర్వాతే తొలిసారి లోకానికి తెలిసింది అంతవరకూ వారు దాని నంత గూఢంగా ఉంచారు. అనుయాయులు మాత్రమే యెరుగుదురు. చిన్నప్పుడు (1902-4) సోమనాధశాస్త్రులవారి దగ్గర పతంజలి యోగసూత్రా లధ్యయనం చేసినప్పుడు అవి లోలోతులకు చొచ్చుకొని పోయినాయి. అదే, లోవెలుగుల అన్వేషణకు బీజప్రాయమైంది.

మదరాసులో ప్రభాకరులు పనిచేస్తుండగా (1912-16)నడును తరచుగా తీవ్రవ్యాధులకు గురియయి శరీరస్వాస్థ్యం కోల్పోయారు. సంవత్సరాలతరబడి నిద్ర లేదు ఆకలి లేదు. నిరంతరాందోళన. ఎన్నివైద్యాలు చేయించినా కుదుట సడలేదు. నిరాశా నిస్పృహలు అలము కొన్నాయి ఒక దుర్బ లక్షణంలో ఆత్మహత్యా-సంకల్పంకూడా కలగకపోలేదు. ఏ హరిద్వారానికో పోయి గంగలో తనువు విడుద్దామా అనుకొని ఒకరోజు మదరాసులోని ఇంటినుండి బయలుదేరి, రైలుస్టేషనుకు ఒంటరిగా అక్బరుసాహెబు వీధిలోంచి నడచి వెడుతుండగా, అబ్బూరి జగన్నాధరావుగా రనే మిత్రు లెదురుపడి చేయి పట్టుకొని ''మీరు ప్రభాకరశాస్త్రిగారేనా ? ఇట్లుంటి రేమి'' అని ప్రశ్నించి ఇంటిలోనికి కొనిపోయిరి. శూన్యహృదయంతో తమ మనోవ్యధను వెల్లడించారు. అప్పుడు జగన్నాధరావుగారు 'మాబావగారు చేరిన యోగగోష్ఠిలో చేరితే మీ ఆరోగ్యం బాగుపడుతుంది. ఎందుకు మీ రందులో చేరకూడదు ?' అన్నారు. అదే ప్రభాకరుల జీవితంలో ప్రధానమైన

మలుపు. అదే, తర్వాత సర్వాభ్యుదయాలకు ఏడుగడ అయింది

జగన్నాథరావుగారి బావగారు పోతరాజు నరసింహంగారు. ఎం ఏ. పట్టభద్రులు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఫిలాసఫీ ప్రొఫెసరు. ఆయన మాష్టరు సి వి వి అను మహాపురుషులు స్థాపించిన యోగగోష్ఠిలో అప్పటికే చేరి సాధన చేస్తున్న పుణ్యశ్లోకులు శాస్త్రిగా రందులో చేరటానికి సమ్మతింపగా మాష్టరుగారికి జాబు వ్రాసి యిచ్చారు దానితో హరిద్వారాని కుద్దేశించిన ప్రయాణం, కుంభకోణంవైపు మళ్ళింది ఆప్రయాణంలోనే, శాస్త్రిగారిలో ఎప్పుడూ లేని ఉత్సాహపు కెరటాలు ఉరకలు వేయసాగినాయి ఆ మహాయోగి దర్శనంకోసం మనస్సు ఎప్పుడెప్పు డని ఎదురుచూడ నారంభించింది

''లావుగాక సన్నముగాక, పొట్టిగాక మరీ పొడుగుగాక నిమ్మపంటి చాయతో అరుణోదయకాంతులు కడల్కొల్పుచున్న శ్రీవారిని (మాష్టరు సి వి వి యోగపుంగవులను) చూడగానే నా యొడలు పుల్కరించెను కేలుదోయి మోడ్చి నమస్కరించి జాబు నర్పించుకొంటిని''. (ప్రజ్ఞాప్రభా పుట 102) వారు దానిని చదివి, నవ్వి విశ్రాంతి తీసికొనుమని చెప్పారు ప్రభాకరులు నెమ్మది మీద తమ అనారోగ్యాన్ని గురించి నివేదించుకొన్నారు 'ఇక నీ ఆరోగ్య రక్షణ భారము నేను వహించితిని వెఱవక నలుగురితోపాటుగా మామూలు భోజనము చేయవచ్చును దానివల్ల నీ కేమీ చెరుపు రాదు' అన్నా రామహాయోగులు

శ్రీవారి దర్శనమాత్రం చేతనే శాస్త్రిగారిలో ఒక గొప్పప్రజ్ఞ ప్రవేశించి, ఊపివేయుచున్నట్లు గోచరించింది ఒక అపూర్వానుభూతి ఎసరేగ నారంభించింది దేహంలో మహాసంచలనం కలిగి తోడనే అవశులైనారు వారి సన్నిధిలో నుండగనే, చిన్నప్పుడు బండినుండి పడి, సడలిన రెక్కలగూడు, ఈ మహాసంచలనంలో యథాస్థానంలో కుదురుకొన్నది యోగగోష్ఠిలో చేరిన నాడే పూర్తిగా నయమైనది ప్రభాకరశాస్త్రిగారు మాష్టరుగారి 'భృక్తరహిత తారకయోగము'లో 22-6-1916లో ప్రవేశించారు.

ఆరోజుల్లో శ్రీవారి దగ్గర శిష్యులుగా చేరేవారికి 'టెస్టు' తీసే వింతపద్ధతి ఉండేది. ఆపనికి రాధాకృష్ణపిళ్ళ, మహాదేవయ్యలను శ్రీవారు వినియోగించారు ''[1] ఆ విచిత్ర విషయ మెట్టిదో యానాడే నేను తెలిసికొంటిని రాధాకృష్ణపిళ్ళగారు గురుదేవులకు నమస్కరించి కనులు మూసికొని యొక నిమిషమాగి ఇంగ్లీషుతో

1. ప్ర.ప్రభా. పుట 72 మూడవ ముద్రణ. టే,టకాపీ 'వేటూరివారి సారస్వత పరివస్య' లో చూడనగును

గ్రంధము పఠించుచున్న ట్లేదో చెప్పసాగిరి మహాదేవయ్యగారు దానిని వడివడిగా వ్రాయసాగిరి . పిళ్ళగారు కనులు మూసికొన్నపుడు అంతరదృష్టికి కనుపడినవి, అంతరశ్రుతికి వినబడినవి చెప్పదొడగిరి. అప్పుడు నా శరీరాంతర్భాగమున గల స్వాస్థ్యాస్వాస్థ్యములు, నామనోభావములు, నా యనారోగ్యకారణములు, తన్నివారణోపాయములు, అప్పటికి జరగిన పూర్వజన్మములు మొదలగునవి కలవు అదియెల్ల ముగిసిన పిదప శ్రీవారి చెంతకు గొనిపోయి వినిపించిరి వారి సమ్మతిమీద దానిని 'రికార్డు' చేసిరి''.

ఆనాటినుండి, శాస్త్రిగారు తనువు చాలించేదాకా నియమపూర్వక దీక్షతో యోగసాధన చేస్తూ వచ్చారు. వారి యోగచికిత్స, ఆర్తసేవలు రాబోవు ప్రకరణాలలో వివరింపబడతాయి. అంతటి మహత్తరయోగాన్ని ప్రసాదించిన పురుషోత్తముని చరిత్రకూడా సంగ్రహముగా తెలిసికోవటం అవసరం

# 6. మహాపురుషులు మాస్టరు సి.వి.వి

ఈనాటి తమిళనాడులోని కుంభకోణంలో శ్రీ కంచుపాటి వేంకాస్వామిరావుగారు 4-8-1866లో శ్రావణపూర్ణిమనాడు ధనిష్ఠా నక్షత్రంలో జన్మించారు. ఎప్పుడో కృష్ణదేవరాయల కాలంలో (1506-30) దక్షిణదేశానికి తంజావూరు రాజ్యరక్షణార్థము వెళ్ళిన తెలుగు నియోగిబ్రాహ్మణ కుటుంబాల్లో వీరి దొకటి అంతకు పూర్వం వీరిది పశ్చిమ గోదావరిజిల్లాలోని 'కంచుమర్రు' గ్రామమని అంటారు. కావేరీతీరంలో కుంభకోణమందున్న భగవద్ఘట్టమున ఈకుటుంబం వారి కెన్నో యిం డ్లుండేవి వీరు మేనత్తకు దత్తుపోయినారు ఆరోజుల్లో వీరికి నాలుగైదు లక్షల కిమ్మతు ఆస్తి ఉండేది. వీరు శ్రీరంగంలోనూ కుంభకోణంలోనూ చదువుకొన్నారు. వస్తుతః మహాభోగులు.

రాజకుమారులతో, శ్రీమంతులతో యౌవనంలో స్నేహముండేది. అప్పుడే కుంభకోణం మునిసిపాలిటీకి కొంతకాలం అధ్యక్షులు. ఒకమారు 'దర్భాంగా' మహారాజు కుంభకోణానికి వస్తే ఎంతో గౌరవాదరాలతో 64 పిండివంటలతో రాజలాంఛనాలతో ఆతిధ్య మొసగినారు కొంతకాలం రైల్వే కంట్రాక్టరుగా ఉన్నారు ఆ సమయంలోనే ఎంతో ధనం నష్టపోవటం జరిగింది. ఏ పెద్ద అధికారి వచ్చినా వీరిదే ఆతిధ్యము.

శ్రీవేంకాస్వామిరావుగారు తమ పన్నెండవ యేట రుక్మిణమ్మగారిని వివాహ మాడినారు. ఆమె ముగ్గురు పుత్రులను, ముగ్గురు కుమార్తెలను కని 1904లో గతించారు. ఆతర్వాత రెండేండ్లకు మద్రాసు వాస్తవ్యులు మద్దూరి అప్పయ్య పంతులుగారి కుమార్తె 'వెంకమ్మ'గారిని పెండ్లాడారు. ఈపెళ్ళి తిరుపతిలో జరిగింది. అయితే, అంతరంగం తొలినుండి ఆధ్యాత్మికతవైపు మొగ్గి ఉండేది. తత్సంబంధ వాఙ్మయం విరివిగా చదివేవారు. కొంతకాలం దివ్యజ్ఞాన సమాజంలో 'ఇన్నర్ సర్కిల్' సభ్యులై దైవచింతనలో గడపినారు. అంతరుద్బోధం ప్రధానంగా

కాక, కేవలం గ్రంథసంచయం ప్రమాణంగా తీసుకోవటమనే పద్ధతి నచ్చక, దానినుండి విడివడినారు.

ఇట్లుండగా 'హేలీస్' అనే తోకచుక్క ఒకటి కనపడింది ''[1]అది ఇంక కొన్నాళ్ళకు స్థూలదృష్టికి గోచరించు ననగా ఆధూమకేతువును దక్షిణ హిందూదేశమున ప్రజాసామాన్యమున తొలుత గుర్తించిన నాడను నేనగుటలో మహత్తరవిశేష మేదో ఉండబోలునని నే నిటీవల విశ్వసించుచున్నాను'' ఇవి ప్రభాకరుల వాక్యాలు దానితోకనుండి కాంతి పుంజ మొకటి దూసుకొనివచ్చి సి.వి.వి. గారున్న గదిలో ప్రవేశింపగా, ఆప్రదేశ మంతా విద్యున్మయమైంది. బ్రహ్మాండమైన ధ్వని కూడా వినబడింది అది ఫ్యాక్టరీ హో రనుకొన్నారు. పురప్రజలు ఆవెలుగురేఖ వేంకాసామిరావుగారిలో ప్రవేశించింది. వెన్వెంటనే వారికి బ్రహ్మజిజ్ఞాస మొదలయింది తమను తాము తెలిసికొని సమాధిస్థితిలోనికి జారిపోయినారు. ఆయనయే మాష్టరు సి.వి.వి. ఆయినారు వారు స్థాపించిన 'భృక్తరహిత తారకరాజ' యోగమునకు మూలమంత్రము ఆ మూడక్షరాలే. అవి శ్రీవారి నామాక్షరాలు మాత్రమే కాదు, అంతర్వీక్షణంలో కానవచ్చిన బీజాక్షరసంపుటి కూడా

శ్రీవారిని గూర్చి ధ్రువనాడి ఇట్లా చెబుతున్నది. 'ఆత్మజ్ఞాన పరాయణోఽతి నిపుణో, బౌద్ధప్రధానోగుణీ / బ్రహ్మలోకాది వృత్తాంతం వేత్తి యోగ ప్రభావతః' (ఆత్మజ్ఞాన పరాయణులు, అతినిపుణులు, బుద్ధిప్రధానగుణులు, బ్రహ్మలోకాదుల వృత్తాంతము యోగప్రభాతంచేత తెలుసుకోగలవారు)

మానవుని దైవత్వస్థితికి గొనిపోవుటకు, పరబ్రహ్మాంశమును భూమిపైకి తెచ్చుటకు జన్మించిన మహానుభావులు. 'బ్రహ్మాంశోఽయం మహాత్మా.. సాక్షాత్‌బ్రహ్మప్రభావః' అనికూడా నాడీగ్రంథం పలుకుతోంది శ్రీవారిని గూర్చి. తన నాశ్రయించిన వారిని, తనంత వారిగా చేస్తానని ప్రతిజ్ఞ చేసిన యోగివరేణ్యులు.

బహిర్ముఖంగా సాగుతున్న బహుత్వాన్ని సాగనిస్తూనే, అంతర్ముఖంగా తిరిగి; అందులో ఏకత్వాన్ని గుర్తించి వర్తించుటం ఈయోగసాధన కొక ఫలితం. మృత్యువును ధిక్కరించే సామర్థ్యంతోపాటు అందరకూ అమరత్వసిద్ధి కలగాలనీ, అదికూడా ఇచ్చటనే ఈశరీరంలోనే మానవాళి పొందాలనీ కాంక్షించి యోగసాధన చేసినారు. ఇందు లోకశ్రేయమే లక్ష్యముగాని, వ్యక్తిగత మోక్షప్రాప్తి లక్ష్యము కాదు విశ్వసృష్టిలో నెలకొన్న లోటుపాట్లను సవరించటం కూడా ఈయోగఫలితాలలో ఒకటి

1 ప్రజ్ఞాప్రభాకరము - పు 27, 3వ ముద్రరణ.

1910 మే నెల 29వ తేదీ రాత్రి 8 30 నిమిషములకు మాష్టరు సి.వి.వి.లో శక్తిపాతము జరిగినది అప్పుడే దగ్గరున్న ఏడుగురితో కలసి యోగసాధన కంకురార్పణ గావించారు క్రమంగా 752 మందికి (616 గురు పురుషులు, 136 మంది స్త్రీలు) వారి జీవితకాలంలో ఉపదేశ మిచ్చారు శ్రీవారేపరోక్షంగా మరి 248 మందిని అనుగ్రహించారు అందుచేతనే 'సహస్రప్రియశిష్యాయ, సాక్షి పూరుషవేషిణే' అని వీరిని శిష్యులు కొనియాడినారు. పన్నెండు సంవత్సరాలపాటు అసిధారా వ్రతంగా స్వగృహంలో యోగసాధన నెరపి 12-5-1922న పరమప్రాప్తి పడసినారు

శ్రీవారు యోగిపుంగవులేకాక కర్ణాటక సంగీతప్రియులు. స్వయము వీణ, ఫిడేలు మున్నగు వాద్యాలను శ్రావ్యంగా వినిపించేవారు. తెలుగు, తమిళ, ఆంగ్లభాషల్లో మంచి పాండిత్యము గడించిన ప్రతిభాసముద్రులు అంత రుద్బోధమే వారు నెరపిన యోగసాధన కంతకును కీలకము బ్రహ్మప్రభావ సంపన్ను లగుటచేత అనేక అపూర్వాద్భుత శక్తులు వీరికి వశమయ్యాయి వాటి ప్రభావంవల్ల ఎందరి ఆధివ్యాధులనో సంకల్పమాత్రంచేత పారద్రోలినారు కొన్ని అద్భుతాలు చూపించారు అవే యోగం కాదు కదా ! వాటికి ప్రదర్శన, ప్రచారాలను నిషేధించారు యోగసాధన దీక్షతో చేయటమే వారి లక్ష్యము. శ్రీవారివల్ల ఆరోగ్యలబ్ధి పొందినవారిలో వేటూరి వా రొకరు.

ఉభయ సంధ్యలందు సరిగా 6గంటలకు శ్రీవారి నామాక్షరములు స్మరించుకొని మౌనంగా యోగానుష్ఠానం చేస్తారు సాధకులు ఆసాధనవల్ల శ్రీవారి వలెనే వ్యాధినివారక శక్తులు సంపాదించినవారు నేడునూ ఉన్నారు. నియతి తప్పక యోగసాధన చేస్తున్నవా రిప్పుడు ఒక్కభారతదేశంలోనేగాక బెల్జియం, ఫ్రాన్సు, ఇటలీ, ఇంగ్లండు, అమెరికా, స్విట్జర్లాండు మున్నగు ప్రపంచ దేశాలలో లక్షల కొలది ఉన్నారు. అద్భుతానుభూతులను పొందుతున్నారు. మాష్టరు సి వి.వి శిష్యులలో ప్రముఖంగా చెప్పుకోదగిన వారిలో వెలగపూడి సుబ్బారావు (బాపట్ల), మైనంపాటి నరసింహం పంతులు (ఒంగోలు), డా. టంగుటూరి జానకీరామ్ (మద్రాసు), ప్రొఫెసరు పోతరాజు నరసింహం పంతులు (మద్రాసు), రాచకొండ నారాయణ మూర్తి (విశాఖపట్టణము), వేపా రామేశంపంతులు (మద్రాసు), ప్రత్తిపాటి శోభనాచలం (విజయవాడ) మున్నగువారు తెలుగు ప్రాంతానికి చెందినవారు.

# 7. కవితలు

'కవనార్థ మ్ముద్దయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి, యీ భవ సుద్వాన తరింతు'[1] అని చాటుకొన్న శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి శుశ్రూష చేసి ఉభయభాషలందు ప్రవీణులై, కవితా రహస్యా లాకళించుకొన్నారు చెళ్ళపిళ్ళవారికడ పుస్తకం పట్టిన వారంతా - పింగళి, విశ్వనాథ, మాధవపెద్ది, వేలూరి - కవితాక్షేత్రం దున్ని బంగారుపంటలు పండించిన వారే. అందుచేతనే వెంకటశాస్త్రిగారు 'అద్యతనాంధ్ర కవిప్రపంచ నిర్మాతలు'. కవితా చాతురి గడించుకొన్న ప్రభాకరులు 'మత్కవిత సర్వము తత్కారుణాత్తమే' అని సప్రశ్రయంగా విన్నవించుకొన్నారు.

పదునాలుగేండ్ల చిరుతప్రాయంలో ఎడ్వర్డు పట్టాభిషేక సందర్భంగా (1902) కొన్ని శ్లోకాలు చెప్పి గురువులు సోమనాథశాస్త్రి మెప్పుగొన్నారు. ఇది వారి తొలి రచన. నేడిది అలభ్యము. ఆనాటినుండి కవితారచన ఏబదేండ్లపాటు తడి ఆరకుండా కలంనుండి చిందుతూనే ఉంది భావజిహ్వాద్రవ మెప్పుడూ ఇగురబారలేదు. తెలుగుబాస సోయగాలు చిందే కవితాఖండములు వెలువడుతూనే ఉన్నాయి. అవే 'కవిచూడామణి'గా పేరు కీర్తులు తెచ్చిపెట్టినాయి. 1904-7 నడుమ సహాధ్యాయుడు పిసుపాటి వేంకటరామశాస్త్రిగారితో కలసి 'శంకర' శతకం కూర్చినారు., అభ్యుదయ భావాల కిది పెన్నిధి.[2] శతావధానిగా వాసికెక్కినారు వేలూరి శివరామశాస్త్రిగారితో కలసి జంటగా శతావధానాలు చేశారు. అది అవధానాల యుగం. ప్రభాకరులకు కవిత సహజసిద్ధంగా అబ్బింది.

---

1. తిరుపతి కవులు సాహిత్య సమీక్ష - పుట 486
2. అముద్రితము. ఆచార్యవేటూరి ఆనందమూర్తిగారికడనున్నది. శోధించి వెలికి తీసినదికూడ వారే.

మదరాసు చేరినపిమ్మట, పార్థసారధి స్వామిస్తుతిగా, తమ మనోభావాలను వెల్లడించినట్లు వారి స్వీయచరిత్ర చెబుతున్నది 1907లో శ్రీమాన్ పనప్పాకం అనంతాచార్యుల వారు తెనిగించిన 'ఒథెల్లో' నాటకానికి కొన్ని పద్యాలు సంధానించారు చెన్నపురికి చేరిన తొలిరోజుల్లో శాస్త్రిగారికి వీరొక పెద్ద ప్రాపు. మదరాసులో జరిగే సభల్లో తమ కవితలు వినిపిస్తూండేవారు

ఇరువది రెండవయేట ప్రభాకరులు చెప్పిన కవితకు మచ్చుతునక ఆంధ్రభారతి (1911 జనవరి)లో అచ్చుపడిన ఋతువర్ణన గురజాడవారి 'లవణరాజు కల' ఇందులోనే తొలిసారి అచ్చుపడింది పూర్వకవుల బింకము పొంకము తొణికిస లాడునట్లు సరసపదసంయోజనంతో సమాసబంధురంగా నడపించిన శాస్త్రిగారి వసంత వర్ణనను గమనించండి

మలయ సమీర సౌరభ సమంచితముల్ - సుఖభుక్త మత్త సం
కుల కల కాకలీ కలిత కూజిత కోకిల మంజు గానముల్-
దళిత మనోజ్ఞకుట్మల వితాన లతా నయన ప్రమోదనో
జ్జ్వలములు, నవ్యవార్షిక వసంత దినమ్ములు మిమ్ముఁదన్పుతన్

కవిగా శతావధానిగా వాసి కెక్కిన వేటూరివారి కవితావాహిని మూడుపాయలై ప్రవహించింది అవి 1. ఖండకావ్యములు, 2. అనిబద్ధరచనలు, 3. అనువాదాలు అనుకోవచ్చు.

ఈ శతాబ్ది తొలితరం కవులలో లఘుకావ్యరచనలో ప్రసిద్ధులు కొద్దిమంది కనబడతారు. గురజాడ 'పూర్ణమ్మ', కట్టమంచి రామలింగారెడ్డి (ముసలమ్మ మరణము) అబ్బూరివారి మల్లికాంబ (1914), వేటూరివారి మూనాళ్ళముచ్చట (1922) అందులో కొన్ని.

**'మూన్నాళ్ళముచ్చట':** ఒక నిబద్ధ ఖండకావ్యము. అయితే పయి రచయిత లెవ్వరూ తమ రచనలను ఖండకావ్యాలుగా పేర్కొనలేదు. భావకవితాయుగం వచ్చిన తర్వాతనే దాని పరివ్యాప్తి.

శాస్త్రిగారు 'ఈనాటివి యీనాటివి కధలు కల్పించి చిన్నచిన్న కృతులు రచింప నాకుకోరిక కలదు' అని ముందుమాటలో చెప్పుకొన్నారు. అవి తాము కన్నవీ, మిత్రులవల్ల విన్నవే కాని కేవల కల్పనాకథలు మాత్రం కావు. సన్నివేశ చారుత్వకై ఎటనేని ఒండురెండు కల్పనలు చేర్చియుండవచ్చును. తెలుగు పలుకుబడికి, నుడికారానికి నెలవయిన కమ్మని కవిత లివి. కలకండ పలుకులవలె రుచులూర్చునవి.

ఈకావ్యంలో నాగరుడైన గృహస్థుభార్యతో సుఖజీవనం నెరపుతూ,

అభిజాత్యము బుగ్గిగలిపి, ఇంటి దాసియెడ దుర్నిరోధ వ్యామోహితుడయి, ఆవెంట వివేకము వర్తించి చక్కబడుట ఇతి వృత్తము. కథా సంవిధానము కాలక్రమ పద్ధతిలో కార్యకారణపరిపాటితో నడిచింది. అంతకు ముందు పుట్టిన ఖండకృతులు చారిత్రకములో, పేరంటాంధ్ర కథలో, ఊహాగానములో, వలపు పాటలో అయి ఉండగా, నీతిబోధకము, యథార్థగాథా విలసితము నగుట దీని విశిష్టత.

ఆలుమగల భావాలు ఉదాత్తరసాన్వితములుగా కావ్యాంతములో, ఒక సుకుమార సన్నివేశాన్ని అతిసహజ మయినదాన్ని కవి సృష్టించినాడు. 'భార్యాభర్త లేతత్ కథా । సారం బారసి మేలు గాంతురను నుత్సాహంబునన్ నీతినిం । డారం గల్గి యథార్థమైన యొక గాథార్థంబు వాక్రువ్వగా నారంభించితి' అని కావ్య ప్రయోజనాన్ని నిర్దేశించి చెప్పారు.

కావ్యారంభమే చిత్రంగా వుంది
క్రొవ్వం జవ్వన మబ్బు గుబ్బెతల టక్కుం డెక్కులం జిక్క కే
అవ్వన్ అట్టును లేక, పైకొనిన లేఁబ్రాయంపుఁబెంజీకటిన్
బువ్విల్కానికిఁగీర్తి విత్తమును గోల్పో కావ్యమర్యాదకున్
దువ్వల్ గాక చరించు నంచితుల వృత్తం బెంతుఁ జిత్తమ్మునన్.

పూర్వకవిప్రయోగ దక్షు లగుటచేత, ఆముద్ర పెక్కుచోట్ల కనబడుతుంది. ఈకావ్యప్రయోగాలను వేదము వేంకట్రాయ శాస్త్రిగారివంటి ఉద్దండ పండితులు తిక్కన, శ్రీనాథాదులతో సరిగా ప్రామాణికంగా తమవ్యాఖ్యానాల్లో స్వీకరించారు. సమకాలికవిద్వాంసులలో శాస్త్రిగారికున్న విలువ అంతటిది. 'తెలుగు నుడుల కూర్పునేర్పు నబ్బురముగ నబ్బించుకొన్న చతురుడు', అని మధునాపంతులవారు 'ఆంధ్రరచయితల'లో ఉట్టంకించారు. ఆంధ్ర శేషగిరిరావుగారు కావ్య సమీక్షచేస్తూ 'పూర్వాధునిక కవితా పద్ధతుల లోతును బాతును బాగుగా నారసి రెండు పద్ధతుల సమ్మేళన మొనర్చి నూతన కావ్య రచనకు నవ్యసారస్వతమునకు మార్గదర్శకులైన ఆధునికాంధ్ర కవిగ్రామణులలో శ్రీశాస్త్రిగా రొకరు (1924 సెప్టెంబరు, భారతి). సంతాన పదానికి కవితాస్ఫోరకంగా సరస వ్యాఖ్యానం చెప్పారీ కావ్యంలో

ఆరయ నాల్మగళ్ళ హృదయంబు లనంబడు రెండు రజ్జువుల్
కూరిమి యన్ పురిన్ బెనగి, కూడి, యభేదమునన్ రహింపఁ గాఁ
బేరినపెంపు దేన నిఁక వేర్పడ కుండఁగ నేర్పడున్ సుతా
కారపు ముళ్ళు, ముళ్ళటె యఖండసుఖోదయ మూలకందముల్. పద్యం -90

**కడుపుతీపు :** కన్నీళ్ళు చిందించే వాస్తవ సంఘటన ఇతివృత్తము. ఉద్యోగి యొక డాలుబిడ్డలతో కృష్ణానదికి స్నానార్థం వెడతాడు వరద నీటిలో చెట్టుకొమ్మ కొట్టుకొని వస్తూంటే, యిల్లా దాన్ని చేత్తో నీటిలోనికి గెంటుతుంది. అప్పుడు మిలమిల మెరిసినట్లయింది అదిపామో ! ఏమో! అది పగపట్టి పిల్లలతో నిద్రిస్తున్న తల్లిని కసిగాట్లు వేసి చంపుతుంది సర్పపు పడగను చేతితో గట్టిగా పట్టుకొని, పిల్లల ప్రాణ రక్షణకై బలిదానం చేసిన మాతృమూర్తి కన్నీటిగాథ. ఊపటివేళ, మాపటివేళ, చీకటివేళ, అనే మూడుప్రకరణాలలో నిర్మించిన కథాకావ్యం. పాము చుట్టుకొన్న దృశ్యం తిలకించండి

తెల్లంద్రాచటె ! యప్పు డామెపయి కుద్రేకించి దూకెన్, బుసల్
చల్లెన్, పైపడగార్చె, నంత సుతరక్షాచింతయే తక్కఁద
క్కెల్లన్ ద్రోపడ నాపె పాపశిర మట్టే పట్టె నిర్ చేతులన్
బిల్లల్ పిల్లలు పిల్లలంచు నఱచెన్ బీభత్సకంఠ ధ్వనిన్ పద్యం-84

'తన్నొడ్డెను, పాము బట్టుకొనె, నొండు విచారము నేరదయ్యె, నాబిడ్డల ప్రాణముల్ నిలిపె' అన్నదానితో కథ ముగుస్తుంది. చదువుతుంటే కన్నీళ్ళు రాల్పించే దయనీయ గాథ. ప్రాస్తావికంగా కృష్ణాతీరాంధ్రదేశవైభవం కన్నుల కట్టినట్లు కవి అభివర్ణించినాడు. గోగు పచ్చడిని వర్ణించిన తీరు

పయరకూర వేచి, పచ్చిమిరెపపండ్ల
నుక్కళించి పోసి, యూర నిచ్చి
కొంత కొంత పాగిపికొను గోగు పచ్చడి
చవికి, నింక నోరు చివికి తీరు

ఈ సందర్భములో ఆంధ్రాభిమాన ముట్టిపడే పద్యాలు మరికొన్ని ఉన్నాయి. సమకాలీన సమాజంపై విసు ర్లున్నాయి. వేటూరి కవి ప్రాచీనులలో ప్రాచీనుడు. నవీనులలో అతి నవీనుడు.

**దివ్యదర్శనము (1924) :** తాత్త్వికకవితాశాఖకు చెందినది. నూటయెనిమిది పద్యగద్యాలతో కూర్చిన ఖండకావ్యము. ప్రభాకరులు కవిచూడామణియే కాక నలుబదేండ్లు యోగసాధన, దీక్షతో నెరపిన మహాయోగులు. ఆతాత్త్వికచింతనమే ఈకృతికి ప్రేరణ. కవితయను సత్పదార్థము పుష్కలముగాగల ఖండ కావ్యము

ఈశ్వర తత్త్వచింతనగల జిజ్ఞాసు వొకడు అవ్యయసుఖాలందించే పరమ గురువుల గురించి వెదుకగా వెదుకగా నమ్మెదుగ్గ త్రోవ కనబడుతుంది. ఆయన

నిచిత్రానుభూతులు, చిత్తవిభ్రాంతి, దివ్యదర్శన మొదవిన తీరు, దుర్గామాత ఉపదేశము ఇందలి ఘట్టాలు తెరచాటుగా ప్రభాకరులే ఇందులో దర్శన మిస్తారు. కావ్యంలో విజయవాడ వర్ణన, ఆంధ్రదేశవర్ణన ముచ్చట గొల్పుతాయి. ఆధ్యాత్మ విద్యారహస్యమైన ప్రజ్ఞ యిందులో మెఱుగులు చిమ్మింది

కవిత్వాన్ని గూర్చి వేటూరి వారి అభిప్రాయాలు ''[1]సత్యోద్బోధముకాని, జ్ఞానోద్బోధము కాని, ఆనందోద్బోధముకాని లేని రచనలు, కాలప్రవాహములో రాలిపోతవి గాని నిలువజాలవు. . మన పరిపూర్ణత రేపటి రోజులలో ఉన్నదికాని నిన్నటి రోజులలో లేదు. సత్యద్రష్ట కల్పనల జోలికి పోడు. వానికి కల్పన నిస్సారంగా తోస్తుంది. క్రాంత దర్శియైన సుకవి తనలో దృశ్యాదృశ్యముగా నెలుగులు కొల్పుచున్న తత్త్వమును వ్యక్తావ్యక్తవాక్కులతో వ్యంగ్యమర్యాదతోనే సామాజికులకు పరిస్ఫురింప జేయవలసినవా డగును.''. తాత్త్వికకవితలో వారెంత ఎత్తుకు ఎదిగారో పైపంక్తులు వెల్లడిస్తున్నాయి.

కథమధ్యలో కావ్యారంభము గడుసుపోకడ. కనకదుర్గమ్మగూర్చి అన్వేషి విభ్రాంతి పడుటతో కావ్యం ముగుస్తుంది. వేటూరి కృతులలో వస్తుస్వీకరణము, కావ్యారంభము, నవ్యకథనము, భావప్రపంచనము, కొసమెరపు పరిష్కారాలు అన్నీ ఆధునికమై అలరారు తున్నాయి. 'తత్త్వవిస్ఫురణము లోకమందు పరిపూర్ణము కాగలదన్న వేడ్కతో' నిజము పెంచి రచించిన కృతి. ఈ శతాబ్ది తొలి తాత్త్విక కావ్యం.

**చిన్ననాటి చేష్టలు** (1923) పిల్లల చిత్తవృత్తులు, తలిదండ్రుల మనస్తత్వాలు, స్వభావ సుందరంగా చిత్రించిన చిన్నకథా కావ్యము.

***కపోతకథ*** (1925) 'ముక్త్యాల' గ్రామంలో జరిగిన బ్రహ్మానందోత్సవాలలో మూడుపూటలలో ఆశువుగా అల్లిన కృతి. తిక్కన భారతంలో 'లుబ్ధకపోతోపాఖ్యానం' ముప్పదియైదు పద్యాలలో రచిస్తే, శాస్త్రిగారు తొంబదియైదు పద్యాలలో పునఃకథనం చేశా రిందులో.

రచనల్లో తాత్త్విక దృక్పథం ఉంటే, సమాజంలోనూ అది అభివృద్ధిచెందుతుం దన్నది ప్రభాకరుల విశ్వాసం. అదే మాట 'కవితలో తాత్త్వికాంశములు పెరుగగా పెరుగగా, సంఘమున తాత్త్వికతాశ్రద్ధ పెచ్చుపెరుగును' అంటూ విశదం చేశారు. ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారు ''[2]ప్రభాకరశాస్త్రిగారి

1. నవ్యసాహిత్య పరిషత్ ప్రారంభోపన్యాసము (1946) పుటలు 240, 30, 31
2. వేటూరి శతజయంతి సంచిక 550

రచనం ప్రసాదగుణ భరితం ఈరచనలో వస్తువు పావనగంగలాగా, శబ్దయోజనం కర్పూరనీరాజనంలాగా, ధార జలపాతం లాగా, శైలి పుష్పశయ్య లాగా రాణించింది' అన్నారు లోకంలో ప్రతి అల్ప విషయంలోనూ తరళించే ఉదాత్తతను ప్రతిభా-బలంతో వెల్లడిస్తారు మేధానిధులు ఇట్టి రచనలవల్ల చిత్త ప్రకాశనం జరుగుతుంది

'నీదు నెమ్మేనిలో సగపాలు పైనుండ, నగ్గిపాలయితి వెట్లు' అనే పద్యంలో కరుణరసం వెల్లువై పారింది

ఈశ్వరుఁడొక్కరుండు కలడే యని యొప్పిన యప్పు డాతఁడున్
నశ్వరుఁడౌనె, యజ్ఞుఁడగు నావలె,కాక యనంత శక్తియున్
శాశ్వతుఁడౌనె, తత్కృతియు శాశ్వతమై విలసిల్ల, కేటికీ
విశ్వము నశ్వరంబయి యవిజ్ఞతతో వెత లందఁగా వలెన్

ప్రభాకరులు చేరిన యోగ లక్ష్యమిందు ప్రతి బింబిస్తున్నది ముచ్చటగొల్పు స్వభావ సుందర వర్ణనల కిందు కొదువ లేదు

**విశ్వాసము :** ఏబదియెనిమిది గీతాపద్యాలు, ఆరు కందాలతో కూర్చిన కృతి. హృదయగ్రంధిని కదల్చి కరగించిన వాస్తవ సన్నివేశం కవితకు ప్రేరణ. కరుణ ఊపిరిగా నడచిన కథాకావ్యం కుక్క ఒకటి ఉప్పరి యెడ విశ్వాసంతో పరుగెత్తి పరుగెత్తి అలసి సొలసి అసువు లర్పించిన దయామయగాథ కథ రక్తికట్టటానికి సృష్టించిన ప్రతియోగ ఘట్టం మనసు పట్టుకొని వదలదు యజమానిని పీడ నొల్లని కుక్క ఆవేదన సహజంగా బొమ్మగీచినట్లు చిత్రింపబడింది.

కనుల నీరు నించు c గనుగొంచు, , నుప్పరీ
డెచ్చరించు, కుక్క యెగిరి కొంచుఁ
బైకి రాఁబ్రయత్నపడు, క్రిందఁబడుఁ గొంత
దూర మరుగు, మరల c జేరు కొనును -పుట 9

పఠిత కథంతా చదివి కన్నీరు దొనదొన కారేలా ఏడ్చి నిట్టూరుస్తాడు. అమాయికపాత్రలవలెనే, ఇందు భాషకూడా తేటనీటివలె ప్రసన్నమై, గీతపద్యాలలో సిసలైన తెలుగు ఇదియే అనిపిస్తుంది వర్ణనలు అనుభవ స్పర్శతో కూడి ఉన్నాయి రచన ఎంత చిన్నదైతే నేమి, దానిలో ప్రజ్ఞ మెరుపుతీగలా మెరవడంలో ఉంది మహిమ.

**సీతాఫలము** (1940) గేయ ఫణితిలో నడచినది. గుణదోష వివేచన కావ్యపఠన ప్రయోజనమని తెల్పుతున్న ఖండిక. **మాతృశ్రీ** (1944) ధర్మపరిపుష్టమైన మాతృహృదయం ఆవిష్కరించిన కావ్యం. యోగానుభూతికి

అక్షర శిల్ప మీకవిత. సత్యదిదృక్ష దీనికి ప్రేరణ ఆధ్యాత్మిక మూల్యాలను ప్రదర్శించిన మహత్తర రచన

శాస్త్రిగారు ఏబదేండ్లకుముందు 'బాలభాష' పేరుతో పాటలు సంకలించారు బాలసాహిత్యశాఖకు పునాదులు వైచిన ఆద్యులలో వేటూరివా రొకరు

**అనిబద్ధ కవితలు :** ఏబదేండ్లపాటు వివిధాంశాలపై కవిత అల్లినారు. నలుబదియేడు కవితా ఖండములు లభ్యములు. చాటువులు కొన్ని, ముక్తకప్రాయమైనవి మరికొన్ని. ఇందు వినోదాత్మకములు, పరిహాసపు జల్లులు, చమత్కార చారువులు ఉన్నాయి. వీటిని జీవితాను భూతులు, కవి- రాజ ప్రశస్తులు, జాతీయతా గంధిలములు, సమస్యాపూరణలు, ఉత్తరాల్లో కైతలు, స్మృతి రచనలు, ప్రాస్తావికములుగా పేర్కొనవచ్చును

తంజావూరు కన్నెలపై చెప్పిన చాటువు

చిలుపని తావులుం జవులు చిమ్మెడు కమ్మనిపూవుఁదీనలో
వలగొని గానలక్ష్మి నిలువన్ జెలువమ్ములు నించు రూపరే
ఖలొ యనునట్లు తంజపురి కన్నెలు కొందరు గొబ్బిపాట మె
చ్చు లొలుక వీనులం గనులఁజుబ్బన చూఱలు జుల్లె పొంగిలిన్ (1914)

బుద్ధభగవానునిపై అల్లిన కవిత ప్రభాకరులకు మిక్కిలి ప్రీతిపాత్రమైన రచన

ప్రియయువతిం బ్రభుత్వమును వీడి యరణ్యమునందు తత్త్వని
శ్చయమున్కై మహోతపము సల్పి, కృతార్థతఁగాంచె నమ్మహో
దయుఁడగు బుద్ధదేవుని పదంబుల కేను నమస్కరించెదన్.

మదరాసులో మైలవరం భారతీయ సమాజంనారు వేసిన రాధాకృష్ణ నాటకంలో (1 3 1924) కృష్ణ పాత్ర ధరించిన జొన్నవిత్తుల శేషగిరిరావుగారిపై ఆశువుగా చెప్పినది.

సంగీతమ్మున వింతవింతల చవుల్ సాధించె, సౌరూప్యమం
దుం గల్పించెఁ బ్రమోదమున్, బ్రణయమాధుర్యమ్ము చూపించి, హా
యిం గూర్చెన్, దగ కృష్ణభూమిక కితండే యర్హుఁడౌనంచు స
ర్వాంగీకారముగాఁగ శేషగిరి రాయం డొప్పె నిప్పట్టునన్

**అనువాదాలు :**

ఇక సంస్కృత రచననుండి ఎడనెడ కొన్నిశ్లోకాలు తెనిగించారు హాలుని గాధాసప్తశతిలో పదునెన్మిదింటిని తెలుగుకు గొనివచ్చినారు. గ్రామీణ జీవన మాధురికి ముచ్చటపడి అనువదించినట్లు తోస్తుంది. మచ్చునకు

**పాదపతితస్య పత్యుఃపృష్ఠం పుత్రే సమారుహతి**
**దృఢమన్యు దూనాయాఽపి హాసో గృహిణ్యా నిష్క్రాంతః**

-1 శతకము -11 శ్లోకము

**తెనిగింపు:**

కాళ్ళమీఁదఁబడి మగడు వేడుకొన, వీపు
గుఱ్ఱ మెక్కి యాడెఁ గుఱ్ఱవాఁడు
అట్లె యేడ్పు నాగ్రహము డొల్లగిల్లి యి
ల్లాలి కంత నవ్వు రాలు వాఱె
ఈ తెనిగింపులో తెలుగుదన ముట్టిపడిన ట్లున్న రచన

విశ్వనాథుని ప్రతాపరుద్ర కళ్యాణము నుండి రెండు, జగన్నాథ పండిత రాయలవి రెండు, గోవర్ధన సప్తశతినుండి పది (1928), అజ్ఞాతకర్తృకమైన ఏణీ పంచకాన్ని (1923), వ్యాసుని సనత్ సుజాతీయంలో తొలి అధ్యాయం తెనుగు చేశారు కడపటి అనువాదంలో శంకర భగవత్ పాదుల వ్యాఖ్యానాన్ని సంప్రదించారు భజగోవింద శ్లోకాలు (25) గేయగతిలో అనువదించారు (1929). ముత్యాల సరాల్లో మరికొన్ని పాటలు రచించారు

తమిళంలో గోదా విరచిత 'తిరుప్పావై'లోని పదిపాశురా లేనాడో శ్రీనివాస గురు డనువదింపగా, శేషించిన ఇర్వదింటిని సప్తపదుల పేరిట అనువదించారు (1925) భక్తి వాకలూరే తెనిగింపు విష్ణుపారమ్యస్తోత్రములను ద్రావిడ భాషలో 'పాశురము' లంటారు

'పూలవిందు' గేయగతిలో రచించిన స్వతంత్రకృతి గేయకవిత కెత్తిన పతాక. ఇది కొంతవరకే వ్రాసినారు పరిశేషాన్ని ప్రభాకరుల పుత్రులు ఆచార్య వేటూరి ఆనందమూర్తి రసరమ్యంగా పూరించారు. ఇది అముద్రిత రచన - తమ్మి పూవుపై మచ్చునకొక పాట

తమ్మిపూవా ! నీవు దయచేయ గదవమ్మ
వన్నెవన్నెల పూలు వాసనలు గల పూలు
అందాలు గల పూలు - చందాలు గల పూలు
రాశిగా విచ్చేసి రాణించవలె మీరు
రావమ్మ ! రావమ్మ ! దేవి యాసనసీమ

**పొగడపై చెప్పినది :**

ఒక వింత ఒకహొయలు నొక్క హృద్యత గలదు
వకుళమా ! నీపూవు వాసన బలే ! బలే !

రకరకాల పూలపై లలితసుకుమారంగా రచించిన పాటలిం దున్నాయి పద్యమెంత రమ్యంగా వారి చేతిలో నడుస్తుందో, అంతే అందవందాలతో గేయమున్నూ నడుస్తుంది

గడియారం వేంకట శేషశాస్త్రిగారన్నట్లు 'వేటూరివారు వర్తమానాంధ్ర సాహిత్య పథప్రవర్తకులైన మహాకవులు. వేటూరి అవేలమైన భావన కల కవి ఆంధ్రము నందమంద ప్రీతి, తాత్త్విక చింతనము, సరసమైన తేటతెనుగు పలుకులు, నుడికారములు, వీరి కవితకు సహజాలంకారాలు పూర్వ కవి ప్రయోగ దక్షత వీరి సొమ్ము. అందుచేత పెద్దనవలె బింకము, పొంకము కల పదబంధ సంయోజనంతో కవితలు కూర్చినారు. చిత్తవికాసం కలిగించే వాస్తవ సంఘటనలను జనజీవితంలోంచి కవితా వస్తువులుగా స్వీకరించటం వేటూరి కవి ప్రత్యేకత. తెలుగు నుడుల తీరు తీయములు లెస్స యెరిగిన వారగుట, వారి పదప్రయోగం సురుచిరంగా ఉంటూ అనుభవ స్పర్శ నందిస్తూంటుంది విందుగొల్పు తెలుగు పలుకుబడులతో ధారాశుద్ధితో అలంకార వైచిత్రితో తేనెవాకవలె కవిత ప్రవహిస్తుంది శాస్త్రిగారి మొగ్గ కావ్యప్రయోజనాల్లో ఔపదేశికతవైపు. రచనలో తాత్త్విక దృక్పథం ఉంటే, సమాజంలోనూ అది పెరుగుతుందని ప్రభాకరుల విశ్వాసం అదే కవితా పారమ్యంగా నిర్దేశించు కొన్నారు. వారి హృదయం కవితకు లోగుతుంది. పరమార్థానికి పరుగులు తీస్తుంది. ఊహాలోకాల్లో విహరించని సమాజస్పృహగల కవి వేటూరివారి దృష్టిలో కవిత 'అమృతధార, రేడియము, భగవంతుడున్ వలె, సుదుర్లభంపు వస్తు వదియ'. కవి అంటే ప్రభాకరుల దృష్టిలో

''అది అకృత్రిమమై, దివ్యమై, పవిత్ర
మై, శవేతరక్షతి కరమై, పరార్థ
సాధకంబై రహించు - నా సత్పదార్థ
మబ్బినత డిష్ట సంపద ప్రబ్బి నతఁడు''

# 8. నాటకానువాదాలు

ప్రభాకరులు కవితాశాఖను సుసంపన్న మొనర్చినట్లే రూపక ప్రక్రియను చేపట్టి వాసి కెక్కినారు వారు తమ యిర్వదిరెండవయేట కవితా వ్యాసంగం చేస్తూనే రూపకానువాదాలకును పూనుకొని, సంస్కృతంలో భాసమహాకవి రచించిన (1) ప్రతిమా (2) కర్ణభార (3) మధ్యమ వ్యాయోగాలు తెనిగించారు. 1910 నాటికి భాసనాటకా లచ్చుపడనే లేదు గ్రంథాన్వేషణకుగాను తిరువనంతపురం వెళ్ళిన మానవల్లి రామకృష్ణకవిగా రా నాటకాలను కొన్నింటిని 'కాపీ' చేసికొని వచ్చి కొన్ని తాము, మరికొన్ని ప్రభాకరులు అనువదించారు ఉభయులు మంచి మిత్రులు కూడా

భాసనాటకాలు మూడింటిని 1910లో తెలుగు చేశారు అనువదించటానికి కొన్ని మార్గాలు స్వయముగా ఎంచుకొన్నారు అంతకు ముందు పరవస్తు రంగాచార్యులు, కోరాడ రామచంద్ర శాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం పంతులు, వేదము, వడ్డాది మున్నగువా రెందరో అనువాదరంగంలో ఉన్నారు. అవి యథాతథానువాదాలు. శ్లోకాలను పద్యాలలోకి, వచనాల్ని గద్యంలోకి మార్చినారు వేదమువారు కొన్ని చోట్ల వ్యావహారిక భాషను వాడక పోలేదు. మూలంలో ప్రాకృత మున్నచోట అచ్చుతెనుగు వాడినవారు కొందరు, గ్రాంధికంలో చేసిన వారు కొందరు, సులభగ్రాంధికం వాడినవారు ఇంకొందరు, ఇలా త్రోవలెన్నో ఏర్పడ్డాయి

**ప్రతిమ** : శాస్త్రిగారు ప్రాచ్యభాషా విద్వాంసు లయ్యు, సమకాలీన సమాజంలో, భాషలో వస్తున్న మార్పుల్ని చిన్నతనములోనే ఆకళించుకొన్న ప్రతిభావంతులు. అప్పటికే మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోనున్న వ్రాతప్రతులు, చరిత్ర-సాహిత్యాలకు సంబంధించినవి ఎన్నో కన్నుపొడుచుకొని చదివారు. గిడుగువారి భాషోద్యమం సుడిగాలిలా ఒకమూల బయలుదేరుతోంది అట్టి అదనులో భాషాప్రయోజనాలు నిర్దిష్టంగా వివేచించుకొని, ఆ స్ఫూర్తితో

సంస్కృతనాటకాల్లో ప్రాకృతమున్న తావుల్లో వ్యావహారికభాష ప్రతిభావంతంగా ప్రయోగింప నిర్ణయించుకొని తెలుగు పలుకుబడి, నుడికారపు సొంపు పెంపులు వెలయునట్లు తెనిగించారు ప్రతిమా నాటకానువాదంపై శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారివంటి ఉద్దండ పండితులు "[1]సీతామహాదేవిచేత గ్రామ్యోక్తులు పలికించు టనుచితమని చెప్పక తప్పదని" ధ్వజమెత్తక పోలేదు. ఆరోజులలో ప్రభాకరుల నాటకానువాద పద్ధతి సాహసమే అనిపిస్తుంది

**అప్పుడు** మూల శ్లోకాలను విస్తరించో లేదా పద్యచర్వణాలు మిగిలిపోతే కల్పనలు చేర్చో అనువదించేవారు. శాస్త్రిగా రీరెండు దారుల పొంతకు పోక, తగిన వృత్తాన్ని ఎన్నుకోవటంలో మెలకువ చూపినారు యథావాక్యానువాదం కాక, సంస్కృత వాక్యపు తీరుకంటె తెలుగు వాక్యపు తీరు భిన్నమనే సత్యాన్ని గుర్తించి, దాని కనువైన తెలుగుపలుకుబడి, నుడికారపు తీరుతెన్నులు, తీరుతీయము లుట్టిపడునట్లు రచన చేసినారు పాత్రోచిత భాష నెన్నుకొన్న జాణ. ఎందువల్లనో ఈపద్ధతి అనంత రానువాదకు లందిపుచ్చుకొన్నట్లు లేదు.

అనువదించిన నాటకా లన్నింటికి విలువైన పీఠికలు సంతరించారు. భాసుడు రామాయణ, భారతాల్లోని అనౌచిత్యములను సవరించుటకై నాటక రచన యొనర్చిన ట్లభిప్రాయ పడినారు. కైకేయీ, భరతాది పాత్రలను హృద్యముగా సరిపరచినట్లు, కాళిదాసాదు లిది అందిపుచ్చుకున్న తీరు వివరించినారు. ఇట్లెన్నో క్రొత్తసంగతులు వివరించుట ప్రభాకరుల ప్రత్యేకత. అనువాద సరణికొొక మచ్చుతునుక.

శ్లో. విలపసి కిమిదం విశాల నేత్రే !
విగణయ మాం చ యథా తవార్యపుత్రమ్
విపులబలయుతో మమైష యోద్ధుం
స సురగణోఽ ప్యసమర్థ ఏవ రామః

**తెనిగింపు :**

ఏడిచె దేల బేల ? కనుమీ ! నను మీనవిశాలనేత్ర ! నీ
వేఁడెడు నార్యపుత్రునటు వేడుక సేయమి, నన్నుఁగూడఁ, బో
రాడఁగ నేఁగుదేరఁగల డా యిఁక రాముఁడు, సేనలెన్ని వెం
టాడిన నేమి, వేల్పులు సహాయులుగా నరుదెంచి రేనియున్

1. వజ్రాయుధము 1సం పు. 3సంచిక - పుట 3.

**2. కర్ణభారము :** రచన 1910 ప్రచురణ 1913 దశవిధ రూపకాలలో 'వ్యాయోగ' శాఖకు చెందినది ఏక దివస చరిత్రమునకు పరిమితము.

శల్యుడు సారధిగా కర్ణుడు కురుక్షేత్ర సంగ్రామానికి పోయిన వేళ, ఇంద్రుడు బ్రాహ్మణవేషధారియై రాగా కవచకుండలము లొలొసంగిన కథ

వీరి అనువాదంలో మూల పదబంధములు గైకొను టరుదు. తెనుగుదనము తొణికిస లాడుతుంది 'భుజంగ జిహ్వా చపలా నృపశ్రియః' అనే మూలానికి 'త్రాచు నాల్కల వంటివి రాచసిరులు' అని ముచ్చటైన తెనిగింపు. సంప్రదాయవేత్త లగుట, మూలగ్రంథ సంప్రదాయము లెచ్చటను జారవిడువలేదు భాసునివి చిన్న చిన్న వాక్యాలు అనంతరు లాసంప్రదాయాన్ని ఉజ్జగించా రెందుకనో !

**3. మధ్యమ వ్యాయోగము :** భారతకథ కంటె వింతగా సంతరింపబడినది హిడింబి, భీమ, ఘటోత్కచ పాత్రలిందు వచ్చును చమత్కృతి మెండుగా కల చిన్నకృతి మేల్తరముగా అనువాద మొనర్చియు వారి వినయ వాదము కనుడు "ఇందు స్వారస్యమునకు భాసమహాకవిని మెచ్చుడు వైరస్య మొదవెనే నాయది నాయది" మూల శ్లోకానువాదములను ఔచిత్య మెరిగి, ఉచిత ఛందముల నెన్నుకొనుట మేలి పోకడ సంప్రదాయము లెరిగిన ప్రోడగావున, మూలగ్రంథ సంప్రదాయము లెచ్చటను జారవిడువలేదు

**4. మత్త విలాసము**[1] **:** కర్త మహేంద్రవర్మ. క్రీ.శ. 7వ శతాబ్ది. చిత్రకళా కుశలుడు. ఎన్నిక గన్న పల్లవరాజు ఇది ఏకాంక ప్రహసనము. బౌద్ధ, కాపాలికోన్మత్తులు బిచ్చునెత్తుకొనుచు, ఆచార్యుల సైత మవహేళన సేయుచు ప్రొద్దులు పుచ్చినట్లు కథాశరీర కల్పనము. ఆయా మతాల పతనావస్థ ఇం దభివర్ణితము ప్రాకృతశ్లోకాలకుకూడా వ్యవహారభాషలోనే పద్యానువాదా లుండుట క్రొత్తగా కనిపిస్తుంది. అనువాద సారళ్యమునకు తిలకించండి

భామిని చెక్కుటద్దములపై ఁ బులకల్ మొలకెత్తెఁ, గన్బొమల్
వామములై రహించె, జిగి వాతెఱపై నును నవ్వు వెన్నెలల్
ప్రామికొనెన్, సుదుర్లభపు భాగ్యము నా కిటువంటి నీదు నె
మ్మోము లభించెఁ జెందఁదగు భోగ్యము నాకిఁక నేమికల్గెడిన్ - పుట 2

**5. భగవదజ్జుకము :** కర్త బోధాయన మహర్షి క్రీ.శ. 6వ శతాబ్ది అతి ప్రాచీన ప్రహసనము 1913లోనే అనువదించినా, 1924లోగాని ప్రచురణ కాలేదు.

---

1. రచన 1993, ప్రచురణ 1935.

ఇది ప్రాకృత బహుళమైన కృతి మూలప్రతి తప్పులతో ఉన్నా, విడమరచి, సవరించి అనువదించినట్లు రచయిత తెల్పుకొన్నారు మూలగ్రంథాన్ని కూడా పరిష్కరించి ప్రభాకరశాస్త్రిగారు 1925లో ప్రచురించినారు. నేరొక రాంధ్రీకరించినట్లు కానరాదు.

జీవాత్మ, పరమాత్మ, కుండలినీశక్తి ప్రతిరూపములగు శిష్య, పరివ్రాజక, గణికల రంగస్థలి నాడించి, దుర్గ్రహమైన యోగమార్గాన్ని పామరులకు చూపించా డీకవి. ఈ కథలో వేశ్య అజ్జుక చనిపోగా, పరివ్రాజకు డందు పరకాయ ప్రవేశం చేస్తాడు. ఆమె సన్యాసివలె మాట్లాడడం మొదలు పెడుతుంది ఇంతలో యమభటులు వెనుకకు మరలిపోగా, వేశ్య బ్రతికి ఉండటం చూచి, పరివ్రాజకుని శరీరమున వేశ్యప్రాణాలు ప్రవేశపెట్ట బడతాయి. ఇది పరివ్రాజకునకు తెలియదు. శిష్యు డాలోచనలో పడతాడు. ఇట్లా చిత్ర విచిత్రంగా సాగుతుంది ఈ ప్రహసనం. కడుపుబ్బ నవ్వించే ప్రాచీన సంస్కృత ప్రహసనం.

మూలమును గుర్తు రానీయని ముచ్చటైన తెనిగింపు. వ్యావహారిక భాషాశైలి కుదాహరణ. ''నాకుమల్లె పెద్దన్నయ్యల్లే ఉన్నాడు చూడగా''. కొన్ని శ్లోకాలు గేయాల్లో అనువదించారు. ఔచితీమహితములైన భిన్న ఛందస్సు లీయనువాదంలో ప్రభాకరు లెన్నుకొన్నారు.

**6. నాగానందము :** కర్త శ్రీహర్షుడు. 7వ శతాబ్ది. త్యాగపూర్ణ రచనలంటే శాస్త్రిగారికి మక్కువ భవభూతి కవితంటే ప్రాణము. ఈనాటకంలో పూర్వభాగం శృంగారం, ఉత్తరభాగంలో త్యాగవీరము. తొలి రెండంకాలే శాస్త్రిగా రనువదింప, శేషభాగము ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు పూరించారు. విద్వత్కవితంసు లయ్యును, పరుల బాధానివారణకై ఆత్మార్పణమొనరించిన శాస్త్రిగారీ నాటకానువాదం చేయటం ఒక అపూర్వ సంఘటన. ప్రతిభాపాండిత్యముల మాట అటుండగా, వ్యక్తి జీవలక్షణము సరిపడినచో ఆ రచన మేల్తరముగా నుండును. ఈనాటకంలో శంఖచూడుడనే నాగకుమారుని రక్షించుటకై జీమూతవాహను డాత్మార్పణ మొనర్పగా, గరుడు డమృత వర్షము కురిపించి నాగుల కానందము కూర్చినాడు. అదియే 'నాగానంద'మైనది. ఇందు నాయిక మలయవతి మనస్సు ఊగిసలాటను అద్దమున చూపినట్లు చూపిన పట్టులో ప్రాకృత శ్లోకాని కనువాదం చిత్తగించండి.

గురువచనమొక్క పెడ గుంజుతున్నది నన్ను
ప్రియదర్శనేచ్ఛ వొకపెడ గుంజుతోంది
వెడలఁదోచదు, వెడల కుడుగఁదోచదు, మన
స్సుయ్యాలవలె నాకు ఊగాడుతోంది.

జ్ఞాతశిల్పి చేయు రచమమిట్టిది ఏ అనువాదకుడైనను, జ్ఞాతశిల్పి యగు మూలకని ఉద్దేశించిన శిల్పరహస్యాలనెఱిగి, వానిని అనువాదమునందు దెచ్చుకొనుటకు పూనుకొన్ననాడే, మూలకర్తకు న్యాయం జరుగుతుంది శాస్త్రిగారి నాటకానువాదము లీకోవ లోనివి

**7. గౌరీకళ్యాణము :** ఇది ప్రభాకరశాస్త్రిగారి స్వకపోల కల్పిత శ్రవ్యనాటిక మదరాసు రేడియో కేంద్రమునుండి 22-2-44న ప్రసార మయినది. నాలుగంకాల నాటకం మైనాకుడు చెల్లెలు పార్వతికి సంబంధం చూడటం తొలి అంకం. మలి అంకంలో నారద ప్రస్తావన. గౌరీ - సోదెకత్తెల సంభాషణ మూడో అంకం నాల్గవది గౌరీ కళ్యాణ కథ

జానపద పాత్రలైన సింగి, సింగడు ఈనాటికలో ప్రవేశపెట్టడం వీరి మౌలికత. మైనాక పాత్ర విషయంలో సముద్రంలో దాగివుండటానికి కారణమైన ఇంద్రుని కోపానికి తమ రచనలో ఒక అపూర్వ సన్నివేశ కల్పనం చేసి ప్రతిభాప్రదర్శనం చేశారు నాటకం ఎంతో కమనీయంగా రూపు దిద్దుకొంది

అప్పటికి మద్రాసురేడియో కేంద్రం ఏర్పడి ఐదారే ళ్ళయింది శ్రవ్య నాటికకు ఇంకా సరియైన రూపం ఏర్పడలేదనే చెప్పాలి రంగస్థలంమీద చూపే సాత్త్వికాభినయా లన్నీ రేడియోలో వాచికం మూలంగానే స్పష్టం కావలసి ఉంటుంది. రచయిత ప్రతిభావంతు డైతేనే ఇది సాధ్యపడుతుంది ఈ నాటికారచనలో శాస్త్రిగారు కృతకృత్యులై రేడియో రూపక సాహిత్యానికి మంచి అలంకారాన్ని ప్రసాదించా రనటం వాస్తవం. జానపదుల నోళ్ళలో నాట్య మాడే గేయ ఫణితుల్ని, యక్షగాన పద్ధతులను ప్రభాకరులు తమ రచనలో పొదువుకోవడం జరిగింది. వ్యావహారిక భాషావాదానికి తొలినుంచి భుజ మొడ్డిన శాస్త్రిగారు, ఆభాషలో నాటకం రచించి చూపటం సంభావింపదగింది.

అనువదించిన నాటకాల్లో, స్వతంత్ర నాటకంలో తమదైన ముద్రను నిల్పుకొన్న సాహిత్య నిర్మాత శాస్త్రిగారు. అన్నిటా మౌలిక ప్రజ్ఞ దర్శన మిస్తుంది. ధారాశుద్ధి, పదప్రయోగ చాతురి, పాత్రోచిత భాష, నుడికారపు సోయగం, సంప్రదాయ పోషణ, అక్లిష్టమైన అనువాద సరళి, నాటక సాహిత్య నిర్మాతగా వారి స్థానాన్ని ఎప్పటికీ భద్రంగా నిలబెడతాయి.

# 9. ప్రాచీనగ్రంథ పరిష్కరణ

# (1913-40)

దేశం నలుమూలలా గాలించి తాటాకు పుస్తకాలు సేకరించడమే కాదు, వాటి ప్రచురణకై శతవిధాల ప్రభాకరులు జాతిని ప్రబోధించారు. అంతతో ఊరుకోక, తాటాకుల్లో చివికి జీర్ణిస్తున్న గ్రంథ రాజముల ప్రకటనకు పూనుకొన్నారు.

ప్రాచీన గ్రంథపరిష్కరణ పల్లుక్లేశములతో కూడిన పని. ముందు లిపి స్వరూపం తెలియాలి అది నిరంతర పరిశ్రమవల్లగాని ఒనగూరదు. లేఖకప్రమాదాలు పరిశీలించాలి కవి హృదయా న్నెఱిగి సాధుపాఠాలు నిర్ణయించాలి. కంట్లో వత్తి వేసుకొని జాగ్రత్తగా ప్రతి చదవాలి. ఇదొక యజ్ఞం లాంటిది. 1905లో భాగవతాన్ని పరిష్కరించిన తంజనగరము తేవపెరుమాళ్ళయ్య పీఠికలో 'కొన్నిపాఠములు పండితులు మూలానుసారముగా లేమిని మార్చి- యుందు రనియును, అవి శోధనమున అభేద్యవ్యూహమును దాల్చియున్న- వనియును' తెల్పినారు. నిజమే. పద్యాలకు పద్యాలే మార్చినవా రున్నారు. తమకు నచ్చని ప్రయోగాలను దిద్ది పెడదారి త్రొక్కినవారున్నారు. అందువల్ల మూలగ్రంథం స్వరూప స్వభావాలు మఱుగున పడిపోయినవి. అయితే ప్రభాకరులు 'తాళీదళ సంపుట ప్రకరకాంతారాల్లో' ఎడతెరపి లేకుండా సంచరించటంవల్ల, లోపలి దారులన్నీ వారి కెరుకే. అందుచేతనే వివిధ ప్రతులను తైఫారువేసి పాఠాలు చేర్చే పద్ధతిని తెలుగున ప్రవేశపెట్టి దానికి మూలపురుషు లైనారు. నిరంతరాభ్యాసంవల్ల వారి చూపు ఎప్పుడూ సాధు పాఠాలవైపే ఉండేదంటారు తిరుమల రామచంద్ర ఆరోజుల్లో తెలియని వన్ని తప్పులని దిట్టతనాన దిద్దడానికి జంకుగొంకు లుండేవి కావు పాఠం సంస్కరించటానికి బహుభాష పాండిత్యంతోపాటు స్ఫురణకూడా

ముఖ్యం. శాస్త్రిగారి ప్రతిభకు స్ఫురణ మెరుగులు దిద్దింది. కవిహృదయాన్ని గుర్తెరిగి సాధుపాఠం లెస్సగా నిర్ణయించుటలో దిట్టలు.

**పరిష్కరణ పద్ధతి :**

శాస్త్రిగారు మూలప్రతిని తొలుత నిర్ధరించుకొనేవారు. ప్రక్షిప్తభాగాలను గుర్తించుట, భిన్నప్రతులతో సంప్రదించుట, ప్రతిపుట అడుగునా ఆయా పాఠభేదాలతో మూలానుసరణ లొసగుట, ప్రక్షిప్తాలను మూలగ్రంథంనుంచి వేరుచేసి అనుబంధములలో చూపుట, విశేషశబ్దాల అర్థవివరణ, సంప్రదాయములు తెలుపుట ఇట్లా శాస్త్రీయమైన గ్రంథపరిష్కరణ పద్ధతిని స్వయము రూపొందించుకొని, దాని నొక కళగా తీర్చి దిద్దిన మహనీయులు శాస్త్రిగారు.

పరిష్కరించి ప్రకటించిన గ్రంధాలు 23[1]. అందులో పురాణాలు, ప్రబంధాలు, శతకాలు, సంకలనాలు, చరిత్రలు, వీరగాధాకావ్యాలు, శాస్త్రగ్రంధాలు, సంకీర్తనకృతులు, ఉత్తరహరివంశ, హరవిలాసాది కావ్యాలు, నీతిద్విషష్టిక, భగవదజ్జుకాది సంస్కృత గ్రంధాలు, సుగ్రీవవిజయ యక్షగానము, బసవోదాహరణము, వేంకటేశ్వరవచనములు, సుభద్రాకళ్యాణము (మంజరీద్విపద) మున్నగునవి కొన్ని. వీటికి విషయ సంభరితమైన పీఠికలు కూర్చినారు. ఇవి భావిపరిశోధకుల కెంతో సామగ్రి నందిచ్చినవి.

ఇవికాక (1) కాశీఖండము, (2) శివతత్త్వసారము, (3) కవిలోక చింతామణి, (4) నైషధపారిజాతీయము, (5) నన్నెచోడకుమార సంభవము (8 ఆశ్వాసాలు), (6) భీమఖండము, (7) భేతాళ పంచవింశతి, (8) నీలగిరి యాత్రాచరిత్రము (వచనము) (9) కేయూరబాహుచరిత్రము పరిష్కరించి పెట్టుకొన్నారు. ఇవన్నీ అముద్రితాలు.

మొత్తము సంస్కృతాంధ్రాల్లో ముప్పది మూడు గ్రంథము లొకచేతిమీదుగా పరిష్కరించి, అం దిరువదిమూడు ప్రకటించి, ప్రకటింపజేసిన పండిత పరిష్కర్తలు తెలుగునాట లేరనే చెప్పవచ్చును. ఇదొక అద్భుత సాహిత్య విజయము !

పరిష్కరణలో వారి అనుభవా లిలా ఉన్నాయి. ఆంధ్రామరుకము 1949లో ప్రకటించారు దాని పీఠికలో ''మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాలకు ముప్పదేండ్లకు ముందు నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెమున అద్దంకి యింటిపేరి వైష్ణవాచార్యుల యింటనుండి దీనిని నేను సేకరించితిని. ఆ యేకప్రతినిజూచి మదీయులు చి.తి.

1. అనుబంధము చూచునది.

కోదండ రామయ్య శక్యమయిన సంస్కారములు జరిపి ప్రతి వ్రాసి యిచ్చిరి. ఈముద్రణములో పారలోపములు, తప్పు పాఠములు, చ ల యి ంయిు ం చె నేను సవరించితిని తాళ్ళపాకవారిదియని, రసహృద్యమునని దీనిని బ్రకటించితిని'' అని వ్రాసుకొన్నారు.

అట్లే రాజనీతిశాస్త్రము 'ఆంధ్రకామందకము' గూర్చి ''తంజావూరు సరస్వతీ మహల్‌లో తప్పుల మయముగా తాటాకుప్రతి యొక్కటే కలదు . .. ఎట్లో ప్రతి వ్రాయించి సందిగ్ధ స్థలములను సంస్కృత మూలమును జూచి పూరించియును, అందును గుదురని దాని నుచితరీతిని క్రొత్తగా రచనము చేసియును గ్రంధమును బూరించితిని. మక్కికి మక్కిగా వ్రాసినవ్రాత యగుటచే దానిని దిద్ది ముద్రణమున కిచ్చుట సాధ్యపడ దయ్యెను'' అని వ్రాసినారు

భోజమహారాజకృత (1000-1055) 'చారుచర్య'ను అప్పన మంత్రి తెనిగించెను. మానుషానంద మనుభవింపగోరువా రందరు తెలిసికొనవలసిన విషయము లిందు గలవు. తంజావూరు లైబ్రరీలో '1916లో చారుచర్య కృత్యారంభమును మాత్ర మక్కడ మానవల్లి రామకృష్ణ కవిగారును, నేనును జూచితిమి. .... చెత్తగా నొకమూల c జేర్చియుంచిన కొన్ని కొన్ని విడివిడి యాకులలో నాగరాక్షములతో వ్రాయబడిన యొక పీచుకాగితమునగల నాల్గు పద్యములే యిక్కడc జిక్కినవి కడమ గ్రంథ మెంత వెదకినను గానరాలేదు. ఆనాల్గు పద్యములను వ్రాసియుంచుకొంటిమి .. పదపడి రెండేండ్లకుc బ్రాచీన గ్రంథ పరిశోధనార్థము కృష్ణామండలమునc బర్యటించుటలో ముక్త్యాల ప్రభువులగు శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుజమీందారువారి పుస్తక భాండాగారమున సమగ్రముగా నీ చారుచర్య వ్రాతప్రతిని జూచితిని కాని యందుc గవి కులగోత్రాది వృత్తాంతమును దెల్పు (సీ॥ 'విద్వన్నుతుండు') అన్న పద్యము లేదు. గ్రంథపాతములు, వ్రాత తప్పులు నుండెను.'' ప్రత్యంతరము నెట్లో ఆం.సా. పరిషత్ కార్యాలయమునుండి సేకరించిరిగాని, తొలిప్రతి కిది ప్రతిబింబ మగుటచే తగినంత ప్రయోజనము చేకూరలేదు. ''తంజాపురమున దొరకిన పద్యములను, ప్రబంధ రత్నాకరములో నున్న పద్యములలోనుగల పాఠభేదములు చూపితిని...... గ్రంథపాతములకుc జేయబడిన పూరణములకు గుర్తు లుంచితిని''. దీనిని ముక్త్యాలరాజావారు 1922లో ప్రచురించినారు. శాస్త్రిగారి సత్యనిష్ఠ, చిత్తశుద్ధి, నిజాయితీ పైవాక్యాలు వెల్లడిస్తున్నాయి. భిన్న ప్రతుల సంపాదనమునకై ఆదినాలలో వారు గైకొన్న శ్రద్ధ, తత్ ప్రకటనమునకై పడిన తపన వారిని విశిష్టులనుగా మలచినది.

ప్రభాకరుల సద్యఃస్ఫురణ కొక ఉదాహరణ పావులూరి మల్లన గణితం పద్యాల్లో వ్రాయబడిన గణితశాస్త్ర గ్రంథం లెక్కలు కూడా పద్యాల్లోనే. దాన్ని పరిష్కరిస్తున్నారు శాస్త్రిగారు ఒక పద్యం వ్రాతప్రతిలో ఇట్లా ఉన్నది

అష్టమాంశంబు మొదలుగా నర్ధభాగ
మంత్యముగ, గ్రమంబున శేష మగుచునున్న
సప్తగోదావరీ సరోజములఁ దెచ్చి
ద్రాక్షారామ భీమేశ్వరు లోకనాథు

నాలుగో పాదంలో గణము తప్పినది యతి భంగించినది శిష్యుడు తిమ్మావఝల కోదండరామయ్య ప్రతిని చూస్తున్నాడు. శాస్త్రిగారు పద్యం సరిపోయిందా అన్నారు పైదోషా లున్నా యన్నాడు శిష్యుడు నీవు సవరించు అన్నా రతనితో. కొంత సేపాలోచించి కొఱకపడలే దన్నాడు. 'డాకరేమి భీమేశ్వరు లోకనాథు' అంటూ ప్రభాకరులు దిద్దమని చెప్పి, శ సం 1073 ద్రాక్షారామశాసనంలో ఉంటుంది చూడమని, శాసన పద్యమణి మంజరి 1వ భాగం తీసుకురా అన్నారు లోపలికి వెళ్ళి పుస్తకం తీసుకొనివచ్చి మీరు చెప్పినట్లే ఉందండి అన్నాడు కోదండ రామయ్య శాసనభా షంతా వారికి హృత్కవిలి దానికితోడు సద్యఃస్ఫురణ. అందుచేత ఎంత జటిలంగా పాఠం తికమక పెట్టినా, హేలగా క్షణంలో పరిష్కరించేవారు. నన్నెచోడకుమార సంభవం పాఠాల్లో వారి ప్రతిభ, ఎరిగిన వారికి తెలుసు ఎక్కడేనా పాదాలు పూరించవలసి వస్తే, మూలకవి నోట్లోనుంచి 'ఊడిపడినట్లు అచ్చం అలాగే ఉండేవి. బ్రాకెట్లు తీసేస్తే మూలరచయితే అనుకుంటాం.

శాస్త్రిగారు సంస్కృత, ప్రాకృత, తమిళ కన్నడాలు తరచినవారు. శాసనభాష కరతలామలకం శాసనలిపి, తాళపత్రలిపి సులభంగా పోల్చుకోదగినవి కావు. వాటియందు శాస్త్రిగారి అనుభవం దొడ్డది. సాధుపాఠనిర్ణయం కత్తిపై సాము వంటిది. ఏమాత్రం పొరపాటు వచ్చినా కథంతా తల్లక్రిందులే. ప్రాచీన గ్రంథ పరిష్కర్తగా ప్రభాకరులు మార్గదర్శులు. వారిగ్రంథపరిష్కరణలు - వాటికై కూర్చిన పీఠికలు పరిశోధనకు పంట పొలాలు

# 10. పరిశోధన

''భాషా విషయంలో పరిశోధన, శాసన విషయంలో పరిశోధన, చరిత్ర విషయంలో పరిశోధన. నాకు చూడగా శ్రీప్రభాకర శాస్త్రిగారు చేసినది పరిశోధనే. . మూడు మూర్తులా ఆయన పరిశోధకుడు, మూర్తీభవించిన పరిశోధన ఆయన'' ఈమాట లెవరో అన్నవి కావు. పరిశోధనకే జీవితం ఒడ్డిన మల్లంపల్లి సోమశేఖర శర్మగారి మాటలు !!

శ్రీప్రభాకరులు భాషాపరిశోధన క్షేత్రంలో శాస్త్రీయ దృక్పథంతో మౌలిక ప్రతిభతో దక్షిణదేశ భాషా సారస్వతాల సమగ్రపరిజ్ఞానంతో ప్రవేశించిన విద్వాంసులు. క్రొత్తదారులు వెదకుట ఆయన ప్రవృత్తి. కలం పట్టినప్పు డల్లా క్రొత్త సంగతులు త్రవ్వి రాశి పోయటం ఆయనకే చెల్లింది. గ్రంథపరిష్కరణలో - వాని పీఠికలలో ఎన్నో పరిశోధనలు వెలువరించారు. అనాదృత వాఙ్మయాన్ని వెలికి తీసి విలువలు కట్టినారు. జానపద, దేశిసారస్వతాలను పరిశీలించి పరిశోధించినారు. చరిత్ర శోధించి గ్రంథాలు వెలయించారు భాషాశాస్త్ర సమీక్షలు, శబ్దార్థశోధనలు గావించినారు దానివల్ల అపూర్వ విషయాలు, మఱుగున పడినవి బహిర్గత మయ్యాయి. శాస్త్రిగారు కేవలభాషా శోధకులేకాక, పరిశోధనకు ఆధారగ్రంథాలు కావాలని గుర్తించి, వాటికై శ్రమించి కొన్ని ప్రకటించారు. అవి భావిపరిశోధకుల కెంతగనో ఉపయోగపడినాయి. అందొకటి సంకలన గ్రంథాల ప్రచురణ.

**(1) చాటుపద్యమణిమంజరి (1913)** వారి పరిశోధన కిదే తొలిపూజ. ఈ సంకలనంలో దేవతాస్తుతులు, అవతారస్తుతులు, సంకీర్ణపద్యాలేకాక రెడ్డిరాజులపై వెలుగోటివారిపై, తంజావూరి పాలకులపై, సి.పి. బ్రౌను సేకరించినవి కొన్ని ఉన్నాయి. విశేష మేమంటే, 'దండయాత్రాఘోష' అనే పద్యం బయటపడటంవల్ల రెడ్డిరాజ్య చరిత్ర కదియెంత ఉపకరించిందో తమ 'రెడ్డి కింగ్‌డమ్స్'లో ఇట్లా చెప్పారు సోమశేఖర శర్మగారు. 'ఈ ఒక్కచాటువాధారంగా అల్లాడ వేముని విజయయాత్ర

తెలిసింది ఇదే దొరకనిచో అల్లాడ విభుని చరిత్రే తెలిసేది కాదు '' బ్రౌనుపై చాటువులు తొలిసారి తెలుగువారు చవిచూచారు అదిగాక, చాటుపద్య మణిమంజరి వల్లతెలుగు బాసరుచులు జాతి తెలిసి కొన్నది శాస్త్రిగారికి తొలిసారిగా వాడవాడలా జనసామాన్యంలో పేరుతెచ్చినది యీప్రచురణే ఆనోటఆనోట విన్నచాటువులను, తాళపత్రాల్లో మఱుగున పడ్డవాటిని గ్రంథస్థం చేశారు ఆయా చాటువుల సందర్భము లెఱిగించి ఆనుపూర్వితో పొందుపరచినారు. ఈసంకలనం వెలువడకపోతే, ఎన్నో మధురమైన చాటువులు కాలప్రవాహంలో కలసి పోయేవి. ఎన్నెన్నో రసవచ్చాటుధారలు కాలవాహినిలో కొట్టుకొనిపోయాయో అని వారు పరిదేవించుట మా యెరుకలోనిది జనశ్రుతిలోని గాథలు, ఆయా పద్య చమత్కృతులు గ్రంథస్థమైనాయి ఈసేకణ వారికొక ఉద్యమము. పరిశోధకులకు, చారిత్రకులకు ఇది అత్యంతోపయోగి అయినది ఇది వారి యిరువది యైదవయేట చేసిన కృషి.

**(2) చాటుపద్య మణిమంజరి II (1922)** : ఇందు దేవతా, కవి, రాజప్రశంసాస్తబకము లున్నవి అపురూపమైన రంగనాధుని శివ కవిత యిందున్నది. దామెరవారి వంశావళి తెలుగువారికి చెన్నపురితోడి సంబంధము తెలుపుప్రామాణిక రచన. చరిత్రశోధకుల కిందలి బిరుద, జయప్రశస్తులు విలువైనవి. పరిశోధకుల కిది ఆధారగ్రంథ మైనది. ఎంతో సాహిత్యం ఉత్సన్నం కాకుండ నిల్చింది దీని ప్రేరణవల్ల, ప్రశస్తివల్ల అనంతర కాలంలో మరికొన్ని వెలువడుట కవకాశమేర్పడింది.

**(3) ప్రబంధ రత్నావళి (1918)** అప్పటికి శాస్త్రిగారి వయస్సు ముప్పది అంతకు ముందు ప్రబంధమణిభూషణము (1910)ను పరిష్కరించి మానవల్లి రామకృష్ణ కవిగారు ప్రకటించినారు పెదపాటి జగన్నాథకవి యైదాశ్వాసములుగా సంకలించిన దానిలో తొలి మూడాశ్వాసములు శాస్త్రిగారికి లభించినవి. ఇంకొక సంకలగ్రంథసంధాతపేరు తెలియని దొకటి దొరికినది ఈరెండింటిని 'ప్రబంధరత్నావళి' పేర పరిష్కరించినారు గ్రంథపరిష్కరణ శాస్త్రిగారికి కూసువిద్య మరుగునపడిన కవుల కృతు లెన్నో తెలియవచ్చినవి కవుల చరిత్ర అన్నమయ్య శతకం గురించి మొట్టమొదట తెలిసింది దీని వల్లనే. అంతమాత్రమేకాక, పలుప్రాచీన కృతుల శోధనకు, ప్రచురణకు, ఈ ఆధారగ్రంథమే మూాదల కవిచరిత్ర నిర్మాతలకు క్రొత్త ఆలంబమయింది ఈసంకలనం.

**(4) గ్రంథవివరణికలు : (Descriptive Catalogues)** ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో ముప్పదేండ్లపాటు తాళపత్రగ్రంథాలు శోధించి 19 సంపుటాలు

గ్రంథవివరణికలు వెల్వరించినారు. ఈ ప్రచురణతో భాషాపరిశోధకులకు గనిదొరికినంత సంబరమైంది సమగ్రప్రణాళికతో దీన్ని కూర్చినారు దొరకిన ప్రతుల వివరణ, లభించిన తీరు, సేకరించిన తేదీ, కవిపేరు, ఆశ్వాసాద్యంత గద్యలు, లభిస్తే లేఖకునిపేరు, కవితాశైలి తెల్పే పద్యాలు, వంశవృక్షాలు, స్వల్పంగా కావ్య విమర్శ యిది దాని తీరుతెన్నులు ఆంధ్ర కవుల చరిత్రకు వాకిళ్ళు తెరచిన ట్లయింది కవుల కాలనిర్ణయానికి వారిచ్చిన వివరాలు తోడ్పడ్డాయి. ఆనాటి నుండి యీ వివరణికలు పరిశోధకులకు ఆధారగ్రంధంగా (Source book) ఉంటున్నాయి తర్వాత సాహిత్య పరిశోధన ముమ్మరంగా సాగింది పూర్వుల వ్యవహార భాష తీరుతెన్నులు తెలియ నయ్యెను

అట్లే క్రీ.శ. 4వ శతాబ్ది నుండి క్రీ.శ. 12వ శతాబ్ది వరకుగల శాసనాలను సంకలనం చేసి ఉంచారు. ఈకూర్పుకూడ పరిశోధనదృష్టితోనే ఇది అముద్రితము ఇక ప్రభాకరుల పరిశోధన విశేషాలు. వారు పరిష్కరించిన గ్రంథ పీఠికల్లో పరిశోధన గుట్టలుగా పోసినారు. పరిశోధన పేటికలని నాటిని సాహితీ వేత్తలు కొనియాడినారు

దక్షిణదేశభాషలలో విస్తృత ప్రామాణిక విషయ సంభరిత పీఠికలకు ప్రభాకరులే వరవడిపెట్టినారు. ఆపీఠికల్లో యధార్థాన్ని ఎట్లా ఆశ్రయింప వలెనో పరిశోధకులకు, పాఠకులకు మార్గాలు చూపి పథనిర్దేశకులైనారు. ప్రమాణం లేనిదే పలుకైనా కాగితం మీద పెట్టని నియమం వారిది సత్యనిష్ఠ, ప్రామాణికత వారి పరిశోధన విహంగానికి రెండు రెక్కలు.

**(1) బసవపురాణము (1926)** : ఈ పీఠిక 169పుటలు విస్తరించింది శివకవియుగ సారస్వతానికిది ముఖద్వారం వంటిది. ఆరాధ్యులు వీరశైవులు కారని వీరి నిర్ధారణ వీరశైవము 12వ శతాబ్దిలో పుట్టిందని సప్రమాణంగా నిరూపించారు ఇది కొన్ని వివాదాలకు దారితీసిన మాట నిజం. పాశుపతశైవమునుగూర్చి విద్యారణ్యుల అభిప్రాయాలు తెలిపినారు. వీరశైవము బసవేశ్వరోపజ్ఞమని ఆధారాలు చూపినారు. వీరశైవమూలగ్రంథాలను గూర్చి, బసవేశ్వరానుయాయులుసైత మెరుగని విషయాలు వివరించారు తొలిసారి. వీరశైవపండితులే విస్తుపోయారు వీరి పరిశోధనలు పరికించి.

అది యటులుండగా, ఆంధ్రవాఙ్మయ చరిత్రలో 'శివకవులు' అనే ప్రత్యేకశాఖ ఒకటున్నదని మొదట కనుగొన్నది ప్రభాకరులే. ఆ కవులు కేవల శివభక్తుల గురించి మాత్రమే వ్రాసినారు. దేశిమార్గమున వారి రచనము. శివకవులు భాషలో - ఛందస్సులో - సమాసకల్పనంలో స్వతంత్రత నెట్లు చూపిరో

వెల్లడించినారు తెలుగు వ్యాకరణవేత్తలు చెప్పని 'శిథిలద్విత్వ' మొక టున్నదని గుర్తించిన పరిశోధకులు ద్విపదవాఙ్మయపరిశోధకులకు ఈ పీఠిక చాలతోడ్పడింది

**(2) ఉద్భటారాధ్య చరిత్ర (1925) :** ఈ పీఠికలో తెనాలిరామలింగడు, రామకృష్ణుడు ఒక్కరే అని ప్రమాణాలతో నిరూపించినారు శైవవాఙ్మయ పరిశోధనకు కన్నడ కృతుల పరిశీలన అవసరమని గుర్తించి, ఉద్భటారాధ్య చరిత్ర విషయంలో ఆంధ్ర, కన్నడ కవులు భిన్నరీతులలో చెప్పినవి తెల్పిరి అవి సరిక్రొత్తవి

**(3) క్రీడాభిరామము (1928)** ఇది శ్రీనాథకవి రచితమే అని అంతరంగ సాక్ష్యం ఆధారంగా కాదనటానికి వీలులేని ఉపపత్తులతో నిరూపించారు వీరి పరిశోధనలో గాథాసప్తశతిలోని శ్లోకాలు రెండింటి కనువాదాలు కనుగొన్నారు ఏకశిలానగర (వరంగల్లు) చరిత్ర విషయాలను వెలికి తీసినారు. భవభూతి, మురారి మున్నగు సంస్కృత కవుల ప్రభావాని కిందు ఋజువులు చూపించినారు. గ్రంథకర్తృత్వ చర్చలో వారినిశితమేధ గోచరిస్తుంది

**(4) సుగ్రీవ విజయము (1939)** శాస్త్రిగారు పరిష్కరింపగా కపిలేశ్వరపురం జమీందారులు శ్రీశ్రీబలుసు బుచ్చిసర్వారాయడుగారు ప్రచురించినారు 'మధురకవిత'లనే పీఠికలో 'యక్షగానోత్పత్తి, భాష, భావం, ఛందస్సు దేశిగా ఉండుట లక్షణమని తెల్పి, కురవంజి - యక్షగానవాదాని కంకురార్పణ గావించి, తర్వాతి పరిశోధకులకు త్రోవచూపినారు. తదుపరి యక్షగామ పరిశోధనగావించిన వారిలో ఆచార్య యస్వీజోగారావుగారు ప్రథమగణ్యులు

**(5) హరవిలాసము :** (1939) ఇది శ్రీనాథమహాకవి కృతి. ఈపీఠికలో తరుణాసీరి, తవాయి భౌగోళికంగా మలయాద్వీప కల్పంలోని నగరాలని గుర్తించి చెప్పినారు. ఆనాటి తెలుగువారి వ్యాపారం ఆదీవులదాక ప్రాకినదని వివరించారు.

తొలితెలుగు ఉదాహరణ కావ్యం బసవోదాహరణము (1928) వెలికితీసి ప్రచురించిన కీర్తి వేటూరి వారిదే. అట్లే అప్పనచారుచర్య పీఠికలో సామాజిక స్థితిగతుల వివరణ సామాజిక శాస్త్రజ్ఞుల కుపయుక్తమైనది

**(6) పరిశోధక వ్యాసాలు :** భాషమహాప్రస్థానాన్ని గూర్చి 'వాఙ్మయ పరిణామము' అనే వ్యాసంలోనూ, శబ్దపరిణామాన్నిగూర్చి 'ఆంధ్రభాషావతారం'లోను తెల్పినారు. 'అరసున్న'ను గూర్చినది భాషాశాస్త్ర పరిశోధన సంబంధి. నన్నయయకు పూర్వపు ఛందస్సు (1922) ఛందశ్శాస్త్ర శోధనకు సంబంధించినది. మల్లికార్జునపండితుడు 'వాణస' వంశము వాడని,

పద్మోత్తర ఖండపురాణ కృతి కర్త కందనామాత్యు డీవంశములోనివాడనీ శాస్త్రిగారు శోధించి తెల్పినారు. 'రంగనాథుని శివకవిత' వీరి పరిశోధనలో బయల్పడినదే. సంకీర్ణ తాళపత్రాలనుండి ఎఱ్ఱాప్రగడ రామాయణంలోని ముప్పది సద్యాలు బయట పెట్టినారు విచక్షణాత్మకమైన విశ్లేషణ కిది ఉదాహృతి శాసనపరిశీలన ఆధారంగా భాషాచరిత్ర నిరూపించే పద్ధతికి ప్రభాకరు లాద్యులు

## చరిత్ర శోధన

**(1) తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర :** (1914) దక్షిణదేశాంధ్రుల చరిత్ర, సాహిత్యాలను గురించి పరిశీలించి, పరిశోధించి తొలుత ఎరుక కల్గించినవారు ప్రభాకరశాస్త్రిగారు. ఆనాటి తంజాపుర పాలకుల చరిత్ర, నాటి సంస్కృతపండితుల, కవుల చరిత్రలు, సంగీత సాహిత్య పోషణ, నాటి కవయిత్రులు, కనకాభిషేకాలు, రాజ్యతంత్రము, వారి దినచర్యలు, ప్రజల రాసిక్యము, పండితులైన ప్రభువులు, వారిశిష్యులైన పండితులు ఒక టేమిటి తంజావూరు సరస్వతీమహల్ విషయాలు, అన్నీ క్రొత్త సంగతులే. ఎన్నోక్రొత్త విషయాలు పరిశోధనలో బహిర్గత మయ్యాయి. ప్రభాకరుల రచనా పాటవాన్ని గూర్చి సుప్రసిద్ధ రచయిత, పత్రికాసంపాదకుడు వి.ఆర్. నార్ల ఇట్లా చెప్పారు ఒకలేఖలో (20-11-84) He was, as I now see, a great master of Telugu prose. I am particularly struck by the amazing felicity with which he moulded his style to suit the subject.... He, with his intimate knowledge of the life and literature of the last phase of our medieval age, could have given us an account of the wars of that period using the nomenclature of that period. వేరొకచోట వీరే పరిశోధనలో సి.పి బ్రౌను వీరిముందు వామను డన్నారు.

''దక్షిణదేశంలో పుట్టిన తెలుగు ప్రబంధాలు వందలు, వందలు ముక్కుమొగం చూడక కొందరు వెక్కిరిస్తున్నారు మంచి ప్రబంధాలు కావని; కాని వారి మాటలను మనం పాటించరాదు. మంచికాలం వస్తుంది. అందరూ వాటివల్ల ఆనందిస్తారు.... ఈ ప్రచురించిన అసలు కథావృత్తాంతం చెన్నపురిలైబ్రరీలో వున్నది. హెచ్చుతగ్గులు చెయ్యలేదు.... భాషాస్వభావం పాడుచెయ్యలేదు '' ఇవి శాస్త్రిగారి మాటలు. తంజావూరు పాలకుల సాహితీ వైభవాన్ని వెలుగులోనికి తీసుకొనివచ్చిన ప్రథమపరిశోధకుడు వేటూరి. రచనంతా వ్యావహారిక భాషలోనే. మూలకృతి కనుకూలమైన శైలిని వరించుటలో వీరి విశిష్టత కానవచ్చును. 'రఘునాథరాయల చరిత్ర' వ్రాయాలని చాలాకాలం అనుకొంటూ వచ్చారు. అది కలగానే మిగిలిపోయింది.

**శృంగార శ్రీనాథము (1923)** : ఈరచనలో ప్రభాకరులు రెడ్డిరాజ్య సంశోధనకు పునాది వేసినట్లయినది 'అంతకుముందు తెలుగులో ఎవరుఃగాని ఇట్టిగ్రంధం రచించి ఉండలేదని' ప్రసిద్ధ చరిత్రవేత్త ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్యగారు ప్రశంసించారు ఇయ్యది శ్రీనాథచరిత్రమే అయినా, ప్రాస్తావికంగా రెడ్డిరాజుల, వారిమంత్రుల, తత్కాలీన కవుల చరిత్రలను తడవినారు. కవుల కాలన్నిర్ణయం గావించారు. రెడ్లకాలంనాటి పదమూడు శాసనాలు అనుబంధంలో ప్రకటించినారు పిఠాపురం, దక్షారామాదుల గూర్చి శ్రీనాథు డొనర్చిన వర్ణనలు చారిత్రకంగా ఉండటాన్ని గుర్తించారు శ్రీనాథకవితకు మూల్యాంకణం చేశారు చరిత్ర పరిశోధనలో వారి ప్రజ్ఞకీ గ్రంధము తారకాణ [1]'హరజటాపతదమరాపగా సన్నిభ/శ్రీనాధ కవితా చరిత్ర చెప్పి'నారని ప్రసిద్ధ కవిపండితులు కోపల్లె శివకామేశ్వరరావుగారు జోత లర్పించారు

ఇవికాక శాతవాహనులు, ఇక్ష్వాకుల పుట్టుపూర్వోత్తరాలు, నాగార్జునుని కాలము, శివాజి మహారాజు మున్నగువ్యాసాలు చరిత్ర సంబంధు లెన్నో ఉన్నాయి.

## శాసన పరిష్కారములు - పరిశోధన

శాసన పరిష్కారమంటే శాస్త్రిగారి కమందప్రీతి అందుకై ఎంతైనా శ్రమపడతారు. నిరంతర ప్రాచీన శాసన ప్రతిబింబావలోకనంవల్ల ప్రాచీన లిపు లధ్యయనం చేశారు అక్షర పరిణామాన్ని గుర్తించారు దేశచరిత్ర వ్రాయటానికి వాఙ్మయము, శాసనములు ప్రధానాధారములు క్రీ శ 1800 ప్రాంతములో శాసన పరిశోధనకు విఘ్నేశ్వరపూజ గావించిన మహనీయుడు కల్నల్ మెకలంజీ దగ్గర గుమస్తాగా పనిచేసిన కావలి బొర్రయ్య. తదాది గిడుగు, కొమఱ్ఱాజు, మల్లంపల్లి ప్రభృతులు ఆమార్గంలో కృషిచేసినారు ఆకోవలోనివారు ప్రభాకరులు సహజంగా మహామేధావి అయినా ఉద్యోగ వ్యాపృతికూడా వీరికి సహకరించింది చారిత్రక పరిజ్ఞాన కుతూహలము, శాసనములవైపు మళ్ళించినది.

అమరావతీ శాసనములో 'నాగబు' అనే తెలుగు పద మున్నదని ప్రభాకరులు గుర్తించుట వలన క్రీ శ 200 నాటికే తెలుగున కొక లిపి, వ్యవహార మున్నట్లు తెలిసినది. మనకు తెలిసినంత వరకు తొలితెలుగు పదము శాసనమైనది ఇదే ఈశాసనమును చదివి 'తెలుగు భాష యేకాక్షరమాత్రము (ఇంచుమించు రెండువేసేండ్లనాటిది) దొరకె నననది పదిలక్షల రూపాయలు దొరకినట్లు

1. త్రిలింగ - 1-10-50

మురియదగినదే' అన్నారు (1928 జూన్ 'భారతి') శాసనపరిశీలనయందు వారి పరితోష మంతతటిది పదపడి లక్ష్మీపుర శాసనము, పల్లవ నరసింహవర్మ ప్రథమ తామ్రశాసనము, కపిలేశ్వరపురశాసనము (7వ శతాబ్ది)లను పరిష్కరించినారు అహదనకర శాసనములో 'సింతయక్కారము'న్నది శాస్త్రిగారి మతము ఇది యిప్పటికిని వివాదాస్పదముగానే ఉన్నది ఇవి కాక ముక్త్యాల శాసనము (క్రీ శ 1129)ను, నందిగామ తాలూకా శాసనాలను వెలువరించారు శాసనస్థపదాల కర్థవివరణ గావించారు అందువారి పాండితీ ప్రాగల్భ్యత గోచర మవుతుంది బహుకోణములనుండి పరిశీలించుట వారి పద్ధతి

ఈసందర్భంలో తల్లావజల శివశంకరశాస్త్రిగారు వివరించిన ఘటననుట్టంకిస్తాను. ''నాకు లభించిన స్తూపతామ్రసీది అక్షరాలు 'అయోమణిలిప్తకాః' అని నేను చదివి, అనుమానంరహితం కాక శాస్త్రిగారికి తెలియపరచాను ఆయన అది వేంగిలిపి, పూర్వచాళుక్యలిపి, చాళుక్యలిపి అని వివిధ విధాల ఆలోచించి 'ఆర్యమునేః ప్రుష్టకాః' అని చదివిన విషయం మరపురానిది ఈ ఆర్యముని బౌద్ధమతాచార్యులలో ఒకరు లిపి శాస్త్రమున వారి ప్రామాణికత నీసంఘటన ఉగ్గడించుచున్నది. లిపి పరిణామాన్ని అవగాహన చేసికోవటంవల్ల భాషావ్యాకరణములను చారిత్ర కావగాహనతో అనుశీలించిన ప్రాచ్యభాషా పండితులు ప్రభాకరులు. పరిశోధన పాటవం, శాసన లిపి పఠన సామర్థ్యం వారిని పరిశోధన పరమేశ్వరులుగా మలిచాయి సాహిత్యంలో చరిత్రలో శాసనాల్లో గుప్తార్థాల నెన్నింటినో ప్రభాకరులు బహిర్గతం చేశారు.

'వేటూరివారి వ్యాఖ్యలును బీఠికలున్ దెలుగుంబొలంతికిన్

పేటులు రేగు గందవొడి వెట్టినపూతలు'' (త్రిశూల నాటక ప్రస్తావనలో 1938) విశ్వనాథవారు.

''నాకంటె నెక్కువ గ్రంథపరిశోధనము చేసిన మీవంటివారు నాకు తోడ్పడి చేయూతనిచ్చి'' ఇత్యాదిగా వేటూరివారికి కైవారం పట్టినారు వీరేశలింగం పంతులుగారు (9.12.17 న కం వీ వ్రాసిన లేఖలో)

# 11. సాహిత్య విమర్శ

పరిశోధనలో వలెనే సాహిత్య విమర్శలోనూ క్రొత్త పోకడలు పోయిన శాస్త్రిగారి అడుగు పెద్దది ప్రాచీన సంప్రదాయాలలో భాషాధ్యయనం చేసిన వారైనప్పటికీ, సాహిత్యవిమర్శలో ఆధునికపద్ధతులను క్రొత్త త్రోవలను అనుసరించారు వారి విమర్శ ప్రధానంగా పీఠికలలో - వ్యాసాలలో - శబ్దవిచారంలో దర్శన మిస్తుంది ఈ విమర్శవల్ల తెలుగు భాషారహస్యాలు, సోయగాలు తెలుగువారు తెలుసుకొన్నారు

వీరికి పూర్వం శబ్దసాధుత్వాలు, అర్థవిచారణలు విమర్శగా చెలామణి అయ్యేవి. కందుకూరివారి కవుల చరిత్రలో చరిత్రను గూర్చిన విమర్శ ఎక్కువ క్రొత్త కోణంలో ఆంగ్లవిద్యాగంధంతో డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు కవిత్వ తత్త్వాన్ని వివరింప నారంభించారు. ఆ పూర్వరంగంలో శాస్త్రిగారు సాహిత్య విమర్శకు కడంగినారు.

ప్రభాకరులు కావ్య సమగ్రస్వరూపాన్ని దర్శించి విలువలు కట్టినారు ఉదాహరణకు మనుచరిత్ర పీఠికలో ప్రబంధపూర్వ కవుల ధోరణులు, పదాల పోహళింపు, శైలీ సంవిధానము, ఇతివృత్తంలోని ఔగాములు, రసచర్చ, కల్పనా చాతుర్యము, కాలచర్చ, విశిష్ట ప్రయోగాలు, ఆకావ్యం తరువాతి కవులపై ప్రభావం చూపిందా ఇట్లా శాస్త్రీయదృక్పథంతో స్వతంత్రంగా విమర్శపద్ధతులు రూపొందించుకొని విశ్లేషింప మొదలిడినారు. అన్యదేశ్యాల ప్రయోగా లెట్లా కావ్యాలలో చొరబడ్డాయో నిరూపించినారు. ఈసందర్భంలోనే కన్నడమున తిమ్మనార్యుడు 'భారతము'ను రాయల కంకిత మిచ్చిన క్రొత్తసంగతిని వెలువరించారు. చారిత్రక సంపుటాలలోని నూత్నాంశములు వెలికితీసి ఉట్టంకించారు. తులనాత్మకపరిశీలన వీరి క్రొత్త పోకడ. దానికి వారి బహుభాషాభిజ్ఞత మెరుగులు దిద్దింది. ఎడనెడ సాహిత్య విమర్శలోనూ క్రొత్త శోధనలు వెలువరిస్తూంటారు. కృష్ణరాయలకు 'కమల' అనే మూడవ భార్య ఉందన్న నిరూపణ అట్లాంటిదే.

కథారసౌచిత్యాన్ని వివరిస్తూ ఇంకొకచోట ''[1]రసానుభూతి కథాశ్రోతలకు, ప్రేక్షకులకు సంబంధించినదిగాని, కథాపాత్రలకు సంబంధించినది కాదని తెలియుట లెస్స. .. వరూధిని తన గూఢవృత్తాంతము చెప్పి, యద్భుతము గొల్పి మెప్పించి, ద్విగుణీకృత ప్రేమతో వరూధినీసన్మానము వడసినాడని భావించిననే ఇది రసాత్మకము కానిచో రసాభాసమే'' గుణప్రశంసయే కాక అనౌచిత్యములను వెల్లడించుట వారి పద్ధతి

పెద్దన రచనలోని మరియొక మెరుగు నిట్లు చూపిరి ''వరూధిని కామాగ్నిలో మైనమైకరగిపోక, వజ్రహృదయుఁడై నిల్చి శీలరక్షణచేసికొన్న ప్రవరుని మహనీయతను ప్రజ్వరిల్లఁజేయుటలో పెద్దన నిర్వహించిన నెఱజాణతన మాంధ్రసారస్వతమున మడియన్యత్ర దొరకనిది.. ఆకథాసుట్టనే పెద్దనను రాయల వారిసభలో తూర్పు దిగ్గజముగా, కడలూరి 'గవర్నరు'గాఁజేసినది'' వారి సాహిత్య విమర్శలు ప్రమాణబద్ధములుగా అలంకారసమ్మతములుగా భాసిల్లుట కిది తార్కాణము.

**బసవపురాణ పీఠికలో** (1926) ద్విపద, దాని తీరుతెన్నులు, వర్గప్రాసాది సంగతులు మరెన్నో ప్రస్తావించినారు. ద్రవిడ,కర్ణాటక భాషలలో దేశివృత్తములలో దేశిచరిత్రలు దేశిభాషలో రచితములైన వని చెపుతూ, నిష్కర్షగా ఆంధ్ర సాహిత్య ధోరణులను తూర్పారబట్టినారు. ''మనపూర్వులు పౌరాణికములైన యార్య కథలమీదను, సంస్కృతచ్ఛందస్సు మీదను, సంస్కృకప్రాయమైన తత్సమ భాషమీఁదను నభిమానము గలవారయి దేశీయేతి వృత్తములను, దేశీయచ్ఛందస్సులను, దేశిభాషలను జిదుకద్రొక్కిరి''. తెలుగు కావ్యాలలో అంధ్రతాముద్ర కొఱవడిన తీరును నివేదించినారు. అన్వయ క్లేశములు లేని ద్విపదను శైవకవులే సమాదరించి రని ప్రస్తావిస్తూ తెలుగు ప్రజల నాలుకలపై నాట్యమాడే పాటలు, పదాలు, తద్వికారము లేయని నిగ్గు తేల్చినారు. ''భాగవతములో 'మందార మకరందా' దిగా గల పద్యము పాల్కూరికి సోమనాధుని అనుకరణ మగుట వివరించిరి. బసవపురాణవిమర్శలో ద్రవిడ, కర్ణాట కృతులు యనుసరణల లున్నట్లు ప్రమాణములు చూపిరి. అవసరమైన పట్టుల కన్నడ కృతుల సంప్రదించిరి గొడగూచికథ మనసును ద్రవింప జేయగలదని వ్రాస్తూ 'సోమనాథుని చూపు కథాకల్పనమునందును, విషయ విన్యాసమునందును, భావప్రపంచమునందును బరుగులు వాఱినదే గాని, యతి ప్రాసచ్ఛందో బంధములందుఁ జిక్కుకొని యెక్కడను ద్రొక్కట పడలేదు'' ఇది వారి విమర్శతీరు.

---

1. సరస్వతి - 1 సంపు. 6వ సంచిక

**'బాలభాష'** పీఠికలో ''సుకవిత పెంపు సొంపులకు భాషాపరిశోధన మావశ్యకము, జనులలో నెన్ని యంతరము లున్నవో, భాషారీతులలోనూ అన్ని యంతరము లున్నవి భూములకువలె భాషకు 'సర్వే' జరుగవలెను''.

**ఉత్తరహరివంశ పీఠిక** (1936) లో కాలచర్చ శాసనాధారములతో నడచినది. ఎఱ్ఱన కవితలోని ప్రసాదగుణము సోముని కవితకు లేదని, నన్నయ ధారాశుద్ధి, తిక్కన భావగాంభీర్యము కలయికచెంది సోముని కవితలో బెరసినట్లు తెల్పిరి ఉత్తరహరివంశము దురవ బోధముగా నుండుటకు కారణములు 'అప్రతీత పదప్రయోగాభిమానము, శయ్యాసైగనిగ్య సంపాదన ప్రీతి, అనుప్రాస విన్యాసాభిరతి'గా పేర్కొన్నారు లోతైన పరిశీలనమున గాని ఇంతటి విమర్శరాదు. అన్నిట ప్రామాణికత, ప్రతిభాగరిమ, నిష్పక్షపాత ధోరణి, సత్యనిష్ఠ దర్శన మిస్తుంటాయి.

**హరవిలాస పీఠికలో** (1939) శ్రీనాథుని ప్రభావము జక్కన, పినవీరభద్రులపై నెట్లున్నది సోదాహరణముగ వివరించి, ఆంధ్రీకరణ పద్ధతి నిట్లు విమర్శించినారు. ''సంస్కృతపు హద్దులలో నుండక, శ్రీనాథుని యిచ్చవచ్చినట్లు విచ్చలవిడిగా నుండును కొలదిపట్టుల మూలాతిశాయి సౌందర్య మున్నను, రసోత్తరమైన కాళిదాసుని కుమారసంభవమును దెలిగించుటలోఁ గూడ జాగ్రత్త వహింపక, విశృంఖలముగా వర్తించుట కొన్నిచోట్ల వైరస్య కారణమును నైనది '' గుణదోష విమర్శ చేయుచు 'దదౌరసాత్ పంకజరేణుసంధి' అనుశ్లోకమున గండూషజలము 'పల్వలవారి యగుట యనౌచిత్యమని తెల్పి, అదే శ్లోకమున రథాంగమును 'గజము'గా మార్చుట నేర్పుతో కూడిన కూర్పు అని క్షీరనీర వివేచన మొనర్చిరి. అభిమానకవియని దేనినైన నెత్తివేయుట వారికి చేతకాదు సాధుపార న్నిర్ణయము వారి విమర్శలో నొక యంశము.

'రాయల విద్యాగోష్ఠి'లనే వ్యాసంలో (1924) సంగీత సూర్యోదయ పీఠిక చరిత్ర ప్రాధాన్యాన్ని సవిమర్శంగా నిరూపించారు 'దక్షిణదేశమందలి ఆంధ్రవాఙ్మయ' మనే వ్యాసంలో రఘునాథరాయల, విజయరాఘవ నాయకుల సాహిత్యకలాపాలతోపాటు చరిత్రవిషయాలను సాకల్యంగా విమర్శించి విలువలు తేల్చినారు. వచన వాఙ్మయము నన్నయనుండి చిన్నయ వరకు పొందిన పరిణామాన్ని, అంతరువులను వివేచనతో విశ్లేషించి విమర్శించినారు. చిన్నయ తర్వాత సంహితను పాటింపక సంధి విడగొట్టి వాక్యరచన చేసినవారిలో చదలువాడ సీతారామశాస్త్రి ప్రథముడని చెప్పుట వారి పరిశీలన పటిమకు మచ్చుతునుక. పూర్వులే వ్యాఖ్యానాదులందు సంస్కారశూన్య మయిన భాషనే ప్రయోగించినట్లు

ప్రమాణములు చూపినారు

పురాణయుగ కవులను గూర్చి తెల్పుతూ నన్నయది ఋషిమార్గము, తిక్కనది రసమార్గమునని సూత్రీకరించిరి 'శరత్ సమయమున సరాళముగ సమప్రదేశమున ప్రవహించు తెలినీటి తేనెవాకవలె నన్నయ రచన సుప్రసన్నమై చాటుమాటులు లేనిదై కరతలామలకముగా లనలోఁగల సర్వార్థములను ప్రవ్యక్తముగా గుర్తింపనిచ్చునదై సుఖప్రవేశ్యమై, సుస్వాద్యమై నిర్వక్రగతిలో నెగడుచుండును. గ్రంథగ్రంథులు నన్నయ రచనలో నుండవు'' అంటూనే శకుంతలోపాఖ్యానరచన అలంకారరీతినిబట్టి గ్రామ్యతా దోషజుష్టమని మొగమాట మేమి లేకుండ విమర్శించిరి ఎక్కడైనా తృణమణి నెనేపని వారి తీరు నన్నయ కవితను గూర్చి అంత బింకము పొంకముతో విలువ కట్టుట అరుదైన సంగతి. వారే 'ప్రపంచకవితలో ఆంధ్రకవిత కేదేని అగ్రస్థాన మబ్బదగిన యోగ్యతా కలదేని ఆయోగ్యతా విస్తరభార మెల్ల నన్నయ భారతభాగమే మోయవలసి యుండునని కీర్తించిరి. సన్నివేశానుగుణంగా వారిశైలి ఎంత సొంకంగా ఉంటుందో పైవాక్యాలు రుజువు చేస్తున్నాయి

నిత్య పరిణామ శీలమైన భాషకు, ఎప్పటి కప్పుడు వ్యాకరణాది నియమములు కూర్చుకొనవలెనని, అన్యభాషా పదములతో భాష పరిపుష్టము కావలెనని, ఏకతకు మాండలికముల ఉపయోగ మవసరమని భావించిన అభ్యుదయవాది ప్రభాకరులు.

**కవితాపారమ్యము** : 1943 నాటి వ్యాసంలో కల్పిత, తాత్త్విక కవితల తారతమ్యము, సత్య సౌందర్య దర్శనము, పరమానందానుభూతికి కవిత తోడ్పాటు వివరించినారు. ''సన్నిహితమైన సత్యసౌందర్యమును గుర్తించ గలిగిన కొద్దీ, రచయితలు దూరపు కల్పితపు వస్తురచనలకు స్వస్తి చెపుతారు. రచనకు నిజమైన సౌందర్యము పరమార్థపరాయణతవల్ల లభిస్తుంది. వారే దివ్య సాహిత్య దీపకులు''. కవిత పరాకాష్ఠను నిరూపించిన ప్రతిభాసుందరులు ప్రభాకరులు. సాహిత్యాన్ని వివిధ కోణాలనుంచి అనుశీలించి, శాస్త్రీయ పద్ధతిలో విమర్శసాహిత్య మెంతో వెలయించారు వేటూరివారు.

**శబ్దవిచారము** : సుష్ఠుగా ప్రయుక్తమైన శబ్దము కామధేనువువలె ఇష్టార్థములను వర్షిస్తుంది. శబ్దతత్త్వము నెఱుగుటకు లోతైన భాషాపరిశీలనం, చారిత్రకావగాహన, నిఘంటు పరిశీలన, లోకరీతి, సంప్రదాయాభిజ్ఞత, సారూప్య

1. తెలుగు మెఱుగులు - పుట 50, 59''

భాషానుశీలనము, సద్యఃస్ఫురణ, శాస్త్రీయదృష్టి వీటికితోడు ప్రతిభ జతపడవలెను ఇన్ని యర్హతలు స్వయముగ గడించుకొన్నవారు ప్రభాకరులు సంస్కృతంలో వ్యాసఘట్టాల్లాగున తెనుగులోనూ గ్రంధగ్రంధు లున్నాయి సడలని గ్రంధులను నిడగొట్టి ముడులు విప్పి అర్థములు వివరించారు అట్టివి 43 పదా లున్నాయి బసవపురాణ పీఠికలో 198 పదాల కర్థా లిచ్చారు క్రీడాభిరామ పీఠికలో 65 పదాలకు, నింత నిఘంటువుల పేరిట 12 పదాలకు, ప్రాత పలుకుబళ్ళు ఇరువదింటిని వివరించారు ప్రాచీననిఘంటువులలో అప్రౌఢ కల్పితాలు చోటుచేసుకొన్న తీరు వివరించటం అద్భుతం ప్రాతవడ్డమాటలు అంటే ''పలువురు పలుమారు ప్రయోగించి ఉచ్ఛిష్టములైన మాటలు'' అని వివరణ అట్లే శాసనగత పదాల కర్థవిచారము చేసినారు. 'బ్రహ్మపురు' లనగా దేవాలయములలోని స్వస్తివాచక బ్రాహ్మణులని అర్థము చెప్పుచూ ఈయర్థమున నన్నెచోడ శాసనము, చేబ్రోలు శాసనములనుండి ప్రమాణములు చూపిరి. శబ్దరత్నాకరకారులు తప్పినచోట్లు తెల్పిరి. శాస్త్రిగారు అర్థవివరణ గావించిన పదాలు చాలవరకు తెలుగు నిఘంటువులకెక్కనివే అంటే ఆశ్చర్యం వేస్తుంది. బువ్వముబంతి ఆటవలన 'చేపట్టు' అనే పదాని కర్థము తెలిసికొంటిమని వ్రాసినారు ప్రాతకాలపు పాటలు ప్రాచీన గ్రంథములట్లు పరిశీలింప దగినవని వారు తెల్పినారు సాధుపాఠనిర్ణయంలాగే శబ్ద విచారమునను వారిదృష్టి నిశితము. సహజముగా భాషాతత్త్వ విచారకుతూహలత మెండు పరిష్కృత గ్రంథ పీఠికలలో విశేషపదాలకు, అపూర్వ ప్రయోగాలకు అర్థవివరణయిచ్చు పద్ధతిని ప్రభాకరులు ప్రవేశపెట్టినారు.

**సి.పి.బ్రౌను కృషి :** (1798-1884) కల్నర్ మెకంజీ, సి.పి.బ్రౌను దొరల కృషి గురించి 4 3.1911న కృష్ణాపత్రికలో తొలుత ప్రకటించినారు. కేవలం బ్రౌను దొరపై 1923లో 'త్రిలింగ' లో మరో వ్యాసం. బ్రౌను సాహిత్య జీవిత చరిత్ర ఆంగ్ల ప్రతిని జె.ఎ ఏట్సు దొర సాయంతో 1936లో సేకరించి పెట్టుకొన్నారు. అప్పటి కదే తొలి ప్రతి. లేఖలుకొన్ని బ్రౌనువి 1923, 24 సంవత్సరాల్లో వెలువరించారు. సి.పి.బ్రౌను సాహిత్య సేవ గురించి, వారి ఆస్థానపండితులు గురుమూర్తిశాస్త్రి మున్నగువారిని గురించి, జనశ్రుతిలోని గాథల గురించి తెలుగువారికి తొలుత ఎరుక పరచిన కీర్తి ప్రభాకరులదే. బ్రౌను జీవితచరిత్ర వ్రాయాలని కూడా సంకల్పించుకొన్నారు. ఇంతటికృషి కళ్ళకు కనిపిస్తుండగా 'బ్రౌను లేఖలు' అనే శోధన గ్రంథంలో బంగోరె, శాస్త్రిగారిని చెనకుట, రచయిత ఎరుక చాలమిని, దుందుడుకు తనాన్ని వెల్లడిస్తున్నదేకాని, కేవల సత్యనిష్ఠ మాత్రము కాదు.

**స్థానిక చరిత్రలు :** వీటికే 'లోకల్ రికార్డ్సు' అని కూడా లోక వ్యవహార మున్నది కల్నల్ మెకంజీ లేఖకులచే వ్రాయించినవి నాలుగువందల సంపుటాల వరకూ ఉన్నాయి అవి పరిశోధకులకు గనులు ఆసంపుటాలను గాలించి, ఆరాశినుండి శాసనాలు, భాషా, చారిత్రక ప్రాధాన్యంగల వాటిని ఏర్చి శాస్త్రిగారు పత్రికల్లో ప్రచురించి పరిశోధకులకు క్రొత్త ప్రపంచాన్ని చూపినారు వీటివల్ల అపూర్వ విషయా లెన్నో వెల్లడికి వచ్చాయి కొన్ని సంపుటాలను మానవల్లివారు ఆంగ్లంలోకి తర్జుమా చేశారు.

**కథానికలు :** చిన్న కథలు వ్రాయటం అరుదైన రోజుల్లో (1924) కరుణకము కథనురచించారు పెద్ద సంగీతవేత్త కాలవ్యత్యయంవల్ల నిప్పచ్చరంలో బ్రతుకు వెళ్ళదీసిన వృత్తాంతము. చదివి కన్నీరు కార్చనివా డుండడు కల్పన, కథక్రమగతి, సంఘటనల ఆనుపూర్వి, అపూర్వ కథనము, ఉచిత శైలి ముచ్చట గొల్పుతాయి. కలికి-చిలుక ''ముగ్ధప్రేమికుల కథ తక్రానందస్వామి, పుణ్యవతి-భాగ్యవతి కథలు వ్రాసినారు. కామధేనువు కధ (1914) వ్యావహారిక భాషలో పునః కథనం మామేనత్త, మా మామ చిట్టిపొట్టి కథలు. మాతాతతాత (మరాటీ వెంకటభట్టు) కథ వ్రాయాలని సంకల్పించినట్లు ప్రభాకరుల 'డైరీ' చెపుతున్నది. అన్నింటిలో కథనశిల్పము, పాఠకుల హృదయాలకు హత్తుకుపోతుంది. ప్రసిద్ధ పరిశోధకులు కథలు వ్రాయటానికి పరిక్రమించటం చిత్రమే.

# 12. సంస్కృత సాహిత్యసేవ

'భాషాసు రమ్యా గైర్వాణీ'. ఉభయ భాషా సాగరాల లోతులు తాకిన ప్రభాకరులు సంస్కృత సరస్వతిని యథోచితంగా సేవించారు. వారి సంస్కృతరచనలు విరళాలైనా, ప్రభాభాసితాలు. ఎడ్వర్డుచక్రవర్తి పట్టాభిషేక (1902) సందర్భమున కొన్ని శ్లోకాలు రచించి, గురువుల మెప్పు చూఱగొన్నారు. అప్పటికి వారి వయస్సు పదునాలుగేండ్లు. పరమగురువులు మాష్టరు సి.వి వి.గారిని ఛందః పుష్పాలతో అర్చించారు. 1925లో మహాత్మాగాంధి మదరాసుకు వచ్చినపుడు స్వాగత శ్లోకాలు ప్రకటించినారు. వాచవి కొక్కటి

శ్లో. కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా చైక విశుద్ధవృత్తయే
సుదర్శనా ఆత్మవిదే మహాత్మనే
సుస్వాగతం మోహనచంద్ర గంధయే

ప్రభాకరులు సంకలించిన చాటుపద్యమణి మంజరి రెండవ భాగంలో సందర్భాలను వివరిస్తూ పదిమంది సంస్కృత కవుల చాటువులు ప్రకటించారు. అందులో బిల్హణ, పండిత రాయాదులవి ఉన్నాయి. మణిప్రవాళభాషలోనున్న శ్లోకసముచ్చయాన్ని వెల్వరించారు.

**నీతిద్విషష్టిక** : క్రీ.శ. 6వ శతాబ్దిలోని సుందరపాండ్యుని రచన. పురాణం సూర్యనారాయణ తీర్థులు, తాము సంయుక్తంగా పరిష్కరించారు. కనుపర్తి మార్కండేయ శర్మగారు ప్రకటించారు. దీనికి ప్రభాకర శాస్త్రిగారు సంస్కృతంలో (1928) పీఠిక రచించారు. శాస్త్రిగారి సంస్కృత శైలి కుదాహరణ ''అపిచాయం నీతిద్విషష్టికాకారః సుందరపాండ్యోఽన్యతమః. సుభాషిత గ్రంథసంధాతృభి ర్బహుభి రముష్యగ్రంథః పరామృష్టః, సుభాషితావల్యాం వల్లభదేవోఽస్యాః కృతేర్బహ్వీ రార్యాః

పరిజగ్రాహ శ్రుతానుశ్రవికయ్యైవ సతాస్పృహాకలయత్, సరసీమాం కృతి మానుపూర్వ్యా సనైనాపశ్యత్ .''

ఆంధ్రులైన సంస్కృత కవుల చరిత్రలు వ్రాయ సంకల్పించి, తొలివిడతగా సరస్వతి (ముక్త్యాల) పత్రికలో (1923, 24) జాయపసేనాని, చెన్నుభట్టు, విద్యానాథుడు, శాకల్య మల్లుభట్టు, విశ్వేశ్వర కవిచంద్రుడు, పశుపతి నాగనాథుడు మున్నగు పదిమందివి చరిత్రలు వ్రాసినారు వీరు పేర్కొన్న కవులలో నలుగురైదుగురివి, ఔత్తరాహులుగాని,దాక్షిణాత్య కవిచరిత్రకారులుగాని ఇప్పటికినీ గుర్తింపక పోవటము ఆశ్చర్య మనిపిస్తుంది. అట్లే తంజాపుర సంస్కృత కవుల వివరాలు విశదపరచినారు. శాసనస్థశ్లోకా లెన్నింటినో ఉద్ధరించారు

సంస్కృత ప్రాచీన ప్రహసనము భగవదజ్జుకమును పరిష్కరించి 1925లో పరిష్కరించి, సంస్కృతంలో పీఠిక వ్రాసి ప్రచురించారు ఈప్రహసనాన్ని తెనుగులోని కనువదించిన ప్రథములు కూడా వీరే.

ప్రభాకరుల సంస్కృతశైలి పరమసుకుమారంగా ఉండి, హృదయమార్దవం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది ప్రాచీనగ్రంధాలు ప్రచురించి సంస్కృతలోకానికి మహోపకారం చేశారు. భాసాదుల నాటకా లనువదించి తెలుగువారికి చూఱ లిచ్చినారు. వారి కలం ఉభయభాషలలో పదును తేరినది.

శాస్త్రిగారి సేకరణలో లొల్ల లక్ష్మీధరుడు కృష్ణదేవరాయలపై చెప్పిన చాటువూ, సమస్యాపూరణమూ చిత్తగించండి.

శ్లో ॥ శ్రీకృష్ణక్షితిపాల దత్త మణిభి ర్విద్వత్కవీనాం గృహో
నానారత్న విచిత్ర కుట్టిమ భువో రత్నాకరత్వం గతాః,
అబ్ధిః కేవల వారిపూర నిలయ స్సంభావ్యతే సజ్జనై
రంభోధిఃజలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారి ధిః

(రాయల వారిచ్చిన మణులతో విద్వత్కవులు తమయిళ్ళల్లో రత్నాలు పొదిగి చపటాలు చేయించు కొన్నారు. అందుచేత వారి గృహాలన్నీ రత్నాకరాలు (రత్నాలకు నెలవులు) అయిపోవడంతో నీళ్ళు మాత్రమే మిగిలిన సముద్రాన్ని సజ్జను లంతా 'అంభోధి, జలధి, పయోధి అనే పేర్లతోనే పిలుస్తున్నారు. అందుచేత సముద్రానికి రత్నాకరమనే పేరిప్పుడు లేకుండా పోయింది)

# 13. వ్యావహారిక భాషావాద సమర్థన

అంతకుముందూ కొంత చర్చ జరిగినా, వ్యావహారిక భాషోద్యమానికి ఒక నిస్పష్టమైన ఆకృతి అంటూ కలిగింది 1910 ప్రాంతంలో సరిగా ఆసంవత్సరంలోనే గురజాడవారి ముత్యాల సరాలు వెలువడటం మొదలైనది సంఘసంస్కరణోద్యమం లాగునే ఈభాషోద్యమమూ సాంఘిక ప్రయోజనాన్ని ఆశించి పుట్టినదే. నూటికి తొంభై మంది విద్యావంతులైనప్పుడే, సంఘంలో సుస్థితి యేర్పడి నప్పుడే, సాంఘిక రాజకీయ ప్రయోజనాలు ప్రజ లనుభవింప గలుగుతారు. కావున ప్రజలను విద్యావంతులను చేయడానికి, వారిలో సాంఘిక బాధ్యతలను ఉద్బోధం చేయడానికి వాడుకభాష ఎక్కువ సహకారి. పటిష్ఠభావ ప్రకటనకు వాహికగా రూపొందటానికి, సుసంపన్నం కావటానికి శిష్టవ్యావహారిక భాష మాత్రమే అందుకు సాధనం కాగలదు ఇది దృష్టిలో పెట్టుకొని గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారికోద్యమం లేవదీశారు వీరికి ఎ వి యన్. కళాశాల (విశాఖపట్నం) ప్రిన్సిపాలు పి.టి. శ్రీనివాస అయ్యంగారు, విద్యాశాఖాధికారి జె.ఎ. ఏట్సు చెరోవైపున నిలబడ్డారు గిడుగువారి మిత్రుడు గురజాడ ఊత మిచ్చారు. వీరే ఈవాదానికి మూల పురుషులు

ఆనాడు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రి, పేరి కాశీనాథశాస్త్రి, వజల చినసీతారామశాస్త్రి మున్నగు, సంస్కృత పండితులు ఈవాదాన్ని సమర్థించటం విశేషమే. ప్రభాకరుల వయస్సు అప్పటి కిరువదియైదేండ్ల లోపు. ఆయన ఏమంటా రంటే ''[1]రామమూర్తి పంతులుగారి వాదముతో నేను సంపూర్ణముగా ఏకీభవించినాడను 1912-13 ప్రాంతాల్లో వాడుకభాషలో నేనే కొన్ని గ్రంథములు ప్రకటించినాను సభలలో వాడుక భాష మాట్లాడడం, పత్రికలలో వ్యాసాలు వ్రాయడం కూడా తప్పుగా భావించే కాల మది '' గ్రామ్యభాషంటే అంత ఈసడింపు.

---

1. నవ్యసాహిత్య పరిషత్తులో ప్రసంగం - పుటలు 9-10 (1946)

1910లో భాసనాటకానువాదంలో వ్యవహారికభాష ప్రయోగించారు ఈ వాద సమర్థనకై 'కామధేనువుకథ' రచించారు వ్యావహారిక భాషలో కొద్దిమంది భాషాపండితులు మాత్రమే సమర్థించారీవాదాన్ని అయితే ఆదిశగా కృషిచేసినవారు తక్కువ. శాస్త్రిగా రావాదాన్ని సమర్థిస్తూ ప్రాచీన వచన రచనల్లో వాడుక భాష ఎట్లా చేరుకొన్నది ఆధారాలతో నిరూపిస్తూ వ్యాసాలు, వేరే కొన్ని గ్రంథాలు రచించారు 'గ్రామ్యమీమాంస' అనే వ్యాసంలో ''చాలామంది పండితులు ఇతరులు కూడా గ్రామ్యమంటే ఒహ చీడపురుక్కుందనో పెద్దపులిగానో కలరా గానో భావిస్తారు'' అన్నారు. మరోవ్యాసంలో ప్రాచీన కావ్యవ్యాఖ్యానాలు, కథలూ, శాస్త్రగ్రంథాలూ దేశచరిత్రలూ, చాలాచాలా వాడుకభాషలోనే ఉన్న వన్నారు. శాసనాలు వాడుకభాషలోనే అదికాక, వచనరచనలో వాడుకభాష ప్రయోగించటం సంప్రదాయ సిద్ధంగా ఉండేదని నిరూపిస్తూ గిడుగువారి 'తెలుగు' పత్రికలో (1919 సెప్టెంబరు) వ్యాసం ప్రచురించారు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో పండితులుగా ఉండటంవల్ల, లేఖలు, కైఫీయతులు, వ్యవహార పత్రాల్లో వ్యవహార భాష ఉండటం వారికి చక్షురక్షర గోచరం. కేవలం వినికి కాదు. అందుచేత వారు వ్యవహారభాషావాదాన్ని సమర్థించటం ఈఉద్యమానికి పెద్ద ఊతం ఇచ్చింది. తొలి నాళ్ళలో మూలస్తంభం. ఈభాషోద్యమంవల్ల తెలుగులోని వాఙ్మయంపట్ల భాషావేత్తలలో ఆసక్తి కలిగిందనటం నిజం. 'నోటి తెలుగు నాటి తెలుగు' వ్యాసమూ ఈకోవలోనిదే.

'వాడుకభాష మంచి నీటివలె బహు ప్రయోజనములు గలది. కావ్యభాష (గ్రాంథిక భాష) పంచదార పాకమువలె పరిమిత ప్రయోజనము గలది' అని విస్పష్టంగా చూడగలిగిన - వివరించగల్గిన భాషావేత్తలు శాస్త్రిగారు.

**లిపిసంస్కరణ :** ప్రభాకరులు కేవల భాషాచరిత్ర శోధనకే పరిమితం కాక, భాషయొక్క, ప్రధానంగా లిపియొక్క ఆధునికావసరాలను గుర్తించి, అధ్యయనంలో ముద్రణలో- 'టైపింగు'లో గల క్లేశాలను గమనించి లిపిని మార్చాలని సంకల్పించి నూతన పద్ధతిని రూపొందించి ఒకవ్యాసాన్ని (1928) భారతిలో ప్రచురించినారు. చేసిన కొన్ని సూచనలు, మార్పులు అచ్చులో 'అ'కారము మాత్రమే వాడుకొని తక్కినవి ఉజ్జగించుట. 'అ'కారముపైననే కొన్ని గుర్తులుంచు పద్ధతి యేర్పడినచో 15భిన్నాక్షరములు తగ్గును అట్లే హల్లులలో వర్గప్రథమాక్షరమునకే కొన్ని గుర్తు లుంచుచో 10 అక్షరములు మాత్రమే నేర్పవలసి యుండును. అట్లే ద్విత్వ, సంయుక్తాక్షరములలో మార్పులు సూచించిరి. దీనివలన అక్షరసంఖ్య తగ్గి, వానిస్థానాలను సరిచేసి మార్పులుచేయదగునని, సర్వమూ మార్పుచేయరాదని

హెచ్చరించిరి వారు చూపినమార్పులను చూచి శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు 13-4-28న క్రొత్తలిపిలో శాస్త్రులవారికి ఒక లేఖవ్రాసినారు అది సరిగానే అందినది ఈ వ్యాసాన్ని చూచి తాతా సుబ్బరాయ శాస్త్రులవా రభినందిస్తూ ఒక వ్యాసం ఆంధ్ర పత్రికలో ప్రచురించినారు ఎర్నాకులం నుండి సుప్రసిద్ధ ఫైలాలజిస్టు యల్ వి రామస్వామి అయ్యరు 24.5 28న ఒక లేఖ శాస్త్రిగారి నభినందిస్తూ వ్రాసినారు. ప్రభాకరుల ప్రజ్ఞాపరిధి విస్తృతమైనది మౌలిక ప్రతిభ కిది మరో ఉదాహరణ.

# 14. జానపదసాహిత్య సముద్ధరణ

సామాజికాభ్యుదయానికి తోడుపడే సాహిత్యశాఖలలో జానపదసాహిత్య మొకటి ఇందులోనే ప్రజల చిత్త వృత్తులు, తీరుతెన్నులు, ఆచారసంప్రదాయములు, దేసితనము ఉట్టిపడు తుంటాయి జాతి సంస్కృతి కిపి నిక్షేపములు సాహిత్య సంపద అందరకూ అనుభవింపదగినదిగా ఉండాలని జాతిని మేల్కొల్పిన వైతాళికులలో శాస్త్రిగారు ప్రముఖులు ఈశతాబ్ది తొలి చరణంలో ప్రధానులున్నూ

ఈవాఙ్మయాన్ని బాల-స్త్రీ-పామర పరంగా వింగడించారు తొక్కుపల్కుం పాటలనుండి వచన మాలికా గీతాలు, సంకీర్తనలపర్యంత మిందులోనివే యక్షగానాలు ఈశాఖలోవే కూనలమ్మపదా లెన్మిదింటిని ప్రకటించారు. ఏలపాటలు, పల్లెపదాలు, జానపదవాఙ్మయంపై పలు ప్రసంగాలు చేశారు. కాటమరాజు కధను పరిష్కరించి ప్రచురించారు 'మధుర కవిత'లను పేర సేకరించి పత్రికల్లో ప్రకటించినారు. పాతకాలపు పాటలను గురించి వివరిస్తూ ''[1]ఎన్నాళ్ళదాకా పాటలు, పదాలు మొదలైన మధుర కవితలయెడ రసజ్ఞలోక మాదరము చూపదో, అన్నాళ్ళ దాకా ఆంధ్ర కవితయం 'దంధ్రతావాసన' గుబాళింపదు. నవకము, చవి, చక్కన గలిగి తియ్యతియ్యనై యాంధ్రలోకము నాలుకమీద నాట్యమాడుచున్న మధుర కవితల నెన్నింటినో చవి చూచి సంతోషించి చాలగా సంపాదించితిని'' ఒడుపులు, ఒయ్యారములు గల వాడుకభాషలో[2]బొంగరము త్రిప్పినట్లు పొంకముగా వచన రచన చేయగల దిట్టలు ప్రభాకరులు.

**పదసేకరణ :** లిఖిత వాఙ్మయాన్ని వెల్వరించటంలో ఎంత శ్రద్ధ చూపించారో, అనాదృత వాఙ్మయాన్ని సేకరించి, వ్యాకరించి ప్రకటించటంలోను అంతటి శ్రద్ధ. అంత మాత్రమేకాదు, జనుల నోళ్ళలో నానుతూ లిఖితరూపం పొందని నుడులు, నానుళ్ళు, పలుకు గుత్తులు, లబ్జులు ఎన్నో సేకరించి తమ నోటుపుస్తకాల్లో భద్రపరచినారు. పదసేకరణకై తంటాలు పడ్డవారిలో వీరే ప్రథము

1 1917 జనవరి 18, కృష్ణా పత్రిక 2 వ్యాసమంజరి - పుట 174

లనుకోవచ్చును ఈవాఙ్మయార్చన భాషకు పుష్టిని చేకూర్చేది 1960 తర్వాత కొన్ని పదబంధపారిజాతాలు ప్రకటింపబడ్డాయి అయితే అవి గ్రంధస్థపదాలనే ఎన్నుకొన్నాయి

శాస్త్రిగా రేమన్నారో చూడండి ! ''[2]ఎప్పుడో నేను ప్రాచీన గ్రంధాల్కై దేశాటనం చేస్తూ ఉండేటప్పుడు లిపిరూపము పొందకుండా ప్రజల నాలుకల మీదనే ఉండే పాటలు, పదాలు, నానుళ్ళు వగైరాలను సేకరిస్తూ ఉండేవాణ్ణి.'' అలా సేకరించి వ్యాకరించి, వర్గీకరించిన వానినే 'గాలికబుర్లు' అనే పేరుతో ఆంధ్ర పత్రికలో (1944) ప్రకటించారు వారు సేకరించింది కొండంత ప్రకటించింది ఆవగింజంత అమరంలా ఆపదజాలాన్ని వర్గాలుగా విడగొట్టినారు అకారాది క్రమంకంటె ఇది లెస్స అని వారి మతము

వారే అన్నమాటలివి ''పాటలు, పదాలు, పొడుపు కథలు, పలుకుబళ్ళు, నానుళ్ళు, దేశీయాలు, నొడికారములు, జాతి వార్తలు, చమత్కారములు, పొడుపు పద్యములు, చాటుధారలు, లక్షణోదాహరణములు మొదలయిన వానిని, భాషా సస్యపు పంటలలో, ఇదివరకు సేకరముగాక, గాలికి కొట్టుకు పోతూ ఉండే చెదురుడు, రాలుడు పరిగ గింజలను బిచ్చుగాడనై ఊళ్ళూ నాళ్ళూ తిరుగుతూ ముప్పైయేళ్ళ ముందునుండి ఎక్కడ పట్టితే అక్కడల్లా యేరుకు తెచ్చుకుంటూ ఉన్నాను (1944 జనవరి ఆంధ్రపత్రిక) '' జనుల నాలుకలపై నివాసమున్న పదజాల మంతా దేశస్థితిగతులు, అభిరుచులు మారే కొద్దీ ఉత్సన్నమైపోతుంది ప్రజాసూక్తము లనదగిన సామెతలను, జాతీయాలను సేకరించి భావితరాలకు పదసంపద నందించిన వాఙ్మయ సేవకులు ప్రభాకరులు. పరిపుష్టమైన రచనల కివి అత్యంత సహాయకారులు. ఇంత సేకరించి కూడా తెలుగువారి నిట్లు జాగ్రుత మొనర్చినారు ''దేశము నలుముఖముల గాలించి మంచి మంచి తెలుగు పలుకుబళ్ళను, కథలను, .. వింత శబ్దజాలమును సేకరించవలెను. అచ్చు రాకముందు అన్ని రకముల రచనలను తాటాకులమీదను, నోటివాడుకల మీదను ఉండెడివి ఆంధ్ర భాష అందచందములు సరిగా గుర్తించుటకు వీని 'సర్వే' అత్యావశ్యకము'' అప్పుడే తెలుగునుడికారము మిసమిసలు తెలుగువారు గ్రహింప గల్గుతారు ప్రభాకరుల ముందుచూపు, పరిశీలన ఎంత దొడ్డవో గమనింపవలసి ఉంటుంది. శాస్త్రిగారి అముద్రిత వ్రాతప్రతుల్లో వేలకొలది పలుకుబళ్ళు, ఏగ్రంధాలలోనూ చేరనివి ఇప్పటికీ ఉన్నాయి. గ్రంధస్థమైనవాటికంటె జనవ్యవహారంలోని పదబంధాలు సేకరించుటలో వారికి మక్కువ ఎక్కువ. భాషా సరస్వతి జీవధాతువు అదే అని వారి నిశ్చయము

---

1. తెలుగు మెఱుగులు - పుట 44

# 15. 'యోగ' దశ

మాష్టరు సి వి.వి. అను మహాపురుషులు ఏర్పరచిన కొత్తయోగం అంటే 'భృక్తరహిత తారక రాజ యోగం'లో ప్రభాకరులు ప్రవేశించి (22-6-1916) తుది శ్వాస పర్యంతమూ గండు చీమ పట్టుకొన్నట్లు గట్టిగా పట్టుకొని, అసిధారా వ్రతంగా యోగసాధన చేసిన తపోమయులు. ఈ సంగతి లోకమున కంతగా తెలియదు. శాస్త్రిగారికి గురువులపై మహా విశ్వాసము. వారి జీవనాడుల్లో సీ వి వి. చింతనమే ప్రవహించింది. ప్రార్థనవేళ తప్పిన దినము లేదు. నమ్మినదాన్ని చిత్తశుద్ధితో ఆచరించిన కర్మయోగి. చెప్పినది చేసినారు తా మాచరింపనిది చెప్పలేదు సత్యగవేషణే వారి జీవన మంత్రం. అంత రుద్బోధం ప్రధానంగా - ప్రమాణంగా - యోగాచరణంలో లోతు లరసిన మహర్షి. సర్వనిర్వాహకములు జరుపుచున్నది మాష్టరు ప్రజ్ఞే అనే పరిపూర్ణవిశ్వాసమే వారి ఊపిరి సంవత్సరాలు గడిచేకొద్దీ యోగచింతన ఆయనను ఆక్రమించేసింది. సాహిత్య కార్యకలాపాలు ఉప్పన చప్పనగా తోచినవి

''ప్రపంచమంతా తల్లక్రిందులైనా సరే, ప్రాక్టీసు (యోగసాధన)లో యాక్షన్ (యోగక్రియ) జరుగుతూ దానివల్ల ఇతరులకు ఉపకారం జరుగుతూ నాకు సచ్చిదానందాదులు లభిస్తూ ఉండబట్టి నా ముక్కులో ఊపిరి ఆడుతూ ఉండేదాకా నేను ఈ మార్గాన్ని విడుచువాడను కాను. ఈ విషయం మార్గశిర శుద్ధానికి నేను మద్రాసు వచ్చినపుడు[1] టి.యస్. రామానుజమున్నూ2, యన్.ఆర్.బి.వి. కుమారుడున్నూ వచ్చి ఉండగా స్పష్టం చేసినాను.[2] ఒకవేళ యన్.ఆర్.బి.వి. శరీరం

---

1. టి.ఎస్. రామానుజం యన్.ఆర్.బి.వి. శిష్యులు, అంతర్జాతీయ కార్మిక నాయకులు,
2. ఎన్ ఆర్.బి. వేంకటా చలపతి - మీడియము, కుంభకోణ నివాసి (1883-1947)

విడిచినా నేనీ నిశ్చయానికి కారణం, నాలోని సి.వి వి. యాక్షన్‌గానే ఉంచుకొన్నాను గనుక చలింపను అని స్పష్టంగా చెప్పినాను ఆ నిశ్చయమునే నేను నిలిచి తీరుదును గాక ! ఇట్టి ధైర్యము సి వి.వి నాకు అనుగ్రహించినారు వారి మీది ప్రేమనొక సహాయమునే ఆపత్సముద్రమును గడపగలను గాక'' ఇవి మాటలు కావు ! మహా మంత్రాలు !!

యోగవిషయంలో ప్రభాకరు లెప్పుడూ పురాణ ప్రమాణాల నుట్టంకించేవారు కాదు సరికదా 'నా అంతరుద్బోధ మిది ఇట్లా చేయండి' అనేవారు సాధకులతో. ఆయన సిద్ధప్రసిద్ధులైన మహాభాగులు మాష్టరు సి వి వి. గారి మీడియములలో నే నెరిగినది గురుదేవులు శాస్త్రిగారినే

ఈ యోగం లక్ష్యం వైయక్తిక మోక్షం కాదు 'లోకకళ్యాణమే' యోగ గమ్యమని చెప్పేవారు శరీరంలో ప్రజ్ఞ ప్రవర్తిస్తుండగనే యోగ వికాసం గుర్తింపగల్గటం ఈయోగ విశేషం. మనిషి అవశస్థితిలో సమాధిగతు డగుట కాదు. ఈ యోగసాధకులలో కుండలినీ ప్రచోదనమూ సహస్రారవిజృంభణమూ నాడీమండల మంతటా ఒక శక్తిధార అప్రయత్నంగా ప్రహించటం జరుగుతుంటాయి గురువుల సంస్మరణతో సాధకులలో అపూర్వశక్తి చాలనం జరగటం దీని విశిష్టత. 'ఎటర్నిటీ' (మృత్యుంజయత్వము) యోగచరమగమ్యం త్రిశక్తులను అధిగమించి Fourth Dimension work నడవాలని మాష్టరు సి వి.వి సంకల్పించి నూతన యోగాన్ని ప్రసాదించినారు. ప్రభాకర శాస్త్రిగారి కీ యోగవికాసం వల్ల కొన్ని అద్భుత శక్తులు సంక్రమించినాయి అవి నిస్స్వార్థసేవకే వినియోగింపబడినాయి. పరమేశ్వర ప్రీత్యర్థమను సంకల్పముతో వీరు ప్రతికార్యమును జేసేవారు. వారి యౌగిక శక్తులు ఒకటీ. యోగ చికిత్స ద్వారా మానసిక, శారీరక రుగ్మతలను మాన్పుట. దీనినే వారు 'ట్రీటుమెంటు' అనేవారు. ఈ యోగశక్తి మూలమున తేలుకాటు, ఒడలుకాల్పు, టైఫాయిడు, పరిణామశాల, పైత్యకోశంలోరాళ్ళు, నంజు, జవదరము, క్షయ మున్నగు వ్యాధులు తొలగించేవారు. వారిదగ్గరకు ఓసారి సాహరిగా యోగచికిత్సకై వచ్చేవాళ్ళలో రిక్షాలాగేవారు, కసవూడ్చుకొనేవారు, ఆఫీసర్లు, టీచర్లు, డాక్టరులు, ఇంజనీరులు, లాయర్లు, సనాతనులు, కమ్యూనిష్టులు, కాంగ్రెసువారు ఇలా బహుగోత్రాలవారు వచ్చి రోగవిముక్తులై ఆనందంతో తమతమ యిళ్ళకు వెళ్ళేవారు. అది అటుండగా, కేవలం జాబులద్వారా తమ ఆధివ్యాధులను దూరదూరాలనుండి తెలియ బరచగా, ట్రీటుమెంటు మూలమున నయమైనవారు వందలవంది ! 'నిర్వర్తింతున్ బరిచర్య నార్తులకు యావచ్ఛక్తి నర్పించి' అని వారిదీక్ష శాస్త్రిగారి యోగశిష్యులు, ట్రీటుమెంటులో గురుదేవుల శక్తు లబ్ధినవారు శ్రీకొత్త రామకోటయ్యగారు

(1909 - 1991) ఇట్లా వ్రాశా రొకచోట ''మాగ్రామములో ఉన్న సాధకులలో ఎవరికైనా జబ్బు చేసినపుడు ఆ విషయమును శాస్త్రిగారికి తిరుపతి జాబు వ్రాసే వారము ఆ వ్రాసిన జాబు పోస్టుడబ్బాలో వేసేవారము ఆజాబు శాస్త్రిగారికి చేరుటకు రెండు మూడు రోజులు పడుతుంది కాని ఆ జాబు ఇక్కడ పోస్టు డబ్బాలో ఉండగానే ఆరోగికి జబ్బు తగ్గిపోవుట ఆరంభించేది ఆ సాయంకాలానికే ఆరోగి, రోగముక్తుడై హాయిగా తిరిగేవాడు. అనగా శాస్త్రిగారు మన జాబు చూడకముందే రోగనివారణ జరిగేదని అర్థం. ఇందుకు కారణం శాస్త్రిగారిలో ఉన్న అపారమగు ప్రేమయే అనిన్నీ, ఇతరులకు ఆనందం కలగాలన్న వారి ఆకాంక్షయే ముఖ్య కారణమనిన్నీ తెలుసుకోగలం''

కరుణ, సానుభూతి, అనుతాపము శాస్త్రిగారికి ప్రాణధాతువులు అవే వ్యాధి నిర్మూలనకు దోహదకారులైనాయి. ప్రభాకర శాస్త్రిగారిచే యోగచికిత్స పడసి సుఖులైన వారిలో సర్వశ్రీ కొత్త వేంకటేశ్వరరావు (లాయరు, గుంటూరు), కొత్త రామకోటయ్య (చినకాకాని), జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి (బందరు), శ్రీమతి చాగంటి కల్పవల్లి (విజయవాడ), అడవి బాపిరాజు (లాయరు, భీమవరం), చిత్తూరు నాగయ్య (మదరాసు, సినీయాక్టరు), యస్.టి.పి భాష్యకాచార్యులు (రాయవెల్లూరు), వెన్నెలకంటి మునికృష్ణయ్య (ప్లీడరు, తిరుపతి), కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు (మద్రాసు), విస్సా సుబ్రహ్మణ్యం (బెంగళూరు), డా. గాలి బాలసుందరరావు (మద్రాసు), ఉనికిలి వెంకట్రాజు (గుండుగొలను, ప.గో.జిల్లా), యన్. పద్మనాభ స్వామి (రాజమండ్రి) మున్నగు వారెందరో ఉన్నారు ఒకటి రెండు సంఘటనలు ఉదాహరిస్తాను.

(1) కొత్త వేంకటేశ్వర రావుగారను సంపన్నులు 'లా అప్రెంటిసు' పరీక్షకు మద్రాసు వెళ్ళవలసి యుండెను. వారిది తెనాలి దగ్గర సంగం జాగర్లమూడి అప్పటికే వారు పదినెలలుగా తీవ్రానారోగ్యముతో పీడింపబడు చుండిరి. తొలుత 106 డిగ్రీల మలేరియాతో ఆరంభమయినది అల్లోపతి, హోమియోపతి వైద్య నిపుణులచే చికిత్స చేయించు కొన్నారు ఆయుర్వేదమును వాడినారు. నాటుమందులు సేవించిరి. దేనికిని కుదరలేదు. ఇరువది పౌనుల బరువు తగ్గినారు. రోజూ సాయంకాలము జ్వరము తగులుచునే యుండెను నిద్ర పట్టదు. ఏమి తిన్నను వంటపట్టదు నరముల జిగి దిగనారెను. వ్యాధి ఎవ్వరికిని అంతుపట్టుట లేదు.

ఇట్టి స్థితిలో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి సలహాపై వారికడ పరిచయలేఖ గైకొని, మద్రాసు చేరి శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని సందర్శింప ''ఏం నాయనా ! ఎవరు నీవు'' అని స్నిగ్ధ గంభీర స్వరముతోవారు పలుకరించినారు. వేంకటేశ్వరరావుగారిని భోజన, వసతి సౌకర్యాదులు ముందుగానే అడిగి తెలిసికొన్న

తదుపరి, శాస్త్రిగారి తొలిమాట లివ్వి ''మంచి నేయి, కూరలు, పాలు, పండ్లు విరివిగా తీసుకొనాలి ఈ ఆహారముతో నీజబ్బు కుదురు ననుకోవద్దు కుదుర్చునది సర్వకర్తయగు నీశ్వరుడే ! నీశరీరపుష్టికి ఈతిండి కావలయును''

తొలిపూట ట్రీటుమెంటులో వేంకటేశ్వరరావుగారి శరీరమం దంతట ఒక శక్తిధార ప్రహించిన ట్లయ్యెను చెమట యోడికలు కట్టెను ఆపట్టున నలువది రోజులపాటు శాస్త్రిగారి దివ్యసన్నిధానమున గడిపినారు మంచి ఆకలి, సుఖనిద్ర తొలుత చేకూడెను ఇరువది రోజులలో ఇరువది పౌనులు తూకము పెరిగెను సంపూర్ణారోగ్యముతో వారు స్వగ్రామమునకు మరలిరి ఈవృత్తాంత మంతయు వారే ప్రజ్ఞాప్రభాకర పీఠికలో వివరించినారు

(2) నేను (ఈగ్రంథరచయిత) ప్రభాకరశాస్త్రులవారి వద్ద తిరుపతిలో విద్వాన్ నాలుగో సంవత్సరం (1945-46) చదువుతున్నాను ఆయేడు అక్టోబరులో నేను తీవ్రంగా జ్వరపడ్డాను ఎన్నిరోజులైనా తగ్గటం లేదు. శారీరక, మానసిక స్వస్థతలు సడలినాయి నాపిచ్చి నాకానంద మన్నట్లు ఉండేవాణ్ణి. అప్పటికే నాకు పెళ్ళయింది దేహంపై మనస్సుపై నాకు పట్టు తప్పింది. ఏవేవో వికార చేష్టలు ! ఆస్థితిలో గురుదేవులు ప్రభాకరుల చరణము లాశ్రయించాను రోజూ ప్రార్థనకు రావలసిందిగా ఆదేశించారు ఇంకా జ్వరం వస్తూనేవుంది బరువు తగ్గిపోయాను ఆస్థితిలో రోజు ప్రార్థన సమయాలకు నేను వెడుతున్నాను. అలా ఉండగా ఒకరోజున శాస్త్రిగారు నా ఆరోగ్య పరిస్థితిని పరికించి ''నీకేం కావాలి'' అన్నారు. చాలారోజులుగా నాశరీరం సలసల కాగుతుండటంవల్ల నేనో వింత కోరిక కోరాను. ''నాదేహం హిమానీగృహంలో ఉండాలి అదీ సౌధోపరిభాగమై ఉండాలి అదీ ఏకాంతంగా ఉండాలి ఆ భవనం చుట్టూ 'లాను' లో పుష్పోద్యాన ముండాలి కెరటాలు లేని సాగరంలా నిశ్శబ్దం అక్కడ రాజ్యం చేయాలి. ఎవ్వరూ నన్ను నిద్ర లేపకూడదు '' ఇట్లా కోరికల పరంపర చెప్పుకుంటూ పోయాను ఇదంతా విని వారు ''మన కరణం కవి అవుతున్నాడే'' అని పరిహాసం చేశారు. ఇంతలో సాయంకాలం ప్రార్థనసమయం ఆరుగంటలయింది. గురుదేవులు కన్నులు మూసికొన్నారు ప్రార్థన సమయంలో అందరూ అప్రయత్నంగా మౌనంలోయకి జారిపోయారు మహాద్భుతం ! ఏవాతావరణాన్ని నేను కోరుకొన్నానో అది నాకు అనుగ్రహింపబడింది. నామేను మంచు మందిరంలోనే ఉంది. అదీ రెండు, మూడు గంటల అనుభూతి ! నా ఆనందానికి అవధు ల్లేవు ఎంత హాయి !! దేహంలోని ఉష్ణతీవ్రత పూర్తిగా మటుమాయమైంది. నేను ఆసుఖ నిద్రనుండి లేచే సరికి, జ్వరం పూర్తిగా తగ్గి మామూలు స్థితికి వచ్చాను శాస్త్రిగారు ప్రేయ రయిన తర్వాత ప్రతివారిని ''ఏంజరిగింది ప్రార్థనలో ?'' లేదా 'మీ కేమనిపించింది ?'' అని

అడగటం రివాజు. అందరినీ అడిగినట్లే నన్నూ అడిగారు నా అనుభూతిని సవినయంగా వివరించాను. ఆ అనుభూతినే, నాలుగైదేళ్ళ తర్వాత 'ఆనందవల్లి' కావ్యంలో అక్షరబద్ధం చేశాను.

ఆకయినన్ జలింపదు లతావనిలో, నవయామినిన్ రసో
త్సేకమునన్ గదల్పదు ఖుషీగను కోయిలబాల కంఠమున్
నీ కనుసన్ననే మెలగి నీడజముల్ రవమున్ ఘటింప, వే
**నా కలి గొన్నవాడనయి యచ్చట నిద్ర కుపక్రమించితిన్**
నిద్దురయంచు బల్కను ఘనీభవమౌ ఇహసౌఖ్యరాశియే
ముద్దయినట్లు తోచె, నవమోహన మంగళ శాంతి నిక్వణ
మ్మద్దరి విన్పడెన్, ఒక మహోలలితమ్మవు పుష్పశయ్యలో
నిద్దురవోవ నాజ్ఞయిడె, నే శయనించితి నందు పొందుగన్

నేను నిద్రనుండి లేచిన పిమ్మట మళ్ళా 'నీకేంకావాలి' అన్నారు. రోజుకు 18 గంటల చొప్పున నిద్ర కావాలన్నాను. 'ఏమిటీ వింత ! కుంభకర్ణుడిలా' అన్నారు మళ్ళీ. కాని వా రనుగ్రహించినట్లు నేను భావింపలేదు. కాని మహా విచిత్రం ! అంతే ! ఆ మరునాటి నుండి ఇరవైయొక్క దినాలపాటు ఒకటే నిద్ర !! నా శరీరానికి ఎంత విశ్రాంతి ! ఎంత బలము ! ఎంత ఉత్సాహము ప్రసాదించినదో చెప్పలేను. ఆరోజుల్లో నన్ను పట్టిపీడించిన వ్యాధులన్నీ మటుమాయ మయ్యాయి. అనంతరం రెండుమూడు దినాలకు పూర్ణారోగ్యవంతు ణ్ణయ్యాను. అనుగ్రహించిన ట్లగపడకుండా అనుగ్రహించటం ప్రభాకర యోగిపుంగవులలో ఒక విశేషం.

(3) **సంపంగి పరిమళం :** ఒక తూరి ప్రముఖ సంస్కృత విద్వాంసులు అప్పల్ల సోమేశ్వర శర్మగారూ, హిందీప్రధానాచార్యులు అయాచితుల హనుమచ్ఛాస్త్రిగారూ, మరికొందరూ శాస్త్రిగారింట గోష్ఠి జరుపుతున్నారు ప్రస్తావనలో శాస్త్రిగారు మాస్టరు సి.వి.వి. గారి మహనీయతగురించి, 'యోగవికాసాన్ని గురించి ఉత్సాహంతో ముచ్చటిస్తున్నారు. వారి దివ్య శక్తులను శ్లాఘిస్తున్నారు. అది వింటున్న పండితులు శాస్త్రిగారితో ''తమరు సాధనచేస్తున్న యోగం మహనీయమైనదే ! అయినా ఆయోగమహత్త్వం ఎరుకపడే టట్లుగా ఒక నిదర్శనం దయచేయండి'' అన్నారు. ఇది 1948-49 నాటి మాట. ప్రభాకరు లామాటలు విని, వారితో ''అలా అయితే మీ కేపువ్వు పరిమళం ఇష్టమో చెప్పండి'' అన్నారు. ''సంపంగి మాకిష్ట''మన్నారు వారు. అవి నిజానికి తిరుపతి ప్రాంతాల్లో లభించేవి కావు కూడా. వెంటనే ప్రభాకరులు క్షణకాలంపాటు నిమీలిత నేత్రులయి తమ పరమగురువులు మాస్టరు సి.వి.వి.ని స్మరించుకొన్నారు. అంతే ! పండితు

లంతా కూర్చున్న గది అంతటినీ సంపంగి పరిమళం ముంచెత్తింది ఈ దివ్య సుగంధం ఎక్కడినుండి వచ్చినట్లు ? ఆపువ్వు పూచే ఋతువుకూడా కాదే ![1] ఇట్లాంటి సంఘటనలు కోకొల్లలు. శాస్త్రిగారి శిష్యులూ, భక్తులూ ఇప్పటికీ చెప్పుకుంటూ ఉంటారు

ఈ సందర్భంగా ప్రభాకరుల ప్రవచనములు తెలుసుకోవటం అవసరం వారు ఏ జీవితాదర్శాలకు నిలిచింది, ఆచరించింది, ఉన్నతలక్ష్యవీక్ష యెట్టిది అవగతమవుతాయి

(1) సానుభూతికి మించిన దివ్యౌషధం ఇంకేదీ లేదు మనలో వెల్లివిరిసే ప్రేమ అన్నింటినీ చక్కదిద్దగల దివ్యౌషధము

(2) ఎందరకు యోగచికిత్సచేసినా యేమీ చీకా కుండదు. ఎంత యిచ్చినా తరగని తనమే ఈశ్వరత అదే మనలో నెలకొనాలి

(3) నా చుట్టూ ఆనందాన్ని, అమృతాన్ని పంచిపెట్టాలనే సంకల్పం కలవాణ్ణి నేను. అందరినీ ఆపదలనుండి రక్షించడం, అందరిలో ఆనందాన్ని నెలకొల్పడం అనే రెండు భావాలే నాకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలు అవి రెండూ ఆడుటలోనే నా ఊపిరి

(4) మృత్యువును ధిక్కరించే శక్తిసామర్థ్యాలు కలగాలనీ, అమరత్వ సిద్ధి కలగాలనీ, ఆ అమరత్వ సిద్ధి ఇచ్చటనే ఈ శరీరంతోనే పొందాలనీ కోరుకొందాం

ప్రభాకరులు మానవతా దృష్టిలో ఎంత ఎత్తుల కెదిగిందీ తెలిపే పలుకులు

**గురుదేవులు ప్రభాకరశాస్త్రిగారికి నా అక్షరార్చన :**

ధ్యానమె యోగమై పరమ
తత్త్వము నించెడు బ్రహ్మతేజమై
మౌనమె మేలి వ్యాఖ్యయయి - మంజుల
వాక్యైక కాంతి గోళమై-
ప్రాణము నార్తసేవకయి పంచిన
సత్ కరుణా పయోనిధిన్
ప్రాణము ప్రాణమైన గురుపాదుల
నే శరణంబు చొచ్చితిన్

సత్యదయోపకార సార్థకమగు ఆత్మచింతన పథము తప్పి చరింపని యోగి. సచ్చిదర్థ సాకల్యము కొరకే జన్మించిన పుణ్య శ్లోకులు.

1 శ్రీ అప్పల సోమేశ్వరశర్మగారు విశాఖపట్నంలో నాతో స్వయముగా చెప్పినది (1979)

# 16. సభలూ - సన్మానాలూ

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నూనూగు మీసాల ప్రాయంలో శతావధానాలు, అష్టావధానాలు చేసి మన్ననలు పొందారు లభించిన ఆధారాలనుబట్టి 1922లో రాజరాజనరేంద్ర పట్టాభిషేక వర్ధంతి సభలో (రాజమండ్రి) నన్నయకు పూర్వపు ఛందస్సుపై ఆలోచనాత్మకమైన ప్రసంగం చేసినారు. ఈసభ రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము 900 ఏళ్ళు పూర్తి అయిన సందర్భంలో జరిగింది ఆసభలో శాస్త్రిగారు రాజరాజనరేంద్రునిట్లు ప్రశంసించారు

మదమాతంగ తురంగ ముఖ్యపద సంపన్నుండు నన్నయ్య తొ
మ్మిది నూరేండ్లకు ముందుఁజూపె కవితోన్మేషంబు, సర్వాంధ్రసం
పద పెంపొంద, చళుక్యవల్లభుఁడు సామ్రాజ్యాభిషిక్తుండుగా
నది నాబోటికి నేటి కబ్బునటె వ్యాఖ్యానింప నాఖ్యానముల్

ఆసంవత్సరం డిసెంబరులోనే 'ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు' మూడవ సమావేశంలో విద్వత్ పరిషత్తుచే సన్మానింపబడినారు. 1924-25లో ముక్త్యాలలో జరిగిన బ్రహ్మానందోత్సవాలలో కవిత్వపు పోటీ జరిగితే పాల్గొని మూడుపూటలలో 'కపోతకథ' 93 గద్యపద్యాలలో అల్లినారు బళ్ళారిలో ఆంధ్రసాహిత్య పరిషత్ సభలలో పాల్గొని 'ఆంధ్రభాషావతారము' అనే వ్యాసం సమర్పించారు.

1934కు ముందే నరసరావుపేటలో నెలకొన్న 'ఆంధ్రసారస్వత మహాసభ' ప్రభాకరులను 'విమర్శకాగ్రేసర' బిరుదంతో సత్కరించింది కవిచూడామణి బిరుదంలాగే దీనినీ వారు పెట్టుకొన్న దాఖలాలు లేవు. అది వారి నైజం

1939లో రాజమహేంద్రవరంలో రెడ్డిరాజ్య వర్ధంతి సభ జరిగింది. ఆనాటి సభకు శాస్త్రిగా రధ్యక్షులు. ప్రసిద్ధన్యాయవాది వడ్లాది అప్పారావుగారు సభాసారధ్యం

వహించారు 'రెడ్డిరాజుల సాహిత్యసేవ'పై సాధికారికమైన ప్రసంగం చేసి మన్ననలు చూఱగొన్నారు డా కట్టమంచి రామలింగారెడ్డివంటి ఉద్దండు లెందరో పాల్గొన్న సభ పిమ్మట 1940 ఏప్రిల్‌లో కావలి (నెల్లూరు జిల్లా)లో శ్రీనాథ జయంతి సభకు అధ్యక్ష్యము ఆసభలోనే దొడ్ల వెంకటరామరెడ్డిగారు ప్రభాకర శాస్త్రిగారిని శ్రీనాథుని 'కాశీఖండము'ను పరిష్కరింప గోరినారు పరిష్కరించారు కూడా

రాజమహేంద్రవరంలో కవిరాజహంసలు వేంకటపార్వతీశ్వర కవిద్వయానికి షష్టిపూర్తిమహోత్సవం (26-12-1943) వైభవంగా జరిగింది నాటి సభాధ్యక్షులు యస్.వి. రామమూర్తి **I.C.S.** (మద్రాసురాష్ట్ర ప్రభుత్వ సలహాదారు)గారు ప్రధానవక్తగా శాస్త్రిగా రాహ్వానింపబడినారు అనివార్యకారణాలవల్ల సభకు వెళ్ళలేదు కాని 'కవితా పారమ్యము' అనే వ్యాసాన్ని పంపగా తల్లావజల శివశంకరశాస్త్రిగారు సభలో చదివి వినిపించారు 'ఏకాంతసేవ' కావ్యం తాత్త్విక కవితా శిఖరంగా ఎట్లు పరిణమించిందో వివరించటమే కాక, కవితా చరమలక్ష్యము తాత్త్వికవిస్ఫురణమే అని నిరూపించా రాప్రసంగంలో

1945 ఫిబ్రవరిలో తిరుపతిలో జరిగిన జిల్లా విద్యార్థి కాంగ్రెసు ద్వితీయ వార్షికోత్సవంలో అభిభాషించారు.

1946 జనవరి 5వ తేదీన కృష్ణాజిల్లా ముక్త్యాలలో నవ్యసాహిత్య పరిషత్ 11వ వార్షికోత్సవాలు జరిగాయి ప్రారంభోపన్యాసము శాస్త్రిగారిదే. ముక్త్యాల కుమార రాజా శ్రీ వాసిరెడ్డి శ్రీరామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదబహద్దరువారు సభలు నిర్వహించారు. ఆయన కవితా ప్రియ భావుకుడు, సాహితీ రసజ్ఞుడు జగ్గయ్యపేట నుండి ముక్త్యాల వరకూ ఇన్నిమైళ్ళూ స్వాగత తోరణాలే. అంత వైభవోపేతంగా తెలుగునాట మళ్ళీ సాహిత్య సభలు జరగలేదనే చెప్పాలి. ప్రభాకర శాస్త్రిగా రాసభలో ప్రసంగిస్తూ, నేటి నవ్య సాహిత్యవిశారదుల నవనవోన్మేషములన్నీ నాకు పరమానంద ప్రదములే మన పరిపూర్ణత రేపటిరోజుల్లో ఉన్నది కాని నిన్నటి రోజుల్లో లేదు సాహిత్యం ఏకొద్దిమందికో కాదు- అన్నివర్గాల వారికీ అనుభవింప దగినదిగా ఉండాలి' అన్నారు. తొలినాళ్ళలో జాతిని మేల్కొల్పిన వైతాళికులలో శాస్త్రిగారు ముఖ్యులు.

శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వము ఆస్థానకవిగా 1949లో నియమించింది. ఆస్థానకవి పట్టప్రదానోత్ససభలో (అక్టోబరు'49) విజయవాడ లీలామహల్‌లో జరిగింది. దేశమంతటినుండి కవి, పండితు లెందరో పాల్గొన్నారు. మదరాసు, మైసూరు, నైజాం ముఖ్యమంత్రు లాసభకు హాజరయినారు. ముగ్గురూ తెల్గువారే మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి

శ్రీపూసపాటి కుమారస్వామి రాజా తెలుగు ప్రసంగాన్ని అరవ లిపిలో వ్రాసికొని వచ్చి చదివారు చెళ్ళపిళ్ళవారి శిష్యులు విశ్వనాథ, పింగళి, కాటూరి, వేలూరి, వేటూరి మున్నగువారు గురువుగారికి బ్రహ్మరథం పట్టారు. అదొక కన్నుల వేడుక నాటి సాయంకాలం సభకు ప్రభాకరశాస్త్రులవా రధ్యక్షులు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు సభా ప్రారంభకులు. ఆనాటి కార్యక్రమాలన్నీ కపిలేశ్వరపురం జమీందారులు శ్రీ యస్.బి.పి బి.కె సత్యనారాయణరావుగారు ఫిల్మ్ (చిత్రం) తీయించటం వారి కళాభిజ్ఞతకు నిదర్శనం

1948లో శాస్త్రిగారికి షష్టిపూర్తి సన్మానం చేయాలని సంకల్పించి, ఒక సన్మానసంఘం తిరుపతిలో ఏర్పాటయింది శాస్త్రిగారు దానికి ససేమిరా అంగీకరించలేదు తుదకు పట్టు పట్టగా, తమ కత్యంతాప్తమిత్రులు, న్యాయవాదులు పరమాత్ముని రాధాపతిగా రిచ్చిన ఖద్దరులాల్చీని మాత్రము స్వీరకించినారు. ఆడంబరాల యెడ తొలినుండీ వారు విముఖులు.

1949 అక్టోబరు నెలలో రాజమహేంద్రవరంలో కలాభివర్ధినీ పరిషత్ శ్రీనాధజయంతి జరిపి ప్రభాకరులను సన్మానించింది సన్మానం చేసినవారు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు. సభానిర్వాహకులు కథకచక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. శ్రీనాథ కవిత్వంపై మహోపన్యాసం చేస్తూ ఆంధ్ర కవితా వాహిని పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించిన ధోరణులు, శ్రీనాథుని కవితా నిర్మాణ మర్మాలు, లోతులు ప్రభాకరశాస్త్రిగా రాసభలో ముచ్చటించారు. ఆ సభలో నేనూ ఒక శ్రోతను.

తిరుపతిలో తొలిసారి అన్నమాచార్యోత్సవాలు 2-4-1949న జరిగాయి. దానికి రూపకల్పన చేసినవారు, ప్రేరకులు ప్రభాకరులే. మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీపాకాల వెంకటరాజమన్నార్ అధ్యక్ష ప్రసంగం చేసినారు. అన్నమయ్యపై ప్రామాణికమైన పరిశోధన గావించిన శాస్త్రిగారు, ఉదాత్తమైన మధుర ప్రసంగంతో శ్రోతలు ముగ్ధులయ్యేటట్లు చేసినారు. శ్రీమతి ఎం ఎస్. సుబ్బులక్ష్మి, టంగుటూరి సూర్య కుమారి మరెందరో ప్రసిద్ధులు సంగీత కచేరీలు చేశారు. ఈనాటికిని తిరుమలతిరుపతిదేవస్థానంవారు సంప్రదాయ పద్ధతిలో సభలు నిర్వహించటం ఆనందింప దగిన విశేషము.

1950లో తి.తి. దేవస్థానమువారు తిరుమలపై నిర్వహించిన వేసవి పాఠశాలలో వైష్ణవాంధ్ర సాహిత్యంపై మూడురోజులపాటు సరసమధుర ప్రసంగాలు చేసినారు. ఇది స్థాలీపులాకంగా కొన్ని సభల గూర్చిన వివరణ మాత్రమే.

## 17. మరికొన్ని విశేషాలు

**నీతినిధి (1926) :** 'ది ఎకానమీ ఆఫ్ హ్యూమన్ లైఫ్' అనే ఆంగ్లకృతికి ఇది వచనానువాదము. మూలకర్త యెవ్వరో తెలియదు. మానవల్లి రామకృష్ణకవిగారి ప్రేరణపై అనువదించినారు. ఒక మిత్రునిచే తెలుగు టీక వ్రాయించుకొని, తమ్ముడు డా చంద్రశేఖర శాస్త్రిగారి తోడ్పాటుతో కొంత తీర్చిదిద్ది తెనుగు చేసినారు. అప్పట్లో ఆంగ్ల మూలం ప్రతులు దేశంలో రెండే రెండు. అంత అరుదైన గ్రంథము. శీలసంపత్తిని దోహద పరచే రచన. ఇందు 136 అధ్యాయా లున్నాయి శాస్త్రిగారి అనువాదముమూల విధేయతాసౌందర్యముల సమ్మేళనము. వాక్యముల సంక్షిప్తత, భావానుగుణమైన శైలి వీరి గద్యకు జీవధాతువులు. ''మూలాను గుణముగనే యీ తెలుగుచేత యుండును. నా కాంగ్లభాష రామి గ్రంథము నర్థము చేసికొనుటలోఁ గొంత యనర్థకమేయయనను, వాక్య రచన చేయుటలో తెలుఁగుదనమును వెలయించుటకుఁ గొంత సార్థకమే యయ్యెనను కొనుచున్నాఁడను !! అక్షిప్తతకు నుడికారపు సొంపు పెంపునకు వీరి వచనము పేరు పడ్డది. శైలి కుదాహరణ ''చెక్కిళ్ళపై గులాబి పూవన్నె చెలగగా, పెదవులయందు నుదయరాగ ముప్పతిల్లగా గన్నులం దణకువ యానందము వెలయగా నాడుచు, పాడుచు నరుగుచున్నది ! ఆమె యారోగ్యాధి దేవత. మితభోగమునకుఁ బరిశ్రాంతికి నామె జనించినది'' - (పుట 19). కేవలదేశభాషాపండితు లింతటి ప్రశస్తానువాదము వెలయించుట ఎవర్కైనా ఆశ్చర్యము గొల్పేదే.

**సాహిత్యేతర వ్యాసములు :** 'వృక్షాయుర్వేదము' లోని విశేషాలు తెలుపుతూ (1922) వ్యాసము వ్రాయగా, డా. ఆచంట లక్ష్మీపతిగారు దానిని ప్రచురించి వెలుగునకు తెచ్చిరి. పాటలీపుష్ప విశేషాలే కాక వైద్యగుణాలను వివరిస్తూ (1928) వ్యాసము ప్రచురించారు. ఏనాదులు (1917), చల్లపల్లి జమీకథలు (1912), బందరు తుపానుపై (1925) ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ వ్యాస మొకటి. అవి కాక వస్త్రపరిశ్రమ, అభినయకళ, నాటకకళ, ఆంధ్రకల్పవృక్షము, భుక్తిపత్రి మున్నగునవి వెలువరించారు.

ఇనికాక ఆనందగజపతి, జయంతి కామేశం పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రు[illegible] తాము విన్నవి, చూచినవి, కాలగర్భంలో కలిసిపోకుండా గ్రంథస్థం చేసినారు సమకాలీన సమస్యలకు స్పందించి వ్రాసినవి మరికొన్ని

'ఈశ్వరకరుణామృతము' యోగానుభూతికి సంబంధించినది సరస్వతి (ముక్త్యాల) మాసపత్రికకు రెండేండ్లు పరోక్ష సంపాదకత అట్లే మదరాసునుంచి వెలువడ్డ 'ఆనందవాహిని'కి పరోక్షసంపాదకులు గౌతముడను కలంపేరుతో కొన్ని రచన లిందు వెల్వరించారు. సుప్రసిద్ధ తెలుగు సాహిత్య పత్రిక 'భారతి' మాసపత్రిక స్థాపించుటకు కాశీనాథుని నాగేశ్వరరావు గారికి ప్రేరణమే కాక దానిరూప కల్పనలోను ముఖ్యులు.

**పీఠికలు :** సమకాలీన కవి, పండితుల గ్రంథాల కిరువది యైదింటికి అభిప్రాయములు, ముందుమాట, పీఠికలు, సమీక్షలు రచించినారు గిడుగు వేంకట సీతాపతిగారు వ్యావహారిక భాషలో రచించిన 'భారతీ' శతకానికి (1939) పీఠికలో ''రేపు స్వరాజ్యము వచ్చి, ఆంధ్రరాష్ట్రము వేరుపడి, కౌన్సిళ్ళలో ఆంధ్రభాషావ్యవహారము సాగి, తెలుగుషెర్లుహోండు ప్రబలమై, దైవానుగ్రహము దైవారితే పెద్దలు సభలలో వ్యవహరించిన భాషావ్యవహారము స్వస్వరూపముతో ప్రకటితము కావలెనే కాని, అది నన్నయభట్టీయాథర్వణీయాది వ్యాకరణ పారాయణ పరాయణులచే పరిసంస్కృతమై ప్రకటితము కారాదు' అన్నారు. భాషాపరిణామాన్ని అభ్యూహించి వ్రాసిన వాక్యాలు !

'మొయిలు రాయబారము' కాళిదాసు మేఘసందేశకావ్యానికి గేయానువాదము, కర్త త్రిపురాన వేంకటసూర్య ప్రసాదరాయ బహద్దరు. శ్రీకాకుళ ప్రాంతకవి. ''పరివర్తనము రససిద్ధుని రచన మవటం, ఛందము దేశికావటం ఈకృతికి పొలుపును చేకూర్చినవి'' అని ఆచి తూచి ప్రభాకరుల తీర్పు. కాళిదాసుని గూర్చి గంపెడు విషయా లీపీఠికలో పొందుపరచినారు. మాత్రాగణాల్లో రచనసేతను అగ్గించినారు. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్రరచయితలు తొలిముద్రణ (1944) పీఠికలో ఈ రచయిత కవులను గూర్చి వ్రాసిన పలుకుబళ్ళు భాషలో పాదు కొనదగి వున్న' వంటూ ఇందు చేరదగిన రచయితలు పదునాల్గురిని పేర్కొనటం గుర్తింపదగింది దుర్భాక రాజశేఖర శతావధానిగారి 'రాణాప్రతాప చరిత్ర'పై సుదీర్ఘ సమీక్ష, ఇటీవల వేటూరి పీఠికలు 2వ భాగంలో (1990) అచ్చుపడింది.

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి కృష్ణభారతం ఆది, సభాపర్వాల సంపుటిపై (1916) 'తెలిగింపు సంస్కృత గ్రంథమును జీర్ణించుకొని క్రొత్త వెలయించినట్లు తొట్రులేక నినుపారియున్నది. శైలియందు జీవధార గలదు.

'గద్య స్ఫీతియు నుచితస్థలములందే పరిమితమ్మై యున్నది' ఇవి పొగడ్త పాలము త్రొక్కని నాక్యాలు గడియారంవారి 'శివభారతం'పై అభిప్రాయమిస్తూ 'దివ్యశయ్యా, సౌశబ్ద్యమూ రసపుష్టి నిండార్లుగా ప్రవహించిన మీ కవితా వాహినిలో నేనింతకు ముం దెన్నడు అవగాహించి యెఱుగనివాడ నగుట నన్ను నాలుక కొఱికికించినది' అని లోతులు తరచిన పలుకులు కొండూరు వీరరాఘవాచార్యులుగారి 'శిల్పదర్శనము'నకు అభిప్రాయ మిస్తూ 'ఇట్టిగ్రంథమును ఇంతవఱ కెవ్వరును తెల్గున రచించి యుండలే దనుకొందును దివ్యశిల్పములు, వాని శిల్పులు సర్వదా పూజ్యులు నేను శిల్పశాస్త్రరహస్యముల నెఱుగని వాడను మీగ్రంథము తద్రహస్యముల నెన్నింటినో నా కెరిగించినది' అని ప్రభాకరుల వినయోక్తి కొందరి కృతులకు పద్యాల్లోనే వ్రాసినా రభిప్రాయం మల్లంపల్లి వీరేశ్వరశర్మ (బందరు) గారి కాంచీఖండనుపై అభిప్రాయము వ్రాసి 'మల్లికార్జున సుకవి కుమార వరున। కుల్లసిత కావ్యకళలు రంజిల్లు టరుదె ?। గురులు తిరుపతి వేంకటేశ్వరుల కరుణ। మెలగు వారికిఁ దియఁబల్కు పొలుపు లరుదె' అని ముగించారు బులుసు వేంకటేశ్వర్లు (కాకినాడ) రచించిన 'మహర్షి జీవిత కథామృతము'పై ''పెక్కింటిని పరిశీలించి శ్రమపడి యీ గ్రంథము రచించిరి. ప్రాచీనార్య మహర్షి మహత్త్వము జగదాశ్చర్యకరము' అని తెలుపుటయే కాదు, శాస్త్రిగారు సారవత్తమమైన పద్యాన్ని వ్రాసి, యోగసాధన పూతమైన వారి దృక్పథాన్ని వెల్లడించినారు

కందశలాటు శాక పరికల్పిత భుక్తి నరణ్యసీమ నా
నందమయాత్మకోశ యజనవ్రత మూని సమస్తలోక మా
త్మం దలపోసి తా రభయ దానము కోసమె లోని తెల్వి ది
వ్యేం దిలకించు మద్భురతపర్ష మహర్షుల నాశ్రయించెదన్ (1946)

ఇవికాక తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి 'ధర్మదీక్ష'కు ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారి 'శ్రీమదాంధ్రవ్యాసభారతనవనీతము', బులుసు వేంకట రమణయ్య (మద్రాసు)గారి 'కువలయానందసారము', కనమలూరి వేంకట సుబ్బయ్యగారి 'వేంకటేశశతకము' మున్నగు రచన లెన్నింటిపైనో నిగ్గులు తేల్చుచు వ్రాసిన ముందుమాటలు కలవు.

వేటూరివారు, రచనలోని అంతస్సారాన్ని పురస్కరించుకొని తమకు నచ్చిన, తాము మెచ్చిన, తమహృదయాన్ని కదలించిన రచనలకు మాత్రమే అభిప్రాయము లొసంగుచురు. సత్యనిష్ఠతో గుణదోష నిర్ణయం చేయటం వారి ప్రవృత్తి. వారి అంతఃకరణకు తోచిన విషయాలు మొగమోటమి పొంతకు పోకుండ, పొగడ్త పాలము త్రొక్కక తెల్పుట వారి నైజము

# 18. తిరుపతిలో శాస్త్రిగారు (1940-50)

మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో పండిత పదవి నుండి 1939 డిసెంబరులో శాస్త్రిగారు స్వచ్ఛందంగా విరమించిన తదుపరి, తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆహ్వానంపై తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ రిసెర్చి ఇన్స్టిట్యూటులోని పరిశోధన విభాగంలో చేరినారు. అట్లుండగా 1940 ద్వితీయార్ధంలో అక్కడే ఉన్న శ్రీవేంకటేశ్వర సంస్కృత కళాశాలలో తెలుగు విద్వాన్ తరగతు లారంభమైనాయి. ప్రభాకరశాస్త్రిగారిని ఆంధ్ర శాఖలో ప్రధానాచార్యులుగా తి.తి.దేవస్థానము నియమించింది. అయినా శాస్త్రిగారు పరిష్కరణ, పరిశోధనలు సాగిస్తూ, ఆసంస్థ జర్నలుకు వ్యాసాలు వ్రాస్తూనే ఉండేవారు. అప్పటికే ప్రభాకరశాస్త్రిగారు మదరాసు, అణ్ణామలై విశ్వవిద్యాలయాల 'స్టడీస్ బోర్డు'లలో సభ్యులుగా, పరీక్షాధికారులుగా ఉంటున్నారు. అట్లే ఆంధ్రవిశ్వవిద్యాలయంలోనూ ఉండేవారు. మదరాసు ఓరియంటల్ లైబ్రరీ, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీల ప్రచురణ విభాగ సలహామండలి సభ్యులుగా చాలా కాలంపాటు ఉన్నారు. తిరుపతి యస్.వి.ఒ. రిసెర్చి ఇన్స్టిట్యూటులో పూర్తికాలం పరిశోధనకై 'రీడరు'గా 21.3.1945లో నియమితులై, దివంగతులయ్యే పర్యంతము (1950 ఆగస్టు) పనిచేస్తూ వచ్చారు.

**ఆచార్యోత్తముడు :** ప్రభాకరశాస్త్రులవారు కళాశాలకు వెళ్ళే దృశ్యం చూడ ముచ్చటగా ఉండేది. ఒక్కొక్క రొకపరిచర్య చేస్తూ శిష్యులు వారిని వెంబడించేవారు. ఒక శిష్యుడు వేడిమంచినీళ్ళచెంబు తన సైకిలుకు తగుల్చుకొనేవాడు. మరొకరు సాహిత్య కార్యక్రమాల తాలూకు కాగితాల కట్టలు, ఇంకొకరు తాళపత్రగ్రంథాలు, వేరొకరు అచ్చు పుస్తకాలు, ఇంకొ కాయన గురువుగారికి కావలసిన పెన్నులు, పెన్సిళ్ళు తీసికొని వెళ్ళేవారు. వారు కళాశాలకు వెడుతూండే టప్పుడు, ఏదో ఒక యోగవిషయాన్ని గురించో, ప్రాచీన కవుల చమత్కారాల గురించో వివరించి చెబుతూ నడక సాగించేవారు. శాస్త్రిగారికోసం ఎవరేనా విద్వాంసులు వస్తే, వారూ

వెంబడించేవారు త్రోవలో ఇతరశాఖల విద్వాంసులు కలిసేవారు వారుకూడా శాస్త్రిగా రంటే ఎంతో గౌరవం చూపేవారు అప్పు డప్పుడు తి తి దేవస్థానం కమీషనరు శ్రీచెలికాని అన్నారావుగారు కళాశాలకు వస్తే, శాస్త్రిగారిని ముందుగా దర్శించి, వారి ఆశీస్సు లందుకొన్న తర్వాతనే పరిపాలన కార్యకలాపాలు చూసుకొనేవారు ప్రభాకరశాస్త్రిగారు మ్యూజియం విషయంగాని, సాహిత్యోత్సవాల సంబంధంగా గాని ఏది చెప్పినా, అడిగిందే తడవుగా ఆధికారికంగా అన్నారావుగా, రంగీకరించేవారు శాస్త్రిగారి మాటకు అంతటి విలువ

ఎడనెడ కళాశాలకు ఏ పింగళి లక్ష్మీకాంతం గారో, రాళపల్లి అనంతకృష్ణశర్మ గారో, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారో మరో పెద్ద విద్వాంసులో వస్తే, వారంతా శాస్త్రిగారియెడ ఎనలేని గౌరవం చూపేవారు. అటువంటి పండితులు కళాశాలకు వస్తే మావిద్వాన్ విద్యార్థులకు ఆనాడు 'శిష్టానధ్యయనం'

శాస్త్రిగారి బోధన విశిష్టంగా ఉండేది పూర్వపు పద్ధతిలో పద్యంగాని గద్యంగాని చదివి వాటి అన్వయం, టీకాతాత్పర్యాలు చెప్పటం కాదు తరగతిలో ఒక విద్యార్థిని పాఠ్యభాగం - అది ఉత్తర హరివంశమో, నన్నెచోడ కుమారసంభవమో, సంస్కృత కాదంబరో,కావ్యాలంకార చూడామణో, పారిజాతాపహరణమో - నాలుగైదు పద్యాలు వరుసగా చదువ మనేవారు. సామూహికంగా వాటి అర్థాలు చెపుతూ, అందులో పాఠభేదాలు, శబ్దసాధుత్వాసాధుత్వాలు, రసాలంకారాదులు వివరిస్తూ పోయేవారు పాఠనిర్ణయంలో శబ్దార్థ వివరణంలో వారిది సునిసిత ప్రజ్ఞ కవిప్రయోగాల సందర్భం వస్తే, ఎన్నో పూర్వకవుల ప్రయోగాలు అప్పటికప్పుడు ఉదాహరించేవారు అవి చెప్పటంలో వారికి మక్కువ ఎక్కువ పరీక్షకు విద్యార్థులను సిద్ధం చేయటం కంటె, తాను తరిఫీ దిచ్చిన విద్యార్థులు మంచి పండితులుగా శీలవంతులుగా ఉండాలని, అందు కెంతో శ్రద్ధతీసికొనేవారు అవసరమైతే మందలింపూ ఉండేది. విద్వాన్ చదువుల్లో 'ఫైలాలజీ' అని క్రొత్త పాఠ్యాంశాన్ని అప్పుడే ప్రవేశపెట్టారు. ప్రాచ్యకళాశాలల కది క్రొత్త దాన్ని శాస్త్రిగారే చెప్పేవారు శబ్దమూలాన్ని, పరిణామాన్ని వివరించటంలో ఆయన కుశాగ్రబుద్ధి తమిళ, కన్నడాల్లో వారి పాండిత్యం అందుకు మరింత దోహదపడేది ఎవరేనా ప్రాచీన గ్రంథ పరిష్కరణ నిమిత్తం వచ్చి వారి సహాయాన్నర్థిస్తే, వెంటనే శిష్యులను ఎన్నిక చేసి పంపేవారు. అప్పట్లో మద్రాసు ఓరియంటల్ మ్యానుస్క్రిప్టు లైబ్రరీ కూడా తిరుపతిలోనే ఉండేది. శిష్యులకు తాళపత్ర పరిశీలనలో శిక్షణ మాత్రమే కాక, శబ్ద భాండారం తెలియటమేకాక సాధుపాఠ నిర్ణయం మున్నగు అంశాలు పరిశుణ్ణ మయ్యేవి.

మనో మందిర కవాటాలను తెరిపించేదే సిసలైన చదువు. మనస్సుకు రెక్కలు తొడుగుతూ, హృదయాల్లో పాలధారలు నింపుతూ, రక్తనాళాలను చైతన్యంతో ఉచ్ఛలితం చేస్తూ విద్యుచ్చకితం చేసే త్రోవలను వేస్తూ చదువు చెప్పిన దేశికోత్తములు ప్రభాకరశాస్త్రి వర్యులు ప్రాచీన కావ్య మర్మాలను వివరిస్తూంటే అనేక తన్మయత పారప్రవచనంలో క్రొత్తలోకాలకు తీసుకొనిపోయేవారు మధ్యమధ్య 'ప్రెస్సు' కెక్కని పద్యా లెన్నో చెప్పేవారు. క్షణం ఏమారితే ఏచరణం జారిపోతుందో అని ఎంతో జాగరూకతతో శిష్యులు వాటిని వ్రాసుకొనేవారు వ్యాసహారికంలో ఉన్న భాషా చమత్కారా లెన్నో చవులూరించేవి మధ్యమధ్య దొర్లుతుండేవి. తెలుగు పలుకుబడులు, నానుళ్ళు, దేశిసాహితి సొంపులు వివరించటంలో వారి నేర్పు గొప్పది

కళాశాలలో భాషాసంఘ మొక టుండేది. దానికి మా సహాధ్యాయుడు తిమ్మావజల కోదండరామయ్య కార్యదర్శి. పెద్ద లెందరో ఆసంఘంలో ఉపన్యాసా లిచ్చేవారు. ఒకతూరి అల్లసాని రామనాథ శర్మగారు తిరుపతికి వచ్చి ఉన్నారని కార్యదర్శి తెల్పితే, వారిని పిలిపించి, సభచేసి, అష్టావధానాన్ని జరపించి, పురప్రముఖులచేత వారికి శాస్త్రిగారు ఘన సన్మానం చేయించారు

'అమరం' తెల్లవారు జామున వల్లెవేయమని చెప్పి, అట్లా చేస్తున్నామో లేదో ఆరా తీసి, సోమరులను కోపపడేవారు. చేతివ్రాత అందంగా ఉండాలని తరచు మమ్మ హెచ్చరిస్తుండేవారు పాఠం చెపుతూ మధ్యమధ్య ఆశువుగా పద్యా లల్లేవారు. శిష్యుల అభ్యుదయాన్ని నిరంతరం కాంక్షించటమేకాకుండా, అవసరమయితే వారి పలుకుబడిని వినియోగించటానికి వెనుకాడేవారు కారు. నిరంతర శిష్యశ్రేయశ్చింతనులు

శాస్త్రిగారు ఆరేండ్లపాటు (140-46) తెలుగు శాఖకు అధ్యక్షులు అప్పటి శిష్యులలోని వారే (1) తిమ్మావజల కోదండరామయ్య (మధుర విశ్వవిద్యాలయం ప్రొఫెసరు), (2) ఏ.వి శ్రీనివాసాచార్యులు (తిరుపతి రిసెర్చి ఇన్స్టిట్యూటు పండితులు), (3) యన్. ఏ నారాయణరావు (లేపాక్షి సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు), (4) కప్పగంతుల శంకరప్రసాద్ (నిడుబ్రోలు పి.బి.యన్ కళాశాల లెక్చరరు), (5) పోచిరాజు శేషగిరిరావు (పెద్దాపురం మహారాణీ కళాశాల - ఆంధ్రశాఖాధిపతి), (6) సింగరాజు సచ్చిదానందం (లెక్చరర్ యస్ వి. కళాశాల, తిరుపతి, కొన్నేళ్ళు ఆంధ్ర నాటక ఎకాడమీ సభ్యులుకూడా), (7) రాణి సూర్యనారాయణ (హైస్కూలు పండితులు, నరేంద్రపురం, తూ.గో. జిల్లా), (8) టి దీనదయాళు నాయుడు (లెక్చరర్, వైష్ణవ కళాశాల, మద్రాసు) ఇంకా ఎందరో.

జాతి, మత, కుల భేదాలు శాస్త్రిగా రెరుగరు షేక్‌మస్తాన్ అనే విద్యార్థి వారింటనుండి చదువుకొన్నాడు కర్నూలు ఉస్మానియాకళాశాల ప్రధానాచార్యుడుగా పనిచేసి ఇటీవల రిటైరైనాడు దాసి బసవయ్య అనే హరిజన విద్యార్థి శాస్త్రిగారి చలువవల్లనే విద్వాన్ చదివి, పండితుడైనాడు పుత్రనిర్విశేషంగా శిష్యులను ప్రేమించారు అనుదినమూ వారిని స్మరించుకొనే, శిష్యులు, యోగశిష్యులు ఈనాటికి ఎందరో ఉన్నారంటే ఆశ్చర్యం వేస్తుంది సమదర్శనులైన పండితులు శాస్త్రిగారు. వారి సతీమణి మహాలక్ష్మమ్మగారు సంతానంతో పాటు నమ్మల్ని అనిత వాత్సల్యంతో సాకిన పుణ్యసాధ్వి శిష్యుల కష్టసుఖాలను తెలిసికొని, అవసర సమయాల్లో ఆదుకొంటూండేది ఆతల్లి. అదంతా ఆశ్రమవాతావరణంలో చదువులు

## వాఙ్మయార్చన (1940-50)

ప్రభాకరశాస్త్రిగారి జీవిత చక్రంలో ఇదొక మహాదశ. సవ్యసాచియై యోగ-సాహిత్యాలను ఉపాసించిన కాల మది చెప్పుకోతగ్గ ఒడుదుడుకులు లేవు సంసార బాధ్యత లంతా ఒప్పిదంగా అర్ధాంగి చూస్తుంటే, ఆయన కాల మంతా యోగానికి, వాఙ్మయానికి వినియోగించినారు ఎప్పుడో తమ పన్నెండవయేట యెత్తిన కలం, ఇంచుమించు యాభైయేళ్ళపాటు అవిశ్రాంతంగా రచనలు సృష్టిస్తూనే ఉంది. ఆయన ధీప్రభ, ఉపజ్ఞాబలం, మౌలిక ప్రజ్ఞ ఎప్పుడూ చేవలు దేరుతూనే ఉంది.

తి తి. దేవస్థానంవారి కొలువులో చేరిన పదేండ్లు, ప్రాయ మింతకు మిగుల్కై వ్రాలని వయస్సులో, ప్రౌఢి మెరయించే బంగారుపంటలు సాహిత్యక్షేత్రంలో పండిస్తూనే ఉన్నారు ఈదశలోనే ఏకధాటిగా పది ప్రాచీన గ్రంధాలు పరిష్కరించి ప్రకటింపజేసినారు (1) రంగనాధరామాయణము (1942), (2) వేంకటేశ్వర వచనములు ((1945), (3) శృంగార సంకీర్తనలు 4, 5 భాగాలు (1947) (4) అన్నమాచార్య జీవిత చరిత్రము (1949), (5) శృంగారామరుకము (1950), (6) ధనుర్విద్యావిలాసము (1950), (7) కాటమరాజుకథ (1950), (8) సుభద్రాకళ్యాణము (1950), (9) పావులూరి మల్లన సారసంగ్రహగణితము, (10) వేంకటేశ్వర లఘుకృతులు (సంకలన గ్రంధము), (11) ఆంధ్రకామందకము (రాజనీతి శాస్త్రము) (1950)

**(1) రంగనాథ రామాయణము :** ప్రజారంజకమైన ప్రాచీన ద్విపద కావ్యం. ప్రామాణికప్రతి కావలెనని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రభాకరశాస్త్రిగారిని కోరగా, దానిని పరిష్కరించి పెట్టినారు దానిని యూనివర్సిటీ 1942లో

ప్రచురించింది అంతకు ముందే పురాణం హయగ్రీవశాస్త్రి, వేదము వేంకటాచల శాస్త్రి, కరాలపాటి రంగయ్య, నేంటూరి వేంకట సుబ్బాశాస్త్రి మున్నగువారి పరిష్కరణలున్నాయి

దీని కర్తృత్వం వివాదగ్రస్తం చక్రపాణి రంగనాథుడని శాస్త్రిగారి మతం డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు గోనబుద్ధారెడ్డి కృతియని వాదించి, ఆపేరు మీదుగనే రంగనాథరామాయణాన్ని ప్రచురించినారు. ఈ వాదాన్ని జయంతి రామయ్య పంతులు, వేమూరి విశ్వనాధశర్మగారలు, రెడ్డిగారికంటె ముందే లేవదీసి యున్నారు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఉభయుల వాదాలను అవలోకించి, శాస్త్రిగారి వాదాన్ని సమర్థిస్తూ ఇట్లా వ్రాసినారు ''మన ఆంధ్రసాహిత్యాన్నీ, అనూచానంగా వచ్చే సంప్రదాయాన్నీ, దొరికిన చరిత్ర సాధనాలను పెట్టి నిష్పక్షపాతంగా చూస్తే రంగనాధుడనే కవి తన ప్రభువైన బుద్ధారెడ్డి పేరుతో దీన్ని రచించా డనుకోవడమే న్యాయమని తేలుతుంది ... రంగనాధు డనేవాడే ప్రపంచంలో లేడని, కృత్రిమంగా కల్పించిన వ్యక్తి అనీ చెప్పేవరకు ఈ అభిమానం ఈవాదంలో (రెడ్డిగారివాదం) ప్రబలింది. రంగనాథుడు కృత్రిమపురుషుడని రెడ్డిగారివలె దృఢంగా చాటుట నాచేతఁ గానిపని''[1] ఇది రాళ్ళపల్లివారి తీర్పు.

ఇక అనుబంధంలో 'సులోచనావృత్తాంతం' చేర్చటం రెడ్డిగారికి నచ్చలేదు. పలువిధాల అపకృష్టంగాను, భిన్నముగాను కానవచ్చే గ్రంథము, మూలగ్రంథములో చేర్చకపోవుటే సముచిత మనిపిస్తుంది. శాస్త్రిగారి తీర్పు నిర్మమతతో కూడినది. ఎందుకంటే, వారు ప్రక్షిప్తభాగాలని పేర్కొన్నవి కట్టా వరదరాజు రామాయణంలో అనంతర కాలాలలో కానవచ్చినవి. మరికొన్ని అన్నమాచార్యకృత రామాయణ ద్విపదులు కాదగునని నిడుదవోలు వేంకటరావు (1903-82)గా రభిప్రాయపడినారు. అనంతర పరిశోధకులవల్ల ప్రధానగ్రంథములో దీనిని చేర్చవలసి యుండవలసినదనే వాదం అప్రస్తమయింది. కాగా శాస్త్రిగారి అనుబంధ వర్గీకరణం శాస్త్రీయ పద్ధతిలో సాగిందని గ్రహించాలి. చిత్ర మేమంటే, ఎంతోశ్రమకోర్చి పరిశ్రమించి రామాయణాన్ని పరిష్కరిస్తే దానికివారు పీఠిక వ్రాసే అవకాశ మేర్పడలేదు అదొక బృహత్కథ.

**(2) వేంకటేశ్వర వచనములు :** తొలుత 1925లో శాస్త్రిగారు కొన్ని వచనాలు ఎన్ని 'భారతి'లో ప్రకటించారు. తరువాత తి.తి దేవస్థానము 47 వచనాలను వైరాగ్యవచనమాలికాగీతాల పేరిట 1935లో ప్రకటించింది. మరల ప్రభాకరులే సొంతం 166 వచనాలను పరిష్కరించి, తాము 'రీడరు'గా నుండగా

1. సంస్కృతి 2సంపు 8సంచిక (1954 సెప్టెంబరు)

విపుల పీఠికతో వెలువరించారు ఇందులో వచన రచనా రీతులు కూలంకషంగా చర్చింప బడినాయి

**(3) శృంగార సంకీర్తనలు :** అన్నమయ సంకీర్తనలు 4, 5 సంపుటాలు పరిష్కరింపగా తి తి దేవస్థానము ప్రచురించింది. ''ఈశ్వర సంకల్ప మెట్టిదోకాని తాళ్ళపాకవారి యధ్యాత్మ సంకీర్తనలు చదువుచుండు నపుడు నాహృదయ తంత్రులలో ననురణము సాగుచు పరమానంద పారవశ్యము కలుగుచు కర్తవ్య మేదో వ్యక్తమగుచున్న ట్లుండును'' ఇవి అన్నమాచార్య చరిత్రపీఠికలోని మాటలు. వీటివల్ల ఎంతటి తన్మయతతో వారీ కృషిని వేంకటేశ్వరోపాయనంగా చేపట్టినారో తెలుస్తుంది వ్యాకరణవిధేయంగా లేవని దిద్దివేయక, వానిని వికృతీకరించలేదు శాస్త్రిగారి తరువాత రాళ్ళపల్లివారు, గౌరిపెద్ది రామసుబ్బశర్మగారూ సంకీర్తనలు ప్రచురించారు

**(4) ధనుర్విద్యావిలాసము :** యుద్ధతంత్రాన్ని తెలిపే మూడాశ్వాసాల కృతి దీని పీఠికలో ప్రాచీన ధనుశ్శాస్త్ర గ్రంథాలన్నీ వివరాలతో పేర్కొన్నారు. ఇం దుదాహరింపబడ్డ పారిభాషికపదాలకు మూలం 'మహారాష్ట్రప్రాకృత' మని గుర్తించి వివరాలు తెల్పినారు మానవల్లివారి నుండి తాము గ్రహించిన విషయాలను కృతజ్ఞతతో స్మరించినారు.

**(5) శృంగారామరుకము :** సంస్కృతంలోని అమరుక శతకానికి తెనుగుసేత ఆంధ్రీకర్త తాళ్ళపాక తిరువేంగళప్ప. అన్నమయ్యకు మునిమనుమడు. పెదకోమటి వేముని శృంగారదీపికా వ్యాఖ్యానాన్ని పురస్కరించి శ్లోకసంఖ్యను తెలుగు పద్యాలకడ చేర్చడం విశేషం ఒకే వ్రాత ప్రతి దొరికితే, ఎన్నో అపపాఠాలు సవరించి రసికజనసేవ్యమైన ఈకృతిని పరిష్కరించారు. ప్రతిని సంపాదించిన శాస్త్రిగారి చేతనే పరిష్కరింపబడుట చిత్రమైన సంఘటన.

**(6) ఆంధ్రకామందకము :** రాజనీతిని తెల్పే శాస్త్రగ్రంథము జక్కరాజు వెంకటకవి రచన తంజావూరు లైబ్రరీవారి 14వ ప్రచురణ. ఒకే ప్రతి తప్పుల తడకలుగానున్నది దొరికితే, గణయతిభ్రంశాలు దొర్లకుండా ఇంకొక ప్రతి వ్రాయించి, సందిగ్ధాలు మూలప్రతిలో సరిచూచి, సంస్కృతమూలాన్ని సంప్రదించి పూరణలు గావించి, అవి వేరుగా చూపినారు. 'మూగవోయిన శాస్త్ర కావ్య వీణాతంత్రులను సవరించి, జీవగఱ్ఱ బిగించి, శ్రవణ పేయమైన నాదసుధలు స్రవించునట్లు మీటిన ప్రవీణులు శ్రీప్రభాకరశాస్త్రిగారు.'[1]

---

1. వేటూరివారి సారస్వతవరివస్య - పుట 235

**(7) కాటమరాజుకథ :** దొరికిన తొమ్మిది తాళపత్ర ప్రతులను పరిశీలించి ఒక శుద్ధ ప్రతిని ముద్రణకై పరిష్కరించి సిద్ధంచేశారు శ్రీనాథుని రచనను ననుసరించి పిసుమల్లయ దీనిని రచించినట్లు ప్రభాకరు లభిప్రాయపడినారు దీనికి కూడా అనుబంధంలో కొన్ని చేర్చారు రచనాప్రభేదమే అందుకు కారణం ప్రకటన కాలానికి శాస్త్రిగారు దివంగతు లగుటచే వారి పీఠిక లేకుండా పోయినది

జానపదవాఙ్మయ విశిష్టతను తెలిసికోవా లంటే, దేశికవితాశాఖలో ప్రధానమైనది 'ద్విపద' ముఖ్యమని ప్రభాకరులు గుర్తించారు ''జానపదుల నాలుకలపై తేలియాడే దేశిసారస్వత సంప దంతా అనుభవయోగ్య''మని శాస్త్రిగారి తలంపు. ఇందు అపశబ్దాలను సవరించలేదు. మూలగ్రంథకర్త అట్లే వ్రాసియుండ నోపునని వారి ప్రబల విశ్వాసం. శాస్త్రిగారి లభ్యుదయ వృక్షధాని కీపరిష్కరణ అద్దం పడుతుంది

**(8) సుభద్రా కళ్యాణము :** తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క కృతిని కాళహస్తి సంస్థాన భాండాగారం నుంచి సేకరించి, వెలికి తీసి ప్రచురించే భాగ్యము శాస్త్రిగారికి లభించింది. తిమ్మక్క అన్నమయ్య భార్య. రచనంతా మంజరీ ద్విపదలో ఉంది తాళ్ళపాక కవులు పెక్కురు సెండ్లిపాటల కీఛందమునే వరించిరి 'సుభద్రా కళ్యాణంపాట' అనికూడా ఈ రచనకు వ్యవహార మున్నది ఇందులోని పెక్కు పలుకుబడులు చేమకూర వేంకటకవి విజయవిలాసంలో చేరినట్లు తెల్పినారు.

**(9) అన్నమాచార్య జీవితచరిత్రము :** సంకీర్తనాచార్యులు తాళ్ళపాక అన్నమయ్యగారి జీవిత చరిత్రను, ఆయన మనుమడు చిన తిరువేంగళనాథుడను పేరుగల చిన్నన్న ద్విపదలో రచించినాడు వ్రేళ్ళపై లెక్కపెట్టదగిన ప్రాచీనకవీశ్వర చరిత్రములలో నిది యొకటి. మూలము నలుబది యేడుపుటలు. దీనిని పరిష్కరించి 133 పుటల విపుల పీఠికను ఎన్నో చరిత్ర. సాహిత్య విషయాలతో రచించిరి. అన్నమాచార్యజీవితచరిత్ర పీఠిక, ప్రత్యేకించి ఒక చరిత్ర గ్రంథ మనవచ్చును సంకీర్తనములనుబట్టి, తాత్కాలీన శాసనములను పరిశీలించి, అన్నమాచార్య పుత్ర పౌత్రాదుల కావ్యాదులనుబట్టి, సలుదెఱగుల సాధనములను గ్రుచ్చియెత్తి హృద్యమయిన తచ్చరిత్రము నుద్ధరించినారు

ఈ పీఠికలో అన్నమయ్య, తత్సంతతి చరిత్ర, వడ్డికాసులవాని వైభవము, ఆంధ్ర సంకీర్తనల విశిష్టత, సంగీతశాస్త్ర విషయాలు, నాటి భాషాకవితా రీతులు, ప్రాస్తావికముగా విజయనగరరాజుల చరిత్రము, కపిలేశ్వర - పురుషోత్తమ గజపతుల దండయాత్రలు, నాటి మత, సాంఘిక, రాజకీయాది చరిత్రలు వివరింపబడినవి.

స్థలపురాణగాథలు, కుమ్మరమండపము, తలయేరు గుండు, సారువేట మండపము, మోకాళ్ళముడుపు మున్నగుగాథలు విశదీకరింపబడినాయి రాయలవారెన్ని మార్లు తిరుపతి వచ్చినది, ఆయా ప్రభువులు స్వామికర్పించిన దానములను దెల్పిరి అన్నమయ్య నిట్లు శాస్త్రిగారు కీర్తించినారు ''ఆడినది అమృత కావ్యము, పాడినది పరమసంకీర్తన మయినది అన్నమాచార్య సంకీర్తనములును, శృంగార సంజరియు తేటతేటగా తేలిక తేలికగా తియ్యతియ్యగా హాయిహాయిగా గోస్తనీసద్రాక్షా గుళుచ్ఛములవలె నాస్వాద్యములైనవి '' అన్నమయ్య నాచనసోము ననుసరించిన పట్టులు వెల్లడించుటే కాక, నిఘంటువుల కెక్కని దేసి తెలుగు పలుకులు గుర్తించి చూపినారు కవికర్ణరసాయనకర్త నరసింగన్న అనుటకాధారములు చూపినారు ఈపీఠిక శాస్త్రిగారి చరిత్ర పరిశోధనపాటవాన్ని తెలిపే విలువైన గ్రంథము

**(10) పావులూరి మల్లన్న సారసంగ్రహ గణితము :** ప్రభాకర శాస్త్రిగారి పరిష్కృత గ్రంధాలలో ఇదే చిట్టచివరిది 1912లోనే వారీ గ్రంథాన్ని గుర్తించి, మహావీరాచార్యుని గణితసార సంగ్రహానికి తెలిగింపని తెల్పినారు. మల్లన తెలుగు గ్రంథాన్ని బెంజిమిన్ అనే ఈస్టు ఇండియా కంపెనీ ఏజెంటు (సామర్లకోట) ఆంగ్లములోనికి తర్జుమా చేసినాడు శాస్త్రిగారు సాంకేతిక పదాలకు వివరణ ఇవ్వడంతోపాటు, కొలమానాలు మూలంలో మగధసంప్రదాయంలో ఉంటే, ఆంధ్రీకర్త తెలుగు సంప్రదాయానికి మార్చినట్లు కనుగొన్నారు మూలాతిక్రమణ లెక్క డున్నాయో వివరించారు ప్రథమభాగంలోని పరికర్మ, భిన్నగణితా లున్న భాగం మాత్రం శాస్త్రిగారు పరిష్కరించడం జరిగింది మూలగ్రంథం అచ్చుపడుతుండగా శాస్త్రిగారు భౌతికము వీడుటచే, దీనికి కూడా వారి పీఠిక లేకుండా పోయింది శాస్త్రిగారి పరిష్కరణ లన్నింటికి దీక్ష, ఉపజ్ఞ, మౌలికప్రతిభ, ప్రామాణికత, సత్యనిష్ఠ జీవ స్నాయువులు

**(11) శ్రీవేంకటేశ్వర లఘుకృతులు :** 'మదరాసు విడిచి శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల సన్నిధి సేవ కావింప వచ్చుటలో నా తొల్లటి కోరిక తాళ్ళపాక వారి రచన లన్నింటిని వెల్లడించుట' అని శాస్త్రిగారి వాక్కు. ఆపనిలోనే నిమగ్నమైనారు వేంకటేశ్వరస్వామిని ప్రధానీకరించుకొని భక్తులు రచించిన రచనల సంపుటి ఇది సంకలన గ్రంథప్రచుర ణంటే వారికి ప్రీతి. ఈ సంపుటంలో అజ్ఞాత కర్తృకాలు 12, జ్ఞాతకర్తృకాలు 7 ఉన్నాయి. అటు పిమ్మట '(శ్రీవేంకటేశ్వర వర్ణన రత్నమాల' అను మరొక సంకలనం సంధానించారు. శ్రీకోరాడ రామకృష్ణయ్యగారి హయాములో ఇది అచ్చయినది. వైష్ణవాంధ్ర సాహిత్యానికి ప్రభాకరుల సేవ గుణాత్మక మైనది, పరిపుష్టిని కూర్చేది.

**లక్షణోద్ధారము :** ఇదికూడ సంకలన గ్రంథమే. అముద్రితము దాని వ్యూహరచనలో శాస్త్రిగారి ప్రతిభాపాటవం ద్యోతకమవుతుంది (1) లక్షణ గ్రంథాల పట్టిక, (2) వీనిలోని లక్ష్యలక్షణ గ్రంథాల పేరులు, (3) అన్ని లక్షణగ్రంథాల్లో ఉదాహృతాలైన లక్షణ గ్రంధాల పట్టిక, పద్యాల సంఖ్య, (4) లక్షణ గ్రంధోదాహరణోద్ధారము, (5) లక్ష్యగ్రంథోదాహరణోద్ధారము సాకల్యంగా ఈప్రణాళిక ఆచరణలోనికి వస్తే, లక్ష్యలక్షణగ్రంథ సర్వస్వంగా ఉండి, భాషాపరిశోధకుల కెంతోగనో ఉపకరించేది. ఇందులో ఛందశ్శాస్త్ర పరిశీలన, అభివృద్ధి, సర్వకవితా రీతుల విపుల పరిశీలనము వివరింప దలపెట్టిన ట్లున్నది ఇది భగీరథ కృషి ఇంతటి బృహత్తర గ్రంథరచన కేతా మెత్తిన ప్రభాకరుల ధిషణ, పాండితీప్రగల్భత మెచ్చుకోదగినవి

## వ్యాఖ్యాన రచనలు

ఏనాడో 1926లో మనుచరిత్ర పరిష్కరణతోపాటు వ్యాఖ్యానమును వ్రాసిన సంగతిని ప్రాజ్ఞులవల్ల విన్నట్లు ఆచార్య తిమ్మావజల కోదండరామయ్యగారు నాతో చెప్పినారు. ఇది వావిళ్ళవారి ప్రచురణ ఎందువల్లనో శాస్త్రిగారి పేరు ట్టకించలేదు. ఇది చింత్యము.

**ఉత్తర హరివంశము :** నాచన సోముని ఉత్తరహరివంశమునకు వ్యాఖ్యానాన్ని నాలుగవ ఆశ్వాసంలోని 'ఉరము కౌస్తుభరత్న' అనే పద్యం దాకా చేసినారు వారు గతించుటతో మధ్యలో ఆగిపోయింది. ఇది అముద్రిత రచన[1] ఆ రచన చేస్తున్న సంవత్సరాల్లోనే నాల్గైదు గ్రంథాలు పరిష్కరించటం, అన్నమాచార్యోత్సవాలు, మ్యూజియము స్థాపన, శిల్పసేకరణకై అవిశ్రాంత పర్యటనలు ఒకే వ్యక్తిపై పడుటవల్ల ఇది పూర్తికాకుండా పోయినది.

రచన గద్యవ్యాఖ్యగా నడిచింది. పూర్వవ్యాఖ్యాతలకంటె, భిన్నమైన తీరులో దీని నుపక్రమించినారు. ప్రతి ఆశ్వాసమునకు కథాంశములు తెల్పుట - సంస్కృత మూలమును చూపుచు, అనువాదంలోని సారస్య వైరస్యాలు వివరించుట - ఆశ్వాసాంతమున పరిశిష్ట మనుపేర మరికొన్ని వివరణలు - ఎఱ్ఱన హరివంశంతో పోలికలు చూపుట - పాఠ నిర్ణయము - సుగమమైన పద్యాలకు వ్యాఖ్య ఉజ్జగించుట - గహనమైన విషయము లున్నచోట విడువక విపులీకరించుట - గూఢార్థవివరణలు - అన్వయముఖముననే వ్యాఖ్య - పూర్వపరిష్కర్తల పాఠపరామర్శ ఇట్లా రచన సాగినది. మల్లినాథునివలె శాస్త్రిగారు పదవాక్యపారావార పారీణులు కొఱుకుడు

1. ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు దీనిని త్వరలో ప్రచురింపనున్నారు.

పడని పట్టులందు ఎట్లయిన సాధించుట వీరి ప్రత్యేకత నిఘంటు ప్రమాణములు చూపుట, కావ్యధర్మసమన్వయము, అర్థవివరణవంటి వెన్నో యిందు కనబడతాయి ఆద్యంతమూ వ్యాఖ్యానింపబడి ఉంటే, ఇది ఆంధ్ర శారదకు పూర్ణ కంఠహారంగా మెరిసే దనడంలో సందేహం లేదు వ్యాఖ్యానరచనలో క్రొత్తత్రోవలు చూపిన పండితవర్యులు

**నన్నెచోడ కుమార సంభవము :** ఏకకాలమందు పలురచనలు చేపట్టుట శాస్త్రిగారి తీరు పిఠాపురం మహారాజా శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారి ప్రోత్సాహంతో 1948లో దీనికి వ్యాఖ్యానం వ్రాయ నారంభించినారు దీనికి పరిష్కర్త - వ్యాఖ్యాత ప్రభాకరశాస్త్రిగారే ఈ రచనకు నాందిగా తొలుత ఎనిమిదాశ్వాసాలు పరిష్కరించి సవరణ పట్టికలు తయారుచేసికొని తొలి ఆశ్వాసంలోని ముప్పది ఆరవపద్యము వరకు వ్యాఖ్య రచించినారు అంతలో జమీందారీల రద్దు చట్టం అమలులోనికి వచ్చింది దానితో రాజావారీఉద్యమాన్ని వదలుకోవడంతో రచన ఆగిపోయింది. చాలా కాలం తర్వాత శాస్త్రిగారి శిష్యులు ఈగ్రంథానికి పూర్తివ్యాఖ్య రచించినట్లు మిత్రువల్ల విన్నాను

**నైషధ పరిజాతీయము** : రఘునాథరాయల కాలమునాటి కృష్ణాధ్వరి రచించిన ద్వ్యర్థి కావ్యమిది దీనికి వ్యాఖ్య వ్రాయవలెనని సంకల్పించుకొన్నట్లు వారే ఒకచోట చెప్పుకొన్నారు. ఇది 1930-40 నాటి సంగతి.

## ప్రజ్ఞాప్రభాకరము

ఇది ప్రభాకరశాస్త్రిగారి స్వీయ చరిత్ర. ఇది వారి షష్టిపూర్తి నాడే (1948) సంకల్పించినా, వారి రెండవ కుమార్తె 'సుజాత'గారి వివాహంరోజు సాయంత్రం (29.5 1949) ప్రార్థన సమావేశంలోనే శ్రీకారం చుట్టడం జరిగింది.

ఇందులో వారి బాల్యస్మృతులు, చెళ్ళపిళ్ళవారికడ శిష్యరికం, మదరాసు రాక, ప్రాచీన గ్రంథాన్వేషణ, నాడీగ్రంథాల ప్రస్తావన, పావులూరి మల్లన గురించిన వాద ప్రతివాదాలు, తంజావూరి లైబ్రరీ విచిత్ర విక్రయగాథ, నిరంతర పఠనాసక్తి, ఆనాడు ప్రసిద్ధులైన పెద్దలు పనప్పాకం అనంతాచార్యులు, డా ఆచంట లక్ష్మీపతి, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు మున్నగు వారితోటే కాక, ప్రసిద్ధ విద్వాంసులతోడి మైత్రి మున్నగు విశేషా లెన్నో ఉన్నాయి. తమ విజయాలతోపాటు బలహీనతలు చెప్పుకొన్న ధైర్యశాలి

ఇందు జీవితోదంతమే కాక ప్రజ్ఞాజీవితోదంతమును వెల్లడించినారు దివ్య ప్రజ్ఞామయమైన అనుభూతి విశేషాలు తెల్పినారు. సత్యకథనమున వారికి మహాత్మాగాంధి మార్గదర్శి. నిజమైన ఆత్మకథనమునకిది ఉదాహరణ. అరుదైన స్వీయ చరిత్ర.

పసివయసునుండే పరుల వేదనను చూచి సుధిన పడడము, ఇతరుల రుగ్మతలనూ కష్టాలనూ దూరం చెయ్యమంటూ భగవంతుణ్ణి ప్రార్థించడము, చిన్ననాటినుండి తాత్త్విక చింతన, ప్రభాకరులు యోగిగా అద్భుతశక్తి సమన్వితులుగా మారటానికి అనంతరం జీవితంలో సహాయకారులైన సంగతి విశదమవుతుంది. తొలి ప్రపంచ యుద్ధపు బీభత్స సంఘటనలు తమను కుదిపివేసిన సంగతులు వివరించారు

గురువులు మాష్టరు సి.వి.వి గారి దివ్య దర్శనం, వారి ఉద్బోధ, శ్రీవారితో సంభాషణ వివరాలు, యోగప్రవేశము, యోగార్థములను గూర్చి తెలుగులో కొంతైనా వివరించిన తొలి ప్రామాణిక గ్రంథం ఇదే

తమ ప్రజ్ఞాచరిత్ర వేయిపుటలుగా వ్రాయాలని సంకల్పించి, 28వ ఏటివయస్సువరకు మాత్రమే వ్రాసినారు 1950లో హఠాత్తుగా పరమపదించుటతో, సంకల్పించిన రీతిలో రచన పూర్తికాలే దనిపిస్తుంది తెలుగులో స్వీయచరిత్ర రచనమున కిది ఒజ్జబంతి వారి నిష్కా-సత్యము, దైవీసంపద్విభూతి, ఆర్తసేవా చరణం దీనివల్ల వ్యక్త మవుతున్నాయి. ప్రభాకరులు వ్యక్తికాదు, మహా సంస్థ.

**గాంధి రామాయణము :** శాస్త్రిగారు చిన్ననాటినుండి జాతీయ భావ పరిపూర్ణులు. గాంధిమహాత్మునిపై కవిత అల్లినారు. బాపూజీని పురుషోత్తమునిగా మన్నించినారు. 1943లో గాంధిమహాత్ముడు బొంబాయిలో ఉపవాసదీక్ష నెరపు రోజుల్లో ప్రభాకరు లెల్లా విలవిలలాడిపోయే వారో ప్రత్యక్షంగా ఎరిగిన వాణ్ణే

గాంధి అస్తమయం ప్రభాకరుల ప్రాణమూలాన్ని కుదిపివేసింది. గాంధి పోయిన రోజుల్లో మద్రాసు ఆకాశవాణినుండి వారు ప్రసంగిస్తుంటే మధ్యలో కొన్నిక్షణాలు దుఃఖోద్విగ్నత కారణంగా నోట మాట రాలేదు. విన్న శ్రోతలంతా కంట తడిపెట్టారు. దర్భా సుబ్రహ్మణ్యాగా రిది నిజమైన 'కవిత' అన్నారు.

1950 జనవరిలో 'గాంధి రామాయణ' మనే బృహత్సంకలనానికి తెలుగునాట పత్రికలలో ఒక ప్రకటన చేసినారు ''గాంధిగారు మరణించినపు డెవ రెట్లా ప్రతిస్పందించారో, వారి భావపరంపర లెట్లా సాగినాయో 'రికార్డు' చేసి పంపమని'' కోరినారు. ఆ ప్రకటన చూచి యూనివర్సిటీ ప్రొఫెసర్లు, లాయర్లు, అధ్యాపకులు, రాజకీయ వేత్తలు, పాఠశాల విద్యార్థులు తమతమ అనుభవాలను వ్రాసి పంపినారు. శాస్త్రిగారి అస్తమయంతో ఆకార్యక్రమం ఆగిపోయింది.

ఒక మహాపురుషని నిర్యాణం జనసందోహంలోని 'భావస్పందనలు' గ్రంథస్థం చేయాలని యత్నపడినవారు తెనుగునాట కానరారు. వీరే ప్రథములు. వేటూరివారి మౌలికత కిది మరో సాక్ష్యం.

# 19. మ్యూజియము రూపకల్పన

జాతీయ సంస్కృతి నిక్షేపాలలో శిల్ప, చిత్రకళా ప్రదర్శనశాలల స్థాపన ప్రధానాంశం. అది జాతిని జాగృతం చేస్తుంది తిరుమల తిరుపతి దేవస్థానమువారు వేటూరి ప్రభాకర శాస్త్రులవారిపై శిల్ప, చిత్రకళా మ్యూజియమును రూపొందించే భారాన్ని మోపినారు. (48-49) అప్పటికే గ్రంథ పరిష్కరణభారం తలమున్కలుగా ఉంటున్నా, వారే ఈబాధ్యతను గూడ తలదాల్చవలసిన వారైరి ఆసంస్థలో శిల్పకళామూల్యాలను, వాటి స్థానాలను ఎరిగినవారు శాస్త్రిగా రొక్కరే. అందువల్ల కొంతలో కొంత వ్యవధి కల్పించుకొని మ్యూజియము పనిపై రాత్రింబవళ్ళు ఆహార నిద్రాసౌకర్యాదులు వదలి, పులులు చెరలాడే కడప అడవులు మొదలుకొని ముక్త్యాల, తెలంగాణాలోని నల్లగొండ గుట్టల వరకు ఆయన గాలించారు. ఆ గాలింపులో ఎన్నో సుందరమైన జైన-బౌద్ధ-హిందూవిగ్రహాలు సేకరించి తిరుపతికి చేర్చినారు ఇది ఇలా ఉండగా, కాళహస్తి సంస్థానం వారి పురావస్తుభాండార మంతా శోధించి కవచ ఖడ్గాదులు కూడా సేకరించినారు.

బందరులో కోట సుబ్బారావుగా రెంతో కాలంనుంచి సంపాదించి ఉంచుకొన్న అమూల్య చిత్ర, ప్రతిమాదులను ఆంధ్రజ్యోతి సంపాదకులు నార్ల వేంకటేశ్వరరావుగారి సాయంతో సముపార్జించి తిరుపతికి పదిలంగా తరలించినారు. అక్కడే ప్రథమాంధ్రాస్థానకవి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు పొందిన పతకములు, సన్నదులు, ప్రభుత్వ లాంఛనాలతోపాటు, వారు ధరించిన పావుకోళ్ళు, కళ్ళజోళ్ళు, లిఖిత గ్రంథాలు వగైరాలు సంపాదించారు మ్యూజియముకోసం.

శాస్త్రిగారి సంచారంలో శిష్యులు సింగరాజు సచ్చిదానందం, ఏ.వి. శ్రీనివాసాచార్యులు, దీనదయాళునాయుడు మున్నగువారు, సహోద్యోగులు, ఒక్కొక్కమారు వారి పెద్దకుమారులు డాక్టర్ సుందరమూర్తిగారు పాల్గొనేవారు. శాస్త్రిగారి శ్రమను, పరిశీలన పాటవాన్ని వెల్లడించే కొన్ని ఆరోపాలు, శ్రీవారి డైరీలనుంచి ఉట్టంకిస్తాను.

**1950, మార్చి, శనివారం 4వ తేదీ :**

నిడంబరం, 53 మైళ్ళు నంది విగ్రహం (10) (ఇది విగ్రహాల వరుస సంఖ్య). మూడు విగ్రహాలు త్రవ్వించే యేర్పాటు చేసితిమి అక్కడనుండి కనకమ్మసత్రం. అక్కడి విగ్రహాలు (లోహపురి ?) తిరువాలంగాడు, తక్కోలంలో ఉన్నవిట. తెప్పించే యేర్పాటు చేసితిమి. ఆర్కాటుకుప్పం, వరదరాజవిగ్రహం శివాలయం వాకిట (11) శివలింగాదులు, నవగ్రహాలు, దేవాలయనిర్మాత విగ్రహాలు, శాసనం (ముద్దు వీరప్పనాయుడు ?) చూచితిమి అక్కడినుండి అరంగళం జైనవిగ్రహాలు చూచితిమి. ఒక తాటాకు పుస్తకం అర్పాకం దగ్గర తిరుత్తనిలో నిద్ర

**1950, మార్చి, ఆదివారం, 5వ తేదీ :**

ఉదయం 'వేలంజేరి'. (12) నందివిగ్రహం, (13) కేశవప్పెరుమాళ్ళు, (14) అమ్మవారు, (15) విరిగిన అమ్మవారు, (16) వజ్ర విష్ణాము

వేలంజేరి పురంబున
ఫాలాక్షుని యాస నడసి బాలేందుముఖీ !
లీలావతి ! నీ భక్తుల
పాలింపవె పసిడి బొమ్మ ! వడివేలమ్మా !

వడివేలమ్మ విగ్రహాలు చెరువుగట్టుమీద 3 ఉన్నవి అందు రెండు మహనీయము. అందు మఱీ బిడ్డకు పాలిస్తున్న తల్లి విగ్రహం మహామనోహరం. మధ్యాహ్నం తిరుత్తనిలో భోజనం తిరుత్తనినుండి పూనిమాంగాడు, నల్లత్తూరు వెళ్ళితిమి. (మణిమంజరి 2 సంపు. 2వ సంచిక) సైపద్యము ప్రతిమను చూచి ప్రభాకరులు ఆశువుగా చెప్పినది

**ముక్త్యాల మ్యూజియము :** 1949లో ముక్త్యాల రాజావారి తోడ్పాటుతో ఆ చుట్టుపట్టులం దున్న ప్రాచీన శిథిలశిలాఖండాలను ముక్త్యాల గ్రామానికి చేర్చినారు. అక్కడకూడా ఒక మ్యూజియము ఏర్పాటు చేయాలని శాస్త్రిగారి తలంపు ఇక్ష్వాకులనుండి కాకాతీయుల పర్యంతమూ గల శిల్పాలను, శాసనాలను సేకరించుటయే కాక, కాకతమ్మ - సేనాపతి జాయప్ప - తాడిముత్తా వీరడు మున్నగువారి శిలామూర్తులు సేకరణలో ఉన్నాయి. ప్రాగైతిహాసిక (pre historic) సమాధులను త్రవ్వించి, అందులో లభించిన వస్తువు లన్నీ ఒకచోటికి చేర్చినారు. శిథిలావశేషాలను గురించి క్రొత్త సంగతులెన్నో వివరించారు. ప్రభాకరులకు బౌద్ధస్తూపాలన్నా, బౌద్ధాంధ్ర కళలన్నా మక్కువ ఎక్కువ. ప్రాచీన శిల్పకృతుల పరిశీలనాభిలాషకు హద్దులు లేవు.

ప్రభాకరశాస్త్రిగారు దివంగతు లగుటకు నాలుగురోజుల ముందు, తెనాలి చేరువనున్న యద్దనపూడికి వెళ్ళినారు ముమ్మరంగా వర్షాలు కురుస్తున్న రోజులు ఊరంతా బాడీ బంద అయినా తా మొక్కరే వెళ్ళి, ఆ ఊళ్ళో పాడుబడ్డ బావిలో అపూర్వ విగ్రహా లున్నాయని ఊరివారికి చెప్పి, అవి వెలికి తీయించారు ఆగ్రామంలోవాళ్ళ కాసంగతి తెలియనే తెలియదు దొరకిన వన్నీ అపురూప శిల్పాలు ఆరోజు యస్ దాశరధిగా రింట మకాం వీరిప్పుడు ఆర్కియాలజీశాఖలో డిప్యూటి డైరక్టరుగా హైదరాబాదులో ఉంటున్నారు ''శాస్త్రిగారికి శిల్పసేకరణలో ఉన్న దీక్ష, తత్పరత, ఎన్నికష్టా లెదురుపడ్డా వారి పట్టుదల తల్చుకొంటే ఇప్పటికీ నా కాశ్చర్యం వేస్తుం దన్నారు '' దాశరధిగారు నాతో ప్రసంగిస్తూ

మ్యూజియం వస్తుసేకరణలోనే వారు ఆరోగ్యం కోల్పోయి 29 8 1950 మధ్యాహ్నం భౌతికం వీడినా రంటే గుండెనీరవుతుం దెవరికైనా

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్ర కళాలక్ష్మికి అందాలు దిద్దిన మహాశిల్పి వారు పరమపదించుటతో అవన్నీ ఆగిపోయాయి కొన్నేళ్ళకు తిరుపతిలో మాత్రం మ్యూజియం ఏర్పాటయింది. అయితే ఆ శిల్పాలు, వ్యాఖ్యానం లేక మూగవోయినాయి. చివరిక్షణం వరకూ సంస్కృతి పోషణకూ పరిశోధనకూ అంకితమైన కారణజన్ములు ప్రభాకరులు

# 20. మహామనీషి 'వేటూరి'

ప్రభాకర శాస్త్రిగారి సాహిత్యసృష్టి శతపత్ర సుందరంగా, యోగసాధన సహస్రదళ పద్మంగా వికసించి, పరిమళించి పరస్పరసమ్మేళనంతో తెలుగునాటికి తెలుగుజాతికి క్రొత్తసుగంధాలను సరిక్రొత్త ప్రభలను అందించింది సారస్వతయోగిగా యోగప్రభాకరుడుగా పరిణామ రమణీయంగా ఎదిగి ఓజోవంతంగా ప్రకాశించిన మహావ్యక్తి, మహామనీషి. ఆయన మనీషకు ప్రతిభ తోడయినది నిరంతర గ్రంథపరనానికి అవగాహన జతపడినది ధారణ సమన్వయశక్తితో బాంధవ్యం నెరపింది సద్యఃస్ఫురణ మెరుగులు దిద్దింది ఎడతెరిపిలేని పరిశ్రమ అపూర్వఫలితాలను అందించింది సర్వసాహిత్య ప్రక్రియలందు వారి ఉపజ్ఞాబలం ప్రవర్తించింది పరిశోధన పరివ్యాప్తులకూ ప్రాచీన గ్రంథపరిష్కరణకూ మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పండిత పదవి చేయూత నొసగింది. సాహిత్య వినోదాన్ని యోగానందాన్ని పుష్కలంగా అనుభవించిన పూర్ణపురుషులు శాస్త్రిగారు.

అర్ధశతాబ్దికాలం (1900-1950) అవిశ్రాంతంగా సంస్కృతికి - సాహిత్యానికి - చరిత్రకు - కళలకు అలుపులేకుండ చేసిన సేవ, అంచనా వేయాలంటే దాని నేపథ్యమూ పరిసరవాతావరణమూ జ్ఞాపకం చేసుకోవలసి ఉంది. ఒక పల్లెటూళ్ళో సంప్రదాయబద్ధమైన సామాన్యకుటుంబంలో పుట్టిన ప్రభాకరశాస్త్రిగారు, గురుకులక్లిష్టంగా సంస్కృతాంధ్రాలు నేర్చుకొన్నారు. తెలుగంటే చిన్నతనంనుంచి వెఱ్ఱి తీపి. శతావధాని చెళ్ళపిళ్ళవారికడ శిష్యరికం కవనశక్తికే గాక భాషాప్రయోజ నావగాహనకూ పదును పెట్టింది. ఆ ఉరవడిలో చిన్నతనంలో శతావధానాలు, అష్టావధానాలు చేయకపోలేదు.

మదరాసు రాకతో అక్కడి ఆంగ్లవిద్యాధికులైన మేధావులతో - విద్యావంతులతో విజ్ఞానధనులతో పరిచయ సాహచర్యాలవల్ల శాస్త్రిగారి

దృక్పథంలో గొప్ప మార్పు వచ్చింది. ఇప్పు డాయనకు అవధానాలు లక్ష్యం కాదు విస్తృతభాషా ప్రయోజనాలకు ఏప్రక్రియలు సహకరిస్తాయో వాటిని ఎన్నుకొని, ఆమార్గంలో నడువ సమకట్టినారు శ్రీమాన్ పనప్పాకం అనంతాచార్యులవారు గొప్ప న్యాయవాది, సాహితీచతురుడు వారే శాస్త్రిగారికి తొలి ప్రాపు ఆయన ప్రభాకరుల కవితాపాటవాన్ని మెచ్చుకొని 'కవిచూడామణి' అన్నారు వేపా రామేశం పంతులుగారు విద్యారాశి బహుశాస్త్రముల లోతు లెరిగినవారు వారితో సన్నిహితత్వము పరనాసక్తిని, విజ్ఞానపరిధిని విస్తరింపజేసింది డా ఆచంటలక్ష్మీపతి, పండిత డి గోపాలచార్యుల స్నేహసహచర్యము అభ్యుదయ పథంలో అడుగు వేయటానికి స్ఫూర్తి నిచ్చింది అట్లే టంగుటూరి ప్రకాశం పంతులు, అయ్యదేవరకాళేశ్వరరావు, భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి వంటి రాజకీయనాయకులతోడి పరిచయం లోకాన్ని దగ్గరగా అనుశీలించటానికి ఉపకరించింది ఇక పండితులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి పంతులు, వేదము వేంకటరాయశాస్త్రి మున్నగు వారితో సన్నిహిత మైత్రి సాహచర్యాలు నూతనావిష్కారాలకు, శోధనకూ ఉద్దీప్తి నిచ్చినవి. మానవల్లి రామకృష్ణకవిగారితో కలసి ఉద్యోగంచేయటం, వారి సాహిత్యపరిశోధనకాంక్షకు మరింత ప్రేరణ అయింది సహజంగా విద్యావ్యసని అయిన ప్రభాకరులకు ఈ వాతావరణము, పెద్దల ప్రోత్సాహము, బాల్యంనుండి వారిలో నున్న ఆత్మవిశ్వాసము, చొరవ, కార్యనిర్వహణనిపుణతలకు ఉత్ప్రేరకా లయినాయి వా రెన్నుకొన్న పరిశోధన రంగంలో సాహిత్యవిమర్శలో చరిత్రాది రంగాలలో ప్రవేశించి వాటి అంచులు తాకినారు ప్రతిభావంతంగా

క్రమంగా సామాజి కావగాహన, భాషాతత్త్వపరిశీలన మూలంగా వారిలో అత్యాధునికములైన విప్లవ భావములు పొడచూపినాయి. వాటి ఫలితంగా పరిశోధన రంగంలో క్రొత్త దారులు తీయటానికి సాహసం చేయగలిగారు. పండితు లెవ్వరూ సాహసించని అనాదృత వాఙ్మయాన్ని అవలోడించి, వాటి ప్రయోజనాలు నిరూపించినారు విస్మృతవాఙ్మయరాశిని వెలికితీసి చూపినారు హేతుబద్ధత, శాస్త్రీయ నిబద్ధతలు తోడు కాగా, సాహిత్యాన్వేషణలో క్రొత్తవిషయా లెన్నో కనుగొన్నారు 1910నుండి గిడుగువారి వ్యావహారికభాషావాదంలో ఇమిడిఉన్న ప్రయోజనాలను గుర్తించి, అప్పుడే గిడుగువారుకూడా ఎరుగని సంగతి వెల్లడించుటే కాదు, ప్రాచీనుల గద్యరచనలో వాడిన దంతా వాడుకభాషే అనీ, దానిని గ్రాంథికభాషలో తర్జుమాచేసి పుస్తకాలు ప్రచురించిన వారు భాషకు అపకారం చేస్తున్నారనీ, ప్రభాకర శాస్త్రిగారు తెల్పినట్లు గిడుగు సీతాపతిగా రొక వ్యాసంలో

వ్రాసినారు[1]. శాస్త్రిగారి శోధన సాధికారికంగా ఉంటుంది. వ్యావహారికభాషలో కొన్ని రచనలు చేసిచూపినారు. వ్యావహారికభాషను నాటకానువాదాల్లో, స్వతంత్ర నాటకంలో ప్రయోగించినారు.

పరిశోధన రంగంలో - కవితాసృష్టిలో - విమర్శవిధానంలో - శాసన పరిష్కారాల్లో శబ్దార్థ విచారణలో - జానపదవాఙ్మయ సముద్ధరణలో - ఇంకా కొన్ని రంగాలలో వారి సాహిత్య వరివస్యను సమీక్షిస్తే, భారతీయసాహిత్యనిర్మాతలలో ప్రభాకర శాస్త్రిగారి స్థాన మెంత పటున్నైనదీ నిరూపిత మవుతుంది

(1) శ్రీనాథ మహాకవి చరిత్ర 'శృంగారశ్రీనాథ' మనుపేర చరిత్ర, సాహిత్య, శాసనాధారాలతో సర్వసమగ్రగ్రంథంగా రచించారు అంతకు ముందు సమగ్రావగాహనతో రచించిన గ్రంథం లేదు దీనితో రెడ్డిరాజుల చరిత్రకు పునాదులు వేసినారు. (2) ఆంధ్ర సారస్వతంలో 'శైవకవితాశాఖ' ఒక టున్నదని, వెలికితీసి దాని విశిష్టతను మొట్టమొదట నిరూపించింది శాస్త్రిగారు. అంతకు ముందు పండితు లెవ్వరూ గుర్తించలేదు (3) వైష్ణవాంధ్ర సాహిత్యంలో తాళ్ళపాక అన్నమాచార్యులు, తద్వంశీయులు చేసిన రచనల ప్రచురణతోపాటు, అన్నమాచార్య చరిత్ర పీఠికను కూలంకుష పరిశోధనతో రచించి, ఆశాఖ సాహిత్యానికి హారతులు పట్టినారు (4) తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క రచించిన సుభద్రాకళ్యాణాన్ని ప్రచురించి, ఆమె చరిత్రను వెల్వరించిన ఘనత వీరిదే (5) తంజావూరు, మధుర సారస్వత ద్వారాలను తెరచి చూఅ లిచ్చిన తొలి వాఙ్మయ పరిశోధకులు (6) అట్లే సి పి బ్రౌనుదొర సాహిత్య సేవను గూర్చి 1911లోనే తొలుత ఎఱుకపరచుట (7) భాషాసాహిత్య పరిశోధనకు పంటపొలాలవంటి - ఆకరగ్రంథా లనదగిన గ్రంథవివరిణికలు 19 సంపుటాలను సంధానించుట ఇది అసామాన్య కృషి. వాటి ప్రణాళిక ప్రతిభామూలక మైనది (8) రంగనాథ రామాయణ, క్రీడాభిరామాది కర్తృత్వ చర్చల్లో, నన్నెచోడుని కాలనిర్ణయంలో నిర్ణయాలు వారి ధిషణ, విచక్షణతలను వెలువరిస్తున్నాయి (9) తెలుగు పదము తొలిసారిగా క్రీ.శ. 1, 2 శతాబ్దాలలో ఉన్నదని 'నాగబు' శాసనం చదివి నిష్కర్ష చేసినారు. అట్లే అహదకరశాసనంలో 'వింతయక్కరము' కలదని నిరూపణ దీనిపై కొన్ని వివాదాలు లేకపోలేదు కాని ఎవరూ ఈవాదాన్ని త్రోసివేయ లేకపోయినారు. (10) తంజావూరు రామస్వామి దేవాలయంలో దేవతల విగ్రహాలతోపాటుగా ఆనాటి పాలకుల విగ్రహాలుకూడ ఉన్నట్లు గుర్తించిన ప్రతిభాచక్షువు. అట్లే తిరుమలలో

1 ఆంధ్ర దినపత్రిక 30 8.1950.

అన్నమాచార్య అర ద్వారస్తంభాలపై ప్రతిమలు అన్నమాచార్య, పెదతిరుమలాచార్యులవని, అక్కడి నేలమాళిగలోని సంకీర్తనపు రాగిరేకులతోపాటు, లభించిన ఉబ్బెత్తు శిల్పం ఆధారంగా నిరూపించుట. అప్పటిదాకా అవి ద్వారపాలకులవని భ్రమించారు. (11) సుగ్రీవవిజయపీఠికలో 'యక్షగాన వాఙ్మయపు లోతులను తరచినారు అనంతర పరిశోధకుల కిది ప్రేరణ అయినది (12) పరిశోధనకు ఆధారగ్రంధాలు కావలెనని ముందుచూపుతో కొన్ని ప్రచురించినారు 'ప్రబంధరత్నావళి' ఆదిశలో వచ్చినదే ఈ ఒక్క ప్రచురణవల్లా 54 క్రొత్త కావ్యాలు సర్వప్రధమంగా లోకానికి తెలిశాయి చాటుపద్యమణిమంజరి రెండు భాగాలు ఆ కోవలోనివే (13) జానపద వాఙ్మయపు విలువలు గుర్తించి 'కాటమరాజు' కథ పరిష్కరించి ప్రచురించుట (14) ఒకే చేతిమీదుగా ఇరువదిమూడు ప్రాచీన గ్రంథాలు పరిష్కరించుట, ప్రచురించుట మరి పదింటిని కూడ పరిష్కరించి పెట్టుకొన్నారు (15) కందుకూరి రుద్రకవి అష్టదిగ్గజాలలో నొక్కడని, ఈశాన్యదిక్కునకధిపతి అని ఆధారాలతో నిరూపణ. (16) కృష్ణదేవరాయలకు 'కమల' అను మూడవ భార్య కలదని నిరూపణ (17) ఇంతకు ముందు తెలుగు వ్యాకర్త లెవ్వరూ నిరూపింపని మ, వల వినిమయము, శిధిలద్విత్వనిరూపణ శాస్త్రిగారి నూతనావిష్కారాలే (18) ఆంధ్ర లిపి సంస్కరణకు సూచనలు (1928) మౌలికతను తెల్పుతున్నాయి. లిపిశాస్త్ర నిపుణులగుటచే ఈసూచనలు విస్తృత భాషా ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని చేయగల్గినారు.

ఇక చరిత్ర రంగంలో 'ఇక్ష్వాకు'లాంధ్రులని నిరూపించుట. ప్రాగైతిహాసిక, సమాధులు త్రవ్వించుట, కాకతమ్మ - జాయపసేనానుల విగ్రహాలు త్రవ్వించి వెలికి తీయుట వారి పురాతత్త్వ వివేచనకు తార్కాణాలు పుదుచ్చేరి గవర్నర్ డూబ్రేల్ దొర వీరిని పిలిపించుకొని, దుబాసి ద్వారా పురాతత్త్వశాస్త్రంపై, శిల్పకళా రీతులపై సందేహనివృత్తి చేసికొనటం (1928) మరొక ఉదాహరణ

ఇనుప గుగ్గిళ్ళవంటి కొఱుకుడు పడని నాచసోముని 'ఉత్తరహరివంశ' పద్యాలు వ్యాఖ్యానించుట వారి పాండితీప్రగల్భతకు వ్యుత్పత్తికి నిదర్శనం వ్యాఖ్యాన రీతిలోకూడ కొన్ని విన్నూత్న పద్ధతులు ఉపజ్ఞామహితంగా ప్రవేశపెట్టినారు

మధురకవితాప్రాభవం చాటే పది లఘుకావ్యాలను సమకాలికేతి వృత్తాలతో అల్లినారు పూర్వకవి చర్వణంవల్ల ప్రభాకరులు వాక్ప్రయోగదక్షు లైనారు. అందు వల్లనే వీరి కావ్యప్రయోగాలు నన్నయ, తిక్కనాదులతోపాటు వేదం వారు తమవ్యాఖ్యానాల్లో ఉట్టంకించినారు. శాస్త్రిగారి ప్రామాణికతకు పట్టిన దర్పణమిది

ఇంకాక మానవాంతస్సులను వెలిగించే కవితా ఖండికలు శతాధికంగా ఉన్నాయి

ప్రాచీన గ్రంథసేకరణకై జీవితం ధారనోసిన సాహిత్య తపస్వి గ్రంథపరిష్కరణను ఒక కళగా దిద్ది, క్రొత్తపద్ధతులను రూపొందించిన విద్వాంసులు కల్నల్ మెకంజీ సేకరించిన 'లోకల్ రికార్డు'లు కన్నుపొడుచుకొని పరిశీలించి, వాటి చారిత్రక ప్రయోజనాలను గుర్తించి, ఆ స్థానికచరిత్రలు కొన్నైనా ప్రచురింప బూనుకొన్న చరిత్రజ్ఞులు

జనుల నాలుకలే నివాసాలుగా ఉండి, గ్రంథస్థము కాని తెలుగు పలుకుబడులు, నుడికారాలు, నానుళ్ళు, లబ్జులు, ఊళ్ళునాళ్ళపేర్లపై వచ్చిన జాతీయాలు సేకరణకై కృషిచేసి, భాషలోని మౌలిక పదజాలం నిలువరించాలని ఒక ఉద్యమంగా పనిచేసిన దూరదృష్టి వారిది ఊరూర ఏండ్ల తరబడి తిరిగి సేకరించిన పదాలరాశిని 'గాలికబుర్లు' పేరిట వ్యాకరించి, అమరంలా వర్గీకరించి పెట్టుకొన్నారు. అదంతా అముద్రితం. సర్వవ్యవహారాలు మాతృభాషలో జరగాలని ప్రభుత్వాలు నిర్ణయించుకొని ప్రవర్తించినపుడు, వీటి విలువ మరింత తెలుస్తుంది పదకోశాల నిర్మాణాలు తలపెట్టని రోజులలో జరిగిన కృషి యిది

ప్రభాకరులు పరిష్కరించిన గ్రంథాలలోని అపూర్వపదాలకు వందల కొలదిగా ఉన్నవాటికి అర్థనిర్ణయాలు చేశారు. అందులో చాలా పదాలు ఇప్పటికీ నిఘంటువుల కెక్కలేదు ముడివీడని గ్రంథగ్రంథులకు ముడులు విప్పిన శబ్దవేత్త. అర్థవిచారణలో వారి మనీష అసదృశం. అర్థాలు సాధించటానికి శాసన ప్రమాణాలను, సంప్రదాయాలను చూపిన ప్రతిభామూర్తి

బాలభాషనుండి బ్రహ్మవిద్యవరకు లోతులు తరచిన మహామనీషి సంస్కృతికి మూలకందమైన చిత్రవస్తు ప్రదర్శనశాలకై అపూర్వశిల్పాలను సేకరించి ఆంధ్రకళాలక్ష్మికి అందాలు దిద్దిన రూపశిల్పి.

నిగ్గుదేరిన వచన రచయిత, పురాతత్త్వవేత్త, విమర్శకాగ్రేసరుడు, సంకలన గ్రంథసంధాత, శాసన పరిష్కర్త, జానపద వాఙ్మయోద్ధారకుడు, చరిత్ర పరిశోధకుడు, బహుభాషావేత్త, పరిశోధక పరమేశ్వరుడు, లిపిశాస్త్ర ప్రవీణుడు, లోకవృత్త పరిశీలకుడు, కవివతంసుడు, మ్యూజియం వ్యవస్థాపకుడు, శబ్దవేత్త, పరిశోధన కాకర గ్రంథములు నిర్మించిన భాషావిదుడు ప్రభాకరశాస్త్రిగారు. రాశిలో, వాసిలో ఇంతటి సాహిత్యకృషి సల్పిన శాస్త్రిగారు, భారతీయ సాహిత్య నిర్మాతలలో సమున్నత స్థానమందిన అగ్రేసరులలో ఒక్కరు ఇన్ని రంగాలలో ప్రథమగణ్యమైన కృషిచేసిన వా రుండుట అరుదు.

ప్రభాకరశాస్త్రిగారు 'ప్రాజ్ఞహృదయాబ్జరవి' అవిశ్రాంత మందాకిని వీనుమిగిలిన విద్వాంసులు

విద్యార్థిగా తిరుపతి వీడి వచ్చేముందు, మాకన్నీటితో వారిపాదాలు తడిసిపోయాయి. అప్పుడు నాలో మెఱసిన మెఱపు తునుక

ఒక మధురక్షణమ్మె గురు
తున్నది జీవసంధ్యలో సము
త్సుకత గురూత్తముండు సుమ
సుందర హస్తములన్ స్పృశించి, యం
గకముల దివ్యదీప్తుల ప్రకంపితు
జేసిన వేళ కాంతి వ
ల్లిక యెద నాటె, తన్మధుర
లీల మనంబును బాయకుండగన్

## 21. ప్రభావళి

ప్రభాకరశాస్త్రిగారు మహామనీషి మానవతావాది కూడా. గౌతమబుద్ధునిలా ఆయన కరుణామయుడు. దయ, సానుభూతి ఆయన జీవసూత్రాలు. ఆర్తసేవ ఆయన ప్రాణమూలము. బంధువులు చుట్టూ ఉన్నవారూ, వద్దని వారించినా, తీవ్రఅనారోగ్యంతో ఉండికూడా ఒకవృద్ధురాలి బాధను పోగొట్టుటకై, తుదిశ్వాస విడిచే ముందు కూడా 'ట్రీటుమెంటు' చేసిన కరుణాసాగరుడు దేశసమస్యలకై యోగశక్తు లొడ్డిన దేశభక్తుడు గాంధీమహాత్ముడు 1943లో ఆమరణ నిరాహారదీక్ష పూనినపుడు, ఆయనపడ్డ వేదన, ఈనాటికీ కళ్ళకు కడుతుంది తలుచుకుంటే. విశ్వశ్రేయస్సుకై తపించిన మహర్షి, కృష్ణకు వరదలువచ్చి, ప్రజ అల్లాడిపోతుంటే పరితపించి, అప్పటి కప్పుడే పత్రికలలో ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ తమ ఆందోళనను వ్యక్తపరచిన స్పందనశీలి. భారతజాతీయోద్యమాన్ని సమర్థించారు. మాష్టరు సి.వి.వి., మహాత్మాగాంధి ఇర్వురే శాస్త్రిగారిని ప్రభావితుల్ని చేసిన వారు బాపూజీ మరణానంతరం మద్రాసు రేడియోనుండి చేసిన ప్రసంగం, అంతరాంతల్లోనుంచి త్రోసుకు వచ్చి ఉబికింది. అది నిజమైన కవిత్వ మనిపించిం దన్న పెద్ద లున్నారు. శ్రోతలను కంటతడిపెట్టించిన ప్రసంగం.

శాస్త్రిగారు, పరమ గురువులు మాష్టరు సి.వి.వి. చరణములు సమాశ్రయించి నప్పటినుండి వారి అంతరంగం క్రొత్తమార్పునకు లోనయి, అంతర్ముఖ సమారాధ్యతకు లోగినది. అందువల్ల దేనిపైనా వారికి వ్యామోహం లేదు. ఇహలోక బంధా లేవీ బాధించ లేదు. నిమిత్తమాత్రుణ్ణి అని అనుకొనేవారు. మేరుగిరి అంతటి వాఙ్మయసేవ చేసినా వారిధోరణి నిరహంకారంగానే ఉండేది. అందుకు వారి మాటలే సాక్షి ''తెలుగులో నేదో కొంత తంటాలు పడితి ననుట తథ్యము. ఆంధ్ర వాఙ్మయసౌధ నిర్మాణకారులలో నొకడ నగుదు నని, కొన్నాళ్ళు కూలిపని చేసి మట్టిముద్దలు మోసితిని. చేతులు కడుగుకొను దశలో నిప్పు డున్నాను'' అదీ, వారి వినయోక్తి. వారి సాహిత్య సేవ కొండంత ఉన్నా, పూర్తికాలము వినియోగింపలే

దంటూ స్వీయచరిత్రలో ''బ్రదుకు సాగించుకొనుటకు వాఙ్మయ, సేవ సాధనముగా నా కేర్పడినది గాన, అందులో అరకుడుపు సాగునట్లు పనిచేయుటకే నా అంతర్యామి నన్ను మెసల నిచ్చినది గాని, యంత కెక్కువ పనిచేయుటకు గాని, యంత కెక్కువగా సాధించుటకుగాని నాకు చోటియ్యకే పోయెను'' అని వ్రాసుకొన్న నిగర్వి 'విమర్శకాగ్రేసర' బిరుదాన్ని నరసరావుపేటలోని సారస్వత సంఘం ఇచ్చిన సభకు శాస్త్రిగారు వెళ్ళలేదు వారికి వ్రాసినలేఖలో విషయాలు గమనింపదగ్గవి ''సన్మానాలూ బిరుదాలూ మత్తుపదార్థాల వంటివి వీటితో విఱ్ఱవీగితే నేనింతవాడ ననే గర్వమును రేకెత్తిస్తాయి. ఈ మత్తులో ఏపనీ సాగదు. అయినా నాకీ బిరుదా లేమిటి ?'' (ప్రభాకరస్మారిక - (సంపు 171 పుట)

శాస్త్రిగారు నిర్వేదం పొందిన పరిస్థితులు లేక పోలేదు అయినా వారి సారస్వత దీపం ఎప్పుడూ కొడిగట్టలేదు ఒక చాటుధార వివరిస్తోంది ఇట్లా

చదివితి కష్టముల్ సయిచి శక్తికొలందిని సంస్కృతాంధ్రముల్
పదువురు మెచ్చున ట్లుభయభాషలయందుఁ గవిత్వ మల్లుదున్
జదివిన లాభమున్ గవిత సల్పిన లాభము నెంచి చూడఁగాఁ
దుదకొక పొట్టకేని సరితూఁగని వేతన మేమి చెప్పుదున్

ఇట్లా నైరాశ్యమే యెదురైనా, దాని నడుపులో నుంచినది యోగానందము నిజ జీవితంలో కొంత నలిగులిపాటు ఉన్నా, జీవితలక్ష్యము చెదరని ధీరాగ్రణి. సాహిత్యంలో వలెనే, కఠోర యోగసాధనలోకూడా ఎప్పుడూ ఆయన దీక్ష సడల లేదు. సాహిత్యానందాన్ని అనుభవిస్తూనే, యోగానందము వారి జీవిత సర్వస్వాన్ని ఆవర్జించుకొన్నది.

ప్రభాకరులు ఎంత హృదయవాదో అంత హేతువాది ఎంత నవనీత హృదయులో అంత విశుద్ధ తార్కికులు. వారిది పరిశోధనప్రవణమైన చిత్తవృత్తి, అది గ్రంథపరమూ కావచ్చు, ఆత్మశోధనపరమూ కావచ్చు.

సృజనాత్మక రచనలవల్ల భాషకు సౌష్ఠవం సమకూడినట్లే, మరుగున పడిన రచనలను వెలుగులోకి తేవడంవల్ల భాష పరిపుష్టి చెందుతుందని గ్రహించిన వేత్త

శాస్త్రిగారు మంచి వక్త. ప్రసంగాలు శ్రోతృజన రంజకాలు వైష్ణవతత్త్వం మీద వారు రెండు దినాలు ప్రసంగాన్ని విన్న జిజ్ఞాసువు. 'రెండు దినములు మేము బ్రహ్మానంద మనుభవించితిమి. తాము వైష్ణవలోకమునకు మహోపకార మొనర్చి'రని కొనియాడినాడు. కావలిలోనూ, రాజమహేంద్రవరంలోనూ శ్రీనాథుని కవితావైభవంపై చేసిన ఉపన్యాసములు ఆకవి లోతులను తరచినవి. శ్రోతలు

విన్నంతసేపూ ఆనందంలో ఓలలాడేరంటే అతిశయోక్తి కాదు

**ఆత్మాభిమాని :** ఒరుల నాశ్రయించుట ఆయనకు గిట్టని సంగతి. చల్లపల్లిరాజావారి పట్టాభిషేకోత్సవం పద్యాల్లో 'హితుఁడనే కాని నీకు నాశ్రితుడఁగాను' అని చెప్పుకొనుట ఒక సాక్ష్యము సహజంగా శాంతస్వభావులే అయినా, అన్యాయమూ అనుచితమూ అని తోచి నప్పుడు మాత్రం సహింపక ఉద్రిక్తత చూపేవారు. అది ధర్మాగ్రహం

ప్రభాకరుల ఆత్మాభిమానం తెల్పే ఒక ఉదంతం వివరిస్తాను 1950లో ప్రధమాంధ్రాస్థానకవి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు నిర్యాణం చెందగా, ఆపదవికి వేటూరి వారిని ఎంపిక చేద్దామన్న తలంపు ప్రభుత్వ వర్గాల్లో వచ్చింది ఒక మంత్రి వీరి పేరు సూచించటంకూడా జరిగింది. అలా ఉండగా ఒక సన్నిహితుడు శాస్త్రిగారితో ఫలానావారిని మీరు మర్యాదగా ఒకసారి చూస్తే బాగుంటుందని సూచనప్రాయంగా చెప్పాడు. శాస్త్రిగారు సహజంగా ఆత్మగౌరవానికి విలువయిచ్చే వ్యక్తి. 'మీరు చెప్పినవారు నన్నెరుగనివారు కారని చెబుతూ, నే వెళ్ళి అడిగితే ఇచ్చేపదవి 'ఆస్థానకవిపదవి' ఎల్లా అవుతుంది' అంటూ దాన్ని త్రోసిపుచ్చారు, దానికై వెంపర్లాడేవా రెందరో ఉన్నరోజుల్లో[1]! ఎంతటి శక్తియున్నను ఆకుమూల పిందెవలె నణగి యడకువతో తన పాండితీ ప్రతిభలు దాచుకొన్న పండితుఁడు ప్రభాకరశాస్త్రి'' అన్నారు మధునాపంతులవారు తమ 'ఆంధ్ర రచయితలు' గ్రంథంలో.

**కృతజ్ఞత :** శాస్త్రిగారు పరిశోధనలో ఎంత సత్యనిష్ఠులో, పూర్వుల కృషిని కృతజ్ఞతాపురస్సంగా స్మరించటంలోనూ అంత శ్రద్ధాళువులు. ఒక పదం గాని, శ్లోకం గాని, వాక్యం గాని, వాక్యలేశం గాని ఇతరులదగ్గర నుండి గ్రహిస్తే, ఆయా సందర్భాల్లో వారిని గౌరవంతో స్మరించకుండా ఉండరు. ఆ నిజాయితీ శాస్త్రిగారి దగ్గర పుష్కలంగా ఉంది.

ప్రభాకరుల ప్రసంగాలను గురించి ముచ్చటిస్తూ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆనందంతో 'శ్రీనాథ, పోతన, సూరన, తిక్కనలవంటి మహాకవులలోని అందచందములు, కవితా విశేషములు వింటే ఆయన వల్లనే వినాలి' అన్నారు.

సాహితీపోషకులైన ముక్త్యాల సంస్థానాధీశులు శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దరువారు, కపిలేశ్వర పురాధినాయకులు (తూ.గో

1. డా. తిరుమల రామచంద్ర చెప్పినది.

జిల్లా) జమీందారులు (శ్రీరాజా బలుసు బుచ్చి సర్వారాయబహద్దరు వారు ప్రభాకరశాస్త్రిగారి యెడ మిత్రభావము చూపి, ఆప్తత నెరపిన సరసహృదయులు. శాస్త్రిగారి పరిష్కృత గ్రంథాలు కొన్ని వారిరువురూ ప్రచురించారు.

ఏవేని పొరపాట్లకు, ప్రసిద్ధులైన విద్వాంసుల నెవరేనా గర్హిస్తే ఆయన సహించేవారు కాదు ఎంతగానో బాధపడేవారు. వారే ఏమన్నారో చూడండి ''అల్పపు వేతనముతో భుక్తి గడుపుకొనుచు నితరలాభము నెఱుఁగక యాయుష్కాల మెల్ల నాంధ్రభాషాభ్యుదయమునకై ధారవోసిన మహనీయులను చిన్నయసూరిని, సీతారామాచార్యులను దెగడుచున్న వారినిగూర్చి నేను మిగుల వగచుచున్నాను '' తగినంత గ్రంథసామగ్రి దొరకని కాలమున, వ్యాకరణములను రచించిన పయిపండిత ద్వయమును దలఁచుకొన్న నాహృదయము జలదరించును (చూడు ప్రాచీనాంధ్ర శాసనములుప వ్యాసం) అదీ ఆజీవుని వేదన !!

ఏ 'యూనివర్సిటీ డిగ్రీ'లూ లేకున్నా స్వప్రతిభవల్ల సంస్కృతాంధ్రాల్లో, మరికొన్ని భాషల్లో గొప్ప పాండిత్యం, పరిశోధన పాటవం, మధుర కవితా ప్రాభవం, శాసనలిపి పరన సామర్థ్యం, పురతత్త్వ శాస్త్ర - శిల్పకళా రీతులలో వైదుష్యం సంపాదించి కీర్తి గడించిన మహనీయులు ప్రభాకరులు ప్రామాణికత, సత్యనిష్ఠలకు ఆయన హృదయం నెలవు. పరమగురువుల అనుగ్రహం వజ్ర కవచంలా ఉండటం వల్ల ఆయన ఎప్పుడూ నిర్భీకుడు. సచ్ఛీలత, దేశాభిమానము, సర్వధర్మ సమభావము, సత్యతత్పరత, ప్రేమార్ద్ర హృదయం ఆయన వ్యక్తిత్వానికి ఆమ్రేడితా లైనాయి నమ్మినదే వ్రాయగల రచయిత

**సమకాలీనుల ప్రశంసలు :** 'ఉదారచరితులకు మనలో ప్రభాకరశాస్త్రిగారు మంచివరవడి' - కథక చక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నివాళి.

'ఆంధ్రప్రభ' సంపాదకులు, గొప్ప హేతువాది నార్ల వేంకటేశ్వర రావుగారు 'ఆయన నిజంగా అమృతహృదయుడు. కొందరు మహామహుల సమక్షంలోకి వెళ్ళినపుడు మన సంకుచిత భావాలకు మనము లోలోపల సిగ్గుపడతాము. అట్టి మహామహుల కోవకు చెందిన వారు శాస్త్రిగారు' అన్నారు.

శాస్త్రిగారి మనస్తత్వాన్ని - మహా మనస్వితను బాగా దగ్గరవుండి ఆకళించుకొన్న విద్వాన్ విశ్వంగారి మాటలు ఆణిముత్యాల పేటలు ''ఆయన ఆధ్యాత్మిక జీవితం నాకు తెలుసు. కులపతిలాంటి ఆయన పాండిత్యప్రకర్ష నేనెఱుగుదును. భరతునిలాంటి ఆయన రసప్రలుబ్ధత నాకు తెలిసిందే... ఆయన పరిశోధన లోతులు నాకు పరిచితమైనవే. ఈ అన్నిటి కన్న ఆయనలోని ఆర్ద్రహృదయత నన్ను వినమ్రుని చేసివైచినది వారి మానవతాదృష్టి, సచ్ఛీలం, ఆ నిష్ఠుర యోగసాధన - అవే నన్ను ఆయనకు నిత్యం నమస్కరించేటట్టు చేస్తున్నవి.''

''యోగంతో చిత్తాన్ని, పదశాస్త్రంతో భాషను, వైద్యశాస్త్రంతో దేహాన్ని పరిపూతం చేసిన పతంజలిలంటి మహనీయులు వేటూరి ప్రభాకరులు'' - ప్రసిద్ధ పత్రికా రచయిత డా తిరుమల రామచంద్ర.

''తాము విన్న ఏబిచ్చుగాంధ్ర పాటను గురించో, తమ చెవిన పడిన ఏ నుడికారాన్ని గురించో, తమకు దొరికిన ఏతాళపత్ర గ్రంధాన్ని గురించో, తాము చూచిన ఏప్రాచీన శిల్పాన్నిగురించో వారు తన్మయులై ప్రసంగిస్తుంటే కవిత్వం ఏ రక్తాణువులోనూ లేనివాడైనా ఉత్తేజితుడై పోతూవుండేవాడు''

- ఆంధ్రప్రభ సంపాదకీయం 31 8 1950.

అదే పత్రిక సంపాదకీయం కొనసాగిస్తూ సప్రేమతో, వాత్సల్యంతో, కారుణ్యంతో, గట్లను వొరసుకొనే - కాదు - గట్లను త్రెంచుకొనే హృదయం వున్న వారు మరొకరు తటస్థించడం బహుకష్టం. ఇందువల్లనే సాహిత్యసేవకునికంటె మిన్నగా, కళారాధకునికంటె మిన్నగా సహృదయుడుగా, సౌజన్యశీలుడుగా ఆయన మాకే కాక, లోకానికి కూడా అధిక పూజనీయుడు'' అని నీరాజనం పట్టింది.

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి రాజమన్నారు, శాస్త్రిగారి భాషాసేవను శ్లాఘిస్తూ 'శతాబ్దాల తరబడిగా నిర్లక్ష్యం చేయబడ్డ మన సాహిత్యం గురించి పరిజ్ఞానం కలిగించడానికి ఆయన నిర్వర్తించిన అమోఘ కృషికి ఉద్ధరించిన అన్నమాచార్య పదాలు తార్కాణం మాత్రమే' అన్నారు

జయపుర సంస్థానాస్థానకవి త్రిపురాన వేంకటసూర్య ప్రసాదరావు కవితతో ఇట్లా కైవారం చేసినారు.

''ఏకత్ర దుర్లభానేక గుణశాలికిని
పరసుగుణ పరమాణు పర్వతీ కరణాను
సంధాన చాతురీ సరసతా ధుర్యునకు
నఖిల విద్వత్కవి జనాంబుజవనప్రభా
కరుఁడైన శ్రీప్రభాకరశాస్త్రివర్యునకు - వందనాల్ (1940)

ప్రభాకరశాస్త్రిగారిపై మూడు పుస్తకాలు ప్రచురించిన యోగశిష్యులు శ్రీ కొత్తరామకోటయ్యగారు గురుపాదుల కిట్లు జోత లర్పించారు

తిరుపతిలో మాపుణ్యము
పరువంబై నిండి పండి ప్రాభాకరమై
గురుపాదుల రూపంబౌ
తరుణారుణ కాంతి నెపుడు తలతున్ మదిలో

ఇన్ని కోణాల్లో ప్రభాకరులను సమకాలికులు దర్శించారు

ప్రభాకరుల నిత్య సారస్వతజ్యోతి ఏనాడూ వెలుగులు చిమ్ముతూనే ఉంటుంది సర్వసాహిత్య ప్రక్రియలలోనూ వారి సర్వం కష మనీష కనబడుతుంది. ఏనాదుల భాషను ఈసడించలేదు పండితుల భాషను చంక కెత్తుకోలేదు. అంతటా సమభావమే. భాష ప్రజలందరూ అనుభవింపదగినదిగా ఉండాలని చాటి చెప్పిన సామ్యవాది. భాషావికాసము మానవ వికాసమునకు దోహద పడునను విశాల దృక్పథమున్న అభ్యుదయవాది అంతరించి పోతున్న ప్రాచీన గ్రంథాలనూ, శిల్పకళా ఖండాలను పెక్కింటిని సంతరించి పెట్టిన సంస్కృతి రక్షకుడు మధుర కవితా ప్రాభవంకల ప్రభాకరకవి ప్రతిభా'రవి' మౌలిక ప్రతిభ ఆయన ఆస్తి తిరుపతిలో హరిజన దేవాలయ ప్రవేశానికి నాయకత్వం వహించిన సంఘసంస్కరణకర్త ప్రజలలో తాత్త్విక చింతన పెరగాలని కోరుకొన్న ఆశావాది 'రేపు'లోనే జాతి భవిష్యత్తు కలదని నమ్మిన ఉదాత్త భావుకుడు. ఆయన ప్రాచీనులలో నవీనుడు నవీనుల్లో ప్రాచీనుడు ఇరుతెగల వారికి సువర్ణసుందర సేతువు

సాహిత్యాన్ని యోగాన్ని రెండు చేతులతో నడపిన సవ్యసాచి. వారి గురువులు మాష్టరు సి వి వి గారి ప్రభావమే సర్వనిర్వాహకమని, యెల్లప్పుడూ చెబుతూ, ఆర్తులు '(ట్రీటుమెంటు' వల్ల బాధలు తొలగి ఆనందంతో తిరిగి యిండ్లకు పోవునపుడు ప్రభాకరులు పొందే పరితోషము, ఆనందప్లుతీ ఏ చక్రవర్తికీ లభింపదు. 'అంతర్‌బహిశ్చ' వినీతవర్తనులు.

మహామనీషి - మానవతావాదీ - స్థితప్రజ్ఞులూ అయిన ప్రభాకరులు మనసున మసలిన ఎల్లవేళలా ఈశ్లోకం నాకు గుర్తుకు వస్తుంటుంది.

''సుగంధిపుష్పం వదనం సుగంధి
మనశ్చ తద్భావనయా సుగంధి''

(పూవు సువాసనలతో కూడినది వదనమూ సుగంధభరితమే. అంతేకాదు వాటి భావనచే మనస్సూ పరిమళవంత మవుతూంది)

# అనుబంధము - 1

# వేటూరి ప్రభాకరశాస్త్రిగారి రచనలు

**1. పరిష్కరణలు**

1. అప్పన చారుచర్య (1922)
2. ఉద్భటారాధ్య చరిత్ర (1925)
3 భగవదజ్జుకము (సంస్కృతము, 1925)
4. మనుచరిత్ర (1926)
5 బసవపురాణము (1927)
6. బసవోదాహరణము (1928)
7 నీతిద్విషష్టికా (సంస్కృతము, 1928)
8. క్రీడాభిరామము (1928)
9. బాలభాష (1930)
10 ఉత్తర హరివంశము (1937)
11. సుగ్రీవ విజయము (యక్షగానము. 1939)
12. హరవిలాసము (1939)
13. గ్రంథ వివరణికలు (Discriptive Catalogues) 19 సంపుటాలు
14. రంగనాథ రామాయణము (1942)
15. వేంకటేశ్వర వచనములు (1945)
16. అన్నమాచార్య సంకీర్తనలు IV & V సంపుటాలు (1947)
17. అన్నమాచార్య జీవిత చరిత్రము (1949)
18 ధనుర్విద్యా విలాసము (1949)
19 శృంగారా మరుకము (1949)
20. ఆంధ్రకామందకము (1950)
21 కాటమరాజు కథ (1950)
22. సుభద్రాకళ్యాణము (1950)
23 పావులూరి మల్లన 'సారసంగ్రహగణితము' - పరిష్కరణ (1950) ప్రచురణ (1952)

**2. పరిష్కృతములు - అముద్రితములు**

24 కాశీఖండము

25 శివతత్త్వ సారము

26 కవిలోక చింతామణి

27 నైషధ పారిజాతీయము

28 నన్నెచోడ కుమారసంభవము - 8 ఆశ్వాసములు మాత్రము

29 బేతాళ పంచవింశతి

30. భీమఖండము

31 నీలగిరి యాత్రా చరిత్రము

32 కేయూరబాహు చరిత్రము

**2. సంకలనములు :**

1 చాటుపద్య మణిమంజరి (1913)

2 ప్రబంధ రత్నావళి (1918)

3 చాటుపద్యమణిమంజరి ద్వి.భా (1922)

4 చాటుపద్య మణిమంజరి తృ.భా (అముద్రితము)

5. లక్షణోద్ధారము (1948-50)

6 శ్రీవేంకటేశ్వర లఘుకృతులు (1949)

7 శాసన సంకలము (క్రీ శ 4నుండి 12వ శతాబ్దము వరకు)

8. గాంధి రామాయణము (అముద్రితము)

**3. వ్యాఖ్యానములు :**

1. మనుచరిత్ర (1926)

2. ఉత్తర హరివంశము - 4వ ఆశ్వాసము (1946-49)

3 నన్నెచోడ కుమారసంభవము - 1వ ఆశ్వాసముల కొంత

4. నైషధ పారిజాతీయము (సంకల్పించినది)

**4. కథలు**

1. కామధేనువు కథ (1914)

2. కరుణకము (1924)

3. కలికి - చిలుక (1924)

4. తక్రానందస్వామి (1930)

5. పుణ్యవతి - భాగ్యవతి (1930)
6 కాకిపగ (అలభ్యము)

**5. చరిత్రలు**

1 తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర (1914)
2. శృంగార శ్రీనాథము (1923)
3 అన్నమాచార్య జీవిత చరిత్రము (1949)
4. ఆంధ్రదేశీయ 'సంస్కృత కవుల చరిత్ర' - కొంతవరకు (1923-24)

**6. అనువాద నాటకాలు :**

1. ప్రతిమ (1910) ముద్రణ (1927)
2. కర్ణభారము (1913)
3. మధ్యమ వ్యాయోగము (1913)
4 భగవదజ్జుకము (1924)
5. మత్తవిలాసము (1935)
6 నాగానందము (రెండంకములు మాత్రము)
7. గౌరీ కళ్యాణము (శ్రవ్యనాటిక - స్వతంత్ర రచన (1944)

**7. వచన కృతులు :**

1. నీతినిధి (ఆంగ్లమునుండి పరివర్తన - 1926)
2. తెలుగు మెఱుగులు (1948)
3. ప్రజ్ఞాప్రభాకరము (స్వీయచరిత్ర) ప్రచురణ 1951
4 మీగడ తఱకలు (ప్రచురణ - 1951)
5. సింహావలోకనము (ప్రచురణ - 1952)

## అనుబంధము - 2

### కవితా రచనలు

1 ఎడ్వర్డు పట్టాభిషేక శ్లోకములు (అలభ్యము) 1902)
2. ఒథెల్లో నాటకంలో పద్యాలు (1907 - అలభ్యము)
3. పార్థసారధి (1906-10)
4. శ్రీవేంకటేశ్వరస్వామి (1910)
5 నూతన వర్షము (1911)
6. పంచమజార్జి పట్టాభిషేకము (1911)
7. శ్రీనివాస నిర్యాణము (1911)
8 తంజావూరి ఆంధ్రరాజుల పీఠికలో (1914)
9. చల్లపల్లి జమీందారు అంకినీడు స్మృతి
10 తిరుపతి శాస్త్రి స్మృతి (1921)
11. మూన్నాళ్ళ ముచ్చట (ఖండకావ్యము) (1922)
12 రాజరాజనరేంద్ర ప్రశంస (1922)
13. ఏణీపంచకము (అనువాదము, 1923)
14. సమస్యాపూరణలు (1923)
15 అలవాటు (పద్యకథ 1923)
16 ప్రతాపరుద్ర కళ్యాణములో 3 శ్లోకాలకనువాదము (1924)
17. దివ్యదర్శనము (ఖండకావ్యము 1924)
18. కృతార్థుడు (1924)
19 కలికి - చిలుక కథలో పద్యాలు (1924)
20. చిత్రనళీయంపై (1924)
21. బాలభారతీ నాటక సమాజ ప్రశంస (1924)
22. మహాత్ముని ఉపవాసదీక్ష (1924)
23. కాళహస్తి - శివరాత్రి (1925)
24 సప్తపదులు ('తిరుప్పావైకి'కి అనువాదము 1925)
25. స్వాగతము (1925)
26. ఆశంసనము (1924)
27. గాథాసప్తశతి - 18గాథల తెనిగింపు (1925)
28. కడుపు తీపు (ఖండకావ్యము - 1925)

29 కపోతకథ (ఖండకావ్యము) - (1925)

30 విశ్వాసము (ఖండకావ్యము) - (1926)

31. దక్షిణాంధ్రబాలుఁడా ! (1927)

32 శరణార్థి (గేయము - 1927)

33 చిన్ననాటి చేష్టలు (ఖండకృతి - 1928)

34. జిజ్ఞాసువు

35. గోవర్ధన సప్తశతి - కొన్నింటి కనువాదాలు (1928)

36. చల్లపల్లిరాజా శ్రీశివరామప్రసాద్ పట్టాభిషేక ప్రశంస (1929)

37 శరణార్థి (1929)

38 పూలవిందు (అముద్రితము)

39 అర్ధాంగ లక్ష్మి (1930)

40 తెలుగు తెఱవ (1930)

41 శరణార్థి (1930)

42 ప్రాణేశ్వరుఁడు (అముద్రితము)

43. సతీర్థ్యసంప్రార్థనము

44 సనత్సుజాతీయము (అనువాదము - అముద్రితము)

45 పండితరాయ చాటువులు 2 అనువాదము (1940)

46. సీతాఫలము (గేయకథ - 1940)

47 నాగతి (1941)

48 భజగోవింద శ్లోకాలు - అనువాదము - గేయాల్లో)

49 సత్రశాల (ఖండకావ్యము)

50 మాతృశ్రీ (1944)

51. అమరావతీ శిల్పము (1943)

52. స్వాతంత్ర్యగీతం (15-8-47)

53. ఆస్థానకవి చెళ్ళపిళ్ళ పట్టప్రదానోత్సవము (1949)

54. పెండ్లి ముచ్చట (అముద్రితము)

55. నానా

56. నానావిధ చాటుధారలు

ఇవికాక గ్రంథరూపము పొందని వ్యాసములు మరికొన్ని కలవు.

## ఉపయుక్త గ్రంథసూచి

ప్రచురణ
వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
6/7 RT (New) విద్యానగర కోలనీ, హైదరాబాదు - 500457


1 రూపక మంజరి (1987)
2 వేటూరివారి పీఠికలు 1, 2 భాగాలు (1985, 1990)
3 ప్రభాకర స్మారిక 1, 2, 3, 4 భాగాలు (1989, 90)
4 వ్యాసప్రభాకరము
5 వ్యాస మంజరి (1988)
6 మణిమంజరి విశేష సంచికలు
7 ప్రజ్ఞాప్రభాకరము (1986) 3వ ముద్రణ
8 శృంగార శ్రీనాథము (1986)
9 చాటుపద్య మణిమంజరి 1, 2, భాగాలు (1988)
10 వారి పరిష్కృత గ్రంధాలు
11 వేటూరివారి సారస్వత వరివస్య (1986) - డా పోచిరాజు శేషగిరిరావు
12 మాశాస్త్రిగారు - కొత్త రామకోటయ్య - 3 సంపుటాలు (ప్రచురణ - చినకాకాని)